
ఆంధ్రసచిత్రవారపత్రిక
11-17, అక్టోబర్, '85
రు. 2-50
జన్యు చికిత్స చేతిలోనే
జాతి భవిష్యత్తు!
పెద్దకథ
మాయ
ప్రారంభం!

ఉషాకిరణ్ మూవీస్

# ప్రతిఘటన

నిర్మాత **రామోజీరావు** స్క్రీన్‌ప్లే దర్శకత్వం **కృష్ణ**

హరనాధరావు చక్రవర్తి నవకాంత్ గౌతంరాజు భాస్కరరాజు శేషు నిర్వహణ **అట్లూరి రామారావు**



# ఇంటిల్లిపాదినీ అలరించే ఆంధ్రపత్రిక ప్రచురణలు!


ఆంధ్రపత్రిక

పాక్ నుంచి అణ్వాస్త్ర ప్రమాదం ఎదుర్కోడానికి భారత్ సన్నాహం

పంజాబ్‌లో ఎన్నికలపై ఆగస్టు 15 లోగా నివేదిక

ఉగ్రవాదం అణచివేత: రాజ్యసభలో మంత్రి హామీ










చందాదారులుగా చేరండి!

వివరాలకి

* సర్క్యులేషన్ మేనేజరు
ఆంధ్రపత్రిక
గాంధీనగర్
విజయవాడ–520003
ఫోన్ 61247

* సర్క్యులేషన్ మేనేజరు
ఆంధ్రపత్రిక
బషీర్‌బాగ్
హైదరాబాదు–500029
ఫోన్ 36992









## ముఖచిత్రం

భంగిమై
భావరసలొలికించు శిల్పమై
మనోహర రూప సజీవమై
నవరస ప్రస్ఫుట మోహినియై
సర్వాంగ సుందర లాలిత్యమై
ఆంధ్రసచిత్రవారపత్రిక ముఖచిత్రమై
ఎప్పారె జయప్రద రమ్యప్రదియై

కె సురేంద్రనాద్ గోరంట్ల

## సీరియల్స్

ప్రతిభ సీరియల్ ప్రారంభంలోనే నన్నాకట్టుకుంది నాట్యం గురించి విపులంగా వ్రాస్తున్నారు ముదిగొండ శివప్రసాద్‌గారికి కృతజ్ఞతలు ప్రతిభ కళారాధనకి ఆమె భావకౌశలానికి మేం ముగ్ధులవుతున్నాం

కొండమూరి శ్యామ గుత్తినదివి

* * *

బొసుబాబుగారు రచించిన అంతరాలు అంతర్యాలు సీరియల్ అత్యంతాసక్తిదాయకంగా ఉంది మధ్య తరగతి సంసార సాగర సమస్యా తరంగాలకు పరిష్కారపు చెలియలి కట్ట ఎలాగూ ఉండక తప్పదు రచయితకి నా హృదయ పూర్వకాభినందనములు

ఆకెళ్ల సుబ్బారావు కందికుప్ప

* * *

జయప్రద ముఖచిత్రంతో వెలువడిన వారపత్రికలోని అంతరాలు 'అంతర్యాలు సీరియల్ రసవత్తరంగా వుంది ప్రారంభ సంచికలో కాస్త విసుగనిపించినా తరువాతి సంచికలో శైలి వేగాన్ని పుంజుకుంది

చీకటి సుబ్రహ్మణ్యం ప్రొద్దుటూరు

* * *

సూర్య చంద్ర జయప్రద ముఖచిత్రం శతకోటి సూర్య చంద్రుల వెల్గులు వెదజల్లి మమ్మలరించింది శృతశ్రుత నర్సింగ్‌హోమ్ ప్రతిభ అంతరాలు అంతర్యాలు సిరియల్స్ మా యింటిల్లిపాదిని ముగ్ధుల్ని చేస్తున్నాయి

వై చంద్రశేఖరరెడ్డి ఇతరులు బెంగళూర్

## కథలు

నటి రజని ముఖచిత్రంగల 16-22 ఆగస్టు 85 సంచికలో ఈ సమాజంలోని ఆస్పత్రుల దుస్థితి డాక్టర్లు నర్సులు స్వీపర్లు పేషంట్లతో ఎలా ప్రవర్తిస్తారో విముక్తి కథలో రచయిత చక్కగా రచించారు

ఖలీల్ జహార్ జమీల్ జలీల్
కర్నూలు

* * *

23-29 ఆగస్టు సంచికలో ఇల్లాలి స్వర్గం కథ నాకు బాగా నచ్చింది కథ చివర శిరీష మాటలు నిజం ఆడది ఇంట్లో స్వేచ్చను కాదని బయట స్వేచ్చ కావాలని కోరుకోవడంలో అర్థంలేదు పోతే అమ్మాయిలూ ఎరికితనం మానండి ఎదురు దెబ్బ కథలు కూడ ప్రస్తుత సమాజంలో సమస్యలకు గురి అయిన ఆడవాళ్లకోసం కర్తవ్యాన్ని భోదించేవిలా వున్నాయి

శ్రీమతి పరాగిత్
పులివెందుల

## సుభాషితాలు

ఆంధ్రపత్రిక (వారపత్రిక)లో వెలువడె సుభాషితాలు చాలా క్లుప్తముగ మంచి సందేశాన్ని అంద చేస్తున్నవి

డాక్టర్ టి శ్రీనివాసన్ విజయవాడ

## న్యూఢిల్లీ లేఖ

డా జయదుబాష గారి లేఖ పత్రికకు ఆణిముత్యం! ఆయన వివరించే ఆర్థిక వ్యవస్థ ఎంతో మేలుగా వుంది మాకు తెలియని విషయాలెన్నో వారి వ్యాసం ద్వార తెలుసుకుంటున్నాము వారు చెప్పె ప్రతి విషయం మాకు కళ్ళకు కట్టినట్టుగా వున్నాయి

బందిగి బాలరాజు రాంబాబు బస్వరాజు
నారాయణపేట □




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938 1972)

శుక్రవారం 11 17 అక్టోబరు 85
శ్రీ క్రోదన నామ సం భాద్రపద బ ద్వాదశి

సంపుటము 78 సంచిక 5

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2 50 |
| పోస్టులో 6 నెలల చందా | రు | 71 50 |
| పోస్టులో 12 నెలల చందా | రు | 143 00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ 520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం
నటి రాధ
(ఫోటో కె ఆర్ వి భక్త)

# ప్రెస్టీజ్
# ప్రెషర్ పాన్

## దీనితో వండిన భోజనం తింటే ఎంత సంతృప్తికలుగుతుందో దీనితో వండడం కూడా అంత సంతృప్తికరంగాను వుంటుంది!



వేపుడు



హెచ్చు వేపుడు



సాచ్



ప్రెషర్ కుక్



బిర్యానీని చాకచక్యంతో వండండి లేదా గ్రుడ్డును వేగంగా వేపండి లేదా పూరీని చక్కగా పొంగించండి మరి కూరను చకచక తయారుచేయండి అన్నీ నిమిషాలమీద ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ అంతటి బహుళ ప్రయోజనకారి అన్నమాట అది అంత వాటంగా, వసతిగా వుంటుంది దీనిలో మీరు వేపుడు, హెచ్చు వేపుడు దోరవేపుడు మరియు ప్రెషర్ కుకింగ్ చేయవచ్చు

ఒక్క ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మాత్రమే నూటికి నూరు పాళ్ళ భద్రతను సమకూర్చగల అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టంను కలిగియున్నది

ఇప్పటికే ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ మీవద్ద వుండివుంటే మూత లేకుండా దీనిని కొని ఎక్కువగా సొమ్ము ఆదాచేసుకోండి లేదా సొంత మూత కలదానిని కొనండి ఈ ప్రెషర్ పాన్ మీకోసమే మరి

Prestige
PRESSURE
PAN ©

TTK తయారీ.

MAA (S) PP1B TEL 84

# పేదరికంపైన చుక్కల హోటళ్లలో ప్రసంగాలు!

జార్జ్ అర్‌వెల్ రాసిన ఎనిమల్ ఫారమ్ ప్రచురింపబడి ఇప్పటికి దాదాపు 40 సంవత్సరాలు అయింది మొట్టమొదట ఈ పుస్తకం లండన్‌లో 1945 సెప్టెంబర్‌లో విడుదల అయింది రెండవ ప్రపంచ యుద్ధం పరిసమాప్తం అయి జపాన్ లొంగిపోయిన అనంతరం కొద్ది వారాలకే ఈ పుస్తకం వెలువడింది బైబిల్ కన్నా ఎక్కువ కాపీలు అమ్ముడుపోయిందని అనేవారు అది ఆ పుస్తకానికీ దాని రచయితకీ ఎంతో ఘనత అప్పటికి అర్‌వెల్ ఒక మామూలు పత్రికా రచయిత మాత్రమే జీవిక కోసం లండన్ సమీపంలో ఒక దుకాణం పెట్టుకున్న ఆయనకి వారానికి ఓ వంద రూపాయలు కన్నా ఎక్కువ ఆదాయం ఉండేదికాదు

అర్‌వెల్‌ఈ పుస్తకాన్ని 1943 నవంబరు 1944 ఫిబ్రవరి మధ్యకాలంలో రాశారు అయినా 1945 సెప్టెంబర్ దాకా అది ప్రచురణకి నోచుకోలేదు మిగతా ప్రేమకథలతో పోలిస్తే మాత్రం అది ఒక పెద్ద నవల ఏమీ కాదు ఆ పుస్తకంలో మొత్తం 25 వేల పదాలు ఉన్నాయి దాని ప్రచురణ కోసం అర్‌వెల్ ప్రముఖ ప్రచురణకర్తల నెందరినో కలుసుకున్నాడు కానీ దానిని ప్రచురించడానికి వారెవరూ సుముఖతని వ్యక్తం చెయ్యలేదు అందుకు ఏవేవో కారణాలని చెప్పారు కానీ అవన్నీ కేవలం సాకులు మాత్రమే సోవియట్ రష్యాకి వ్యతిరేకంగా ఉన్న ఆ పుస్తకాన్ని ప్రచురిస్తే దానికి ఆగ్రహం కలుగుతుందని ఆ ప్రచురణకర్తలు బావించారు

ఆ పుస్తకంలో అర్‌వెల్ రాసిన ముందు మాటలో సోవియట్ యూనియన్ చెప్పే కట్టు కథలనించి బయటపడితే తప్ప సోషలిస్టు ఉద్యమాన్ని పునఃప్రారంభించలేమని గత పదేళ్లలో తాను చూసిన దాన్ని బట్టి నమ్మకం కలిగినట్లు ఆయన పేర్కొన్నాడు ఆ పుస్తకాన్ని రాయడానికి ఆయనకి అనుకున్న దాని కన్నా ఎక్కువ కాలమే పట్టింది రిపబ్లికన్స్ కోసం స్పెయిన్‌లో ఫ్రాంకోకి వ్యతిరేకంగా పోరాడుతున్నప్పుడే ఆయనకి మొట్టమొదట ఈ పుస్తకం రాయాలన్న ఉద్దేశం కలిగింది అంతేకాక అప్పుడు ఫ్రాంకోకి రహస్యంగా సహాయం చేస్తున్న స్టాలిన్ కింద ఉన్న అధికారులకి కూడా అయన వ్యతిరేకంగా పోరాడారు ఈ సోవియట్ అభూతకల్పనలని ఒక కథగా రాసి వెలుగులోకి తేవాలని అప్పుడే ఆయన నిర్ణయించుకున్నారు ఆ కథ దాదాపు అందరికీ తేలికగా అర్థం అయేలా ఏ భాషలోకైనా అనువదించడానికి వీలుగా ఉండాలని ఆయన బావించారు మార్క్స్ సిద్ధాంతం జంతువుల దృష్టిలో నించి చూస్తే ఎలా ఉంటుందన్న విషయాన్ని ఆయన ఆ పుస్తకంలో విశ్లేషించారు దానిని వివరిస్తూ జంతువులని మనుషులు ఉపయోగించుకున్నట్లే ధనికులు అధికారం ఉన్నవారు బడుగువర్గాల వారిని దోచుకుంటున్నారని ఆయన అన్నారు

ఈ పుస్తకాన్ని కమ్యూనిస్టులు వారి అడుగులకి మడుగులొత్తే కింగ్‌స్లీ మార్టిన్ (న్యూ స్టేట్స్‌మన్) వంటి వారు దుయ్యబట్టారు కింగ్‌స్లీ మార్టిన్ అర్‌వెల్‌పై దావా కూడా వేద్దామనుకున్నాడు ఆ పుస్తకంలో తనకి దగ్గర పోలికలు ఉన్న పాత్ర ఒకటి ఉందని ఆయన ఆరోపణ కానీ యుద్ధానంతరం అధికారంలోకి వచ్చిన లేబర్ పార్టీ ప్రభుత్వంలో మంత్రిగా చేరిన అన్యూరిన్ బెవాన్ ఆయనన్ని ఆ ప్రయత్నం నించి విరమింప చేశారు అర్‌వెల్‌కి మార్టిన్ అంటే పడదు కింగ్‌స్లీ మార్టిన్ నెహ్రూకి గురుతుల్యుడు నెహ్రూ ఎప్పుడూ విప్లవాలని విఫలం చేసే వారినే సమర్థిస్తూ ఉంటారని నాకనిపిస్తుంది కింగ్‌స్లీ మార్టిన్ కృష్ణమీనన్‌ల వంటివారు లిబరల్స్ అయినా వాళ్లకి నిజమైన విప్లవం అంటే ఏమిటో తెలియదు




గతంలో ఒకసారి నేను ఈ శీర్షికలో రాసినట్లుగా అర్‌వెల్‌ని నేను 1946 జూలై లేదా ఆగస్టులో మొదటిసారి కలుసుకున్నాను నెల నాకు సరిగా గుర్తు లేదు అప్పటికి ఎనిమల్ ఫారమ్ ప్రచురింపబడి సంవత్సరం అయింది ఆసరికే అర్‌వెల్‌కి మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చాయి అయితే అప్పటికే ఆయన తమ చరమ దశలో ఉన్నట్లు ఆయనకి గానీ ఆయన్ని ఎరిగిన మాకు గానీ తెలియదు మేము ఆయనని మొదటిసారి కలుసుకున్నప్పుడు తన చివరి పుస్తకం నైన్‌టీన్ ఎయిటీఫోర్ రాస్తున్నారు కానీ అప్పుడాయనకి ఆ పేరు పెట్టాలన్న ఉద్దేశ్యం లేదు నా ఊహ ప్రకారం దాని పేరు ది లాస్ట్ మాన్ ఆఫ్ యూరోప్ నేను అనుకున్నది సరికాకపోవచ్చు మీరే కనుక అర్‌వెల్‌ని కలుసుకుని ఉంటే ఆయన ఎన్నో అద్భుతమైన విషయాలని చెప్పేవాడు కాగితం మీద రాసుకుంటే తప్ప అవి గుర్తు ఉంచుకోటం కష్టం పారిస్‌లో పళ్లాలు కడగటం కెంట్‌లో కూలి పని చెయ్యటం మాండలేలో పోలీసు ఉద్యోగం లాంటి వెన్నో చెప్తూ అసలు మొదలెక్కడో చివరెక్కడో ఆయనకే అంతు పట్టని విధంగా వివరించేవారు

మనలో చాలా మందికి తెలియదు కానీ అర్‌వెల్ అసలు బారతదేశంలోనే పత్రికా రచయిత అయి ఉండేవాడు లక్నో నించి వెలువడే పయొనీర్ పత్రిక ఆయనని 1938 లో సహాయ సంపాదకుడిగా ఉద్యోగంలో చేరమని కోరింది అప్పుడు ఆ పత్రికకి సంపాదకుడుగా ఉన్న డెస్మాండ్ యంగ్ ఆయన పుస్తకాలు చదివి ఎంతో అబిమానించాడు ఆ పత్రికకి అర్‌వెల్ సహాయ సంపాదకుడిగా ప్రధాన సంపాదకీయ రచయితగా బాధ్యత స్వీకరించి ఉండేవాడే కానీ లండన్‌లో ఉన్న ఇండియా ఆఫీసు వారు ఆయన బారతదేశం రావడానికి ఇష్టపడలేదు భారతదేశంలో ఆయన వల్ల కొన్ని చిక్కులు రావచ్చుని వారు అనుకున్నారు అందుకే తమ అభ్యంతరాన్ని తెలిపారు అర్‌వెల్ తాను సోషలిస్టునని యంగ్‌తో కూడా చెప్పారు బర్మాలో పోలీసు ఉద్యోగాన్ని బ్రిటిష్ సామ్రాజ్యంపై అయిష్టం కారణంగా వదిలి వేసినట్లు చెప్పారు

కానీ ఇండియా ఆఫీసువారు ఆర్వెల్‌కి పయొనీర్‌లో వచ్చిన అవకాశాన్ని కాలరాచారు బోయర్ యుద్ధం జరుగుతున్నప్పుడు చర్చిల్ బెంగుళూరు నించో దక్షిణ ఆఫ్రికానించో పయొనీర్‌కి వ్యాసాలు పంపిస్తూ ఉండేవారు అందుకే దానికి బ్రిటిష్ ప్రభుత్వం నించి రహస్యంగా ధన సహాయం అందుతూ ఉండేది ఆర్వెల్‌కి మాత్రం ఈ విషయాన్ని తెలియనివ్వలేదు

ఎనిమల్ ఫారమ్ ఒక మంచి గ్రంధం ఆధునిక సాహిత్య విలువలు ఉన్నటువంటిది లండన్‌లో విద్యార్థిగా అడుగు పెట్టిన రెండు నెలలకే నేను ఆ పుస్తకాన్ని చదివాను అందులో కమ్యూనిజం అన్నమాట ఎక్కడా కనిపించదు విప్లవం అన్న పదమే కనిపిస్తుంది కానీ అందులో చెప్పింది మాత్రం విప్లవాలని మోసంతో విఫలం చెయ్యడం గురించే స్టాలిన్‌లోని రెండు ప్రకృతులని ఆర్వెల్ చూడగలిగాడు స్టాలిన్‌కి పేదరికం అంటే ఏమిటో తెలుసు ఆయన కింది నించి వచ్చినవాడే మన లిబరల్స్ లా డ్రాయింగ్ రూమ్‌కే పరిమితమైన వ్యక్తి కాదు వాళ్ళు న్యాయవాదులైనా పత్రికా రచయితలైనా ప్రతిఫలం బాగా ముడితే ప్రపంచ బాంక్ నించి హాజీ మస్తాన్ వరకూ ఎవరి తరఫున అయినా పని చెయ్యడానికి సిద్ధపడతారు ఎయిర్ కండిషన్ గదులలో కూర్చుని పేదరికాన్ని గురించి పేదలు ఎలా అణగద్రొక్కబడుతున్నారన్న దానిని గురించి మాట్లాడ్తారు వాటికి సంబందించిన సెమినార్‌లకి హాజరు కావడానికి ఒక అయిదు చుక్కల హోటల్ నించి మరొక అయిదు చుక్కల హోటల్‌కి వెళ్తూ ఉంటారు అక్కడ పేదరికాన్ని గురించి పేదలని అణగదొక్కడం మీద ఉపన్యాసాలు ఇస్తారు వాళ్లకి అందులో తప్పు ఏదీ కనిపించదు నెహ్రూ తాము 40 గదుల బవనంలో ఉంటూ తమ పార్టీ వారికి సోషలిస్టు తరహా సమాజాన్ని స్థాపించడానికి చేయూత నివ్వమని చెప్పేవారు రాజీవ్‌గాంది తాము లిబరల్ అని చెప్పుకోలేదు కానీ పటిష్టమైన రక్షణ వలయం ఉన్న కోటలాంటి కొత్త నివాసంలో ఉంటూ పంజాబ్ ఇతర చోట్ల ఎన్నికలు స్వేచ్ఛగా జరగాలని చెప్తారు మీకూ మీ ప్రతినిదిగా ఉన్న వారికీ గల ఈ తేడాయే ఇప్పటి సమస్యలకి మూల కారణం ఆర్వెల్ తనకీ తాను రాసిన వారి జీవితవిదానాలకీ దగ్గరి పోలికలు ఉండేలాచూసుకున్నాడు ఎవరి కోసం అయితే తన కలంతో పోరాటాన్ని సాగించాడో వారి జీవితాలకి ఆయన జీవితానికి తేడా ఉండేది కాదు నెహ్రూతో ప్రారంబం అయిన ఈ ప్రస్తుత వ్యవస్థ నెహ్రూ తత్వానికి మనం దూరం అయే వరకూ ఇలాగే ఉంటుంది నెహ్రూకి కింగ్స్లీ మార్టిన్ ఎందుకు అంత దగ్గర అయినారో నాకు ఇప్పుడు తెలుస్తున్నది ముక్కుకి సూటిగా పోయే సాదారణ స్థాయిలోని వ్యక్తి అయిన ఆర్వెల్ మార్టిన్ దృష్టికి ఆనలేదు □

## రాజకయ్యాలు

శంకు












## పెద్ద కథ ప్రారంభం!

# మలుపు

ఆడూరి సావిత్రి

**స్ప్రింగ్‌డోర్ తెరుచుకుని లోపలికి అడుగు పెట్టిన ఉదయ నిశ్చేష్టురాల్లా నిలబడిపోయింది...**

**"యస్ ... రాసుకోండి." తల ఎత్తకుండానే హడావుడిగా చెప్పుకుపోతున్నాడు జయరాం ...**

**ఆమె కళ్ళలో నీళ్ళు గిర్రున తిరుగుతున్నాయి. కింది పెదవిని పైపంటితో నొక్కిపట్టి ఉద్వేగాన్నణుచుకుంటోందామె యాంత్రికంగా ఆమె చేతి వేళ్ళు అతను చెపుతున్న మేటర్‌ను రాసుకుపోతున్నాయి**

చెప్పటం పూర్తిచేసి తల ఎత్తిన జయరాం అదిరిపడ్డాడు అతని కళ్ళు ఆమెను అపనమ్మకంగా చూస్తున్నాయి

ఉదయా! నువ్వు నువ్వు! ఆశ్చర్యం విషాదం కలిసి పెనవేసుకున్నాయతని మొహంలో

చేతి గోళ్ళ వేపు గోడల వేపు సీలింగ్ వేపూ చూస్తూ దుఃఖాన్ని తొక్కిపట్టే ప్రయత్నం చేస్తోందామె

అక్కడ నుంచి పారిపోవాలనుంది అక్కడే ఇంకొంచం సేపు ఉండాలనీ ఉందామెకు

ఉదయా ఆర్తిగా అన్నాడతను

వస్తాను సర్ త్వరగా టైప్ చేసి మీరు చెప్పిన టైంకే అందిస్తాను అంటూ వెళ్ళిపోతున్న ఉదయను ఇంకా విభ్రాంతిగానే చూస్తున్నాడు జయరాం

ఆమె ఆమె ఉదయ!

ఎన్నిసార్లు ప్రయత్నించినా తను ఆమె ఉనికిని తెలుసుకోలేక పోయాడు

అలాంటిది తలవని తలంపులా దైవమిచ్చిన వరంలా హఠాత్తుగా ఇక్కడ ప్రత్యక్షమైందామె!

ఉద్యోగం చేస్తోందా?

ఔను చెయ్యకేం చేస్తుంది?

బాబిలా ఉన్నాడో చదువుకుంటున్నాడా?

ఉదయ ఈ వూర్లో ఎక్కడుంటోంది?

ఆమెతో పాటా ఇంట్లో ఎవరెవరున్నారు?

ఎవరు చెపుతారీ ప్రశ్నలకు జవాబులు?

ఉదయ కూడా తనను మర్చిపోలేదు!

మర్చిపోయే అనుబంధమా తమది? తను ఆమెకు చేసిన ద్రోహం సామాన్యమైందా?

అన్ని విధాలా తననే నమ్మి తన వాళ్ళందరినీ వదిలేసి తనతో జీవితాన్ని పెనవేసుకున్న ఉదయను వెన్నుపోటు పొడిచి తిరిగి చూడకుండా వచ్చేసిన ద్రోహి తను

ఉదయ ఎంత అమాయకంగా ఉండేది!

తనంటే ఎంత అనురాగాన్ని చూపేది!

కుర్చీలో వెనక్కి జార్లబడి కళ్ళు మూసుకున్నాడు జయరాం అతని కంట్లోంచి రెండు పెద్ద పెద్ద అశ్రుకణాలు జారి జుట్టులో పడి ఇంకిపోయాయి

ఉదయా ఉదయా అని ఆక్రోసిస్తోందతని మనసు

టైప్ చేస్తోంది ఉదయ అన్నీ శుద్ధ తప్పులే అప్పటికే ఉండ చుట్టి విసిరేసిన కాయితాలతో బాస్కెట్ సగం వరకూ నిండిపోయింది

తను వీటినీ రోజు సవ్యంగా టైపు చేసి అతను కోరిన టైంలో అందివ్వగలదా?

కళ్ళలోకి ఉబుకుతున్న నీటి పొరలు ఎంత ప్రయత్నించినా కాగితాల్లో ఉన్న అక్షరాలను చూడనివ్వటం లేదు అవి ఎవరి కంటా పడకుండా ఉండటం కోసం తల బాగా ఒంచుకుని పక్కకు తిప్పుకునీ అవస్థపడుతోంది ఉదయ

అతను జయరాం!

ఎంత యాదృచ్ఛికం!

కలలో కూడా అనుకోలేదు తామిద్దరూ ఇలా



ఎదురుపడతారని

ఇప్పుడిప్పుడే మనసు రాయి చేసుకుంటోంది తను

రాయి చేసుకుందా?

మరయితే ఇప్పుడెందుకీ అలజడి?

కాదు కాదు మనసు రాయి చేసుకున్నానని తను భ్రమపడుతోంది అంతే

తను ఎంతగా వాటిని గుండె లోతుల్లో పాతేసుకోవాలని ప్రయత్నించినా అనేక రాత్రులు అవి వెలుపలికి తన్నుకొచ్చి తనను హింసించి కుళ్ళబొడిచి చంపేవి

ఆ జ్ఞాపకాలు! వాటిలో తీపి లేదు

ఓహ్! లాభంలేదు

ఈ పూట తనింక ఆఫీస్‌లో ఉండటం అనవసరం తను వీటిని సరిగ్గా టైపు చెయ్యగలగటం అసాధ్యం ఇంటికెళ్ళాలి ఏకాంతం కావాలి

చప్పున లేచి నిలబడింది ఉదయ

పర్మిషన్ అడుగుతున్న ఉదయను ఎర్రటి కళ్ళతో చూశాడు జయరాం

ఆమె ముఖం కుంభవృష్టిని దాచుకున్న కారు మేఘాచ్ఛాదిత ఆకాశంలా ఉంది

వెళ్ళు అన్నాడతను బలవంతంగా

ఉదయా అన్నాడు తను మళ్ళీ

వెనుతిరిగి చూడకుండా ఆగి నిలబడిందామె

బాబు బాబు బావున్నాడా!?

ఆ

ఎక్కడుంటున్నారు?



ఆ ప్రశ్నకు సమాధాన మివ్వకుండా చరచరా వెళ్ళిపోయిందామె

ఒక బలమైన నిట్టూర్పు అతని ఆలోచనల్ని తెంచుకుని వెలువడింది

రిక్షాలో ఇంటికొచ్చి తలుపు తాళం తీస మంచంమీద అస్తవ్యస్తంగా పడుకుంది ఉదయ

ఆనాటి అనుభూతులూ వాటికి సంబంధించిన ఆలోచనలూ తుఫానులో సముద్ర కెరటాల్లా ఉధృతంగా విరుచుకు పడుతున్నాయామె మీద

గతం ఆమెను కోసేస్తోంది రాక్షసంగా తనవేపు లాక్కుపోతోంది

అప్పుడు అప్పుడు!

ఈ నల్లపిల్ల ఉదయకు అంత చక్కని వరుడెక్కడ దొరికాడమ్మా!

లక్కీ ఫెలో మొత్తానికి రాజాలాంటి వాణ్ణి కొట్టేసంది

మంచి హోదా గల ఉద్యోగం కూడా చేస్తున్నాట్ట ఇన్ని ఉండి అతను ఉదయను వరించటం ఈ పిల్ల అదృష్టం!

ఇలాంటి సరసోక్తుల్ని వింటూ మా ఉదయకేం బంగారుబొమ్మ! కాస్త రంగు తక్కువనే గానీ చక్రాలాంటి కళ్ళూ కళకళలాడే ముఖం అద్భుతమైన తలకట్టూ అతను దీన్ని కోరి కోరి చేసుకుంటున్నాడు! మురిపెంగా అన్నది ఉదయ తల్లి

అతను జయరాం బావుంటారు తెల్లగా హుందాగా కవ్వించే కళ్ళతో నవ్వులూరే పెదవులతో చక్కని పర్సనాలిటీతో

అతనికి తనలో ఏం నచ్చిందో!

ఆశ్చర్యంగా అబ్బురంగా అనుకుంటోంది ఉదయ

పెళ్ళయ్యాక ఇదే ప్రశ్న తను అడిగితే

నీలో ఏం నచ్చిందా? చెప్పనా? తరవాత నువ్వు నన్ను తిట్టకూడదు నువ్వే అడిగావు గనక చెపుతున్నా అంటూ కొంటెగా ఆమెలో తనకేం

# "మలుపు"

నచ్చాయో అతను వరసగా చెపుతుంటే సిగ్గుతో తలెత్తలేక పోయింది ఉదయ

ఇంకా ఆమెను కాపరానికి పంపలేదు

ఆషాడం అడ్డం వచ్చింది

అది వెళ్ళాక ఆ కాస్త అడ్డూ తీర్చేస అమ్మాయిని పంపిస్తాం అని ఉదయ తల్లిదండ్రులంటే జయరాం తల్లి సరేనంది

రాక్షసిలా ఈ ఆషాడం ఒకటి!

అత్తాకోడళ్ళూ అత్తా అల్లుళ్ళూ ఒక గడప దాటకూడదట!

అందుకని తను జయరాం దగ్గరకెళ్ళకూడదు అతనిక్కడికి రాకూడదు!

అప్పుడు జయరాం అతని తండ్రి కూడా గుంటూరులోనే ఉద్యోగం చేస్తూ ఉండటంతో అంతా కలిసే ఉండేవారు

ఉదయా! ఎలా?

నీకేమన్నా ఐడియా వస్తోందా? నాకు ఈ ఊర్నుంచి ట్రాన్స్‌ఫరైనా బావుండేది అప్పుడు నువ్వూ నేనూ కలిస వేరే ఇంట్లో ఉండేవాళ్ళం అప్పుడీ అత్తలూ గడప దాటటాల గొడవ ఉండేదికాదు

కానీ నా ట్రాన్స్‌ఫర్ ఇంత అర్జంటుగా ఈ ఆషాఢంలో నే వచ్చెయ్యదే!

ఎలా?

మీ వాళ్ళకీ మా వాళ్ళకీ ఇలాంటి చాదస్తాలకు కొదవలేదు మనకెవరు హెల్ప్ చేస్తారు?

పాపం! ఉదయా జయరాం ఆషాడం పేరుతో నానా హింసలూ అనుభవిస్తున్నారు వాళ్ళిద్దర్నీ కలిపి మనింటికా ఆహ్వానించి కాస్త ఏకాంతం కల్పిద్దాం అని ఒక్కరంటే ఒక్క బంధువు కూడా అనుకోదేం?

విశ్వాసఘాతకులు! ఇంచక్కా మన పెళ్ళికొచ్చి హాయిగా ఎంజాయ్ చేశారు గదా! ఆ కృతజ్ఞతయినా లేదు మనకింత కష్టమొస్తే ఆదుకోటానికి ఎవరూ ముందుకు రావటంలేదు!

కలికాలం ఉదయా!

బొత్తిగా పక్కవాడి గురించి పట్టించుకోని కాలం!

నో! నా వల్ల కాదు

అసలీ పిచ్చి నమ్మకాలను సృష్టించిందెవరో గానీ వాళ్ళకు బొత్తిగా ప్రేమతత్వం గురించి తెలీదు!

ఉదయా ఉదయా ఉదయా

ఎలా? ఎలా?

ఇలా ఉండేవి జయరాం ఉత్తరాలు

అవి చదువుతుంటే ఆమెకు నవ్వొచ్చేది

ఏయ్ మొద్దూ ఏం మాట్లాడవేం? అని ముద్దుగా విసుక్కునేవాడు

తనేం చెపుతుంది? ఏమిటి రాయటం!? అంతిదిగా ఉంటుందా!

మరి పెళ్ళి కాకముందేం చేశారో!

తను మాత్రం?

అస్తమానం అతని సామీప్యాన్నే కోరుకోటంలేదూ?

తనూ పెళ్ళి కాక ముందేం చేసంది?

రెండు రోజులకో ఉత్తరం రాస ఉదయను రెచ్చగొట్టేవాడతను

ఎవేవో ప్రశ్నలడిగి జవాబులివ్వటం లేదని అలిగేవాడు జవాబులివ్వగల ప్రశ్నలేనా అవి!?

కాస్త కూడా సిగ్గు లేదతనికి!

ఒక మహా ప్రవాహంలా పొంగి పొరలే సెలయేరులా ఆమెను చుట్టుముట్టి ఊపిరాడనివ్వకుండా చేసేవాడతను

ఉత్తరాలే ఇలా ఉంటే ఇహ అతన్ని ప్రత్యక్షంగా తనేం ఎదుర్కోగలదు!? చిరునవ్వుతో అనుకొనేది ఉదయ

దాయాది ఒకరు చనిపోతే పదకొండో రోజు నాటికి ఉదయ తల్లిదండ్రులిద్దరూ ఆ వూరెళ్ళారు మళ్ళీ రాత్రి కొచ్చేస్తామని చెప్పి

ఇంట్లో ఉదయ ఆమె చిన్నతమ్ముడు నానీ ఉన్నారు పైట చెంగు బొడ్లో దోపుకుని బూజులు దులుపుతోంది ఉదయ

అక్కా! బావగారు! ఒగురుస్తూ వచ్చి చెప్పాడు నానీ

ఎక్కడ! ఎక్కడరా? వస్తున్నారా? ఖంగారుగా సంభ్రమంగా అన్నది ఉదయ గుండె గొంతులో కొస్తున్నట్లున్న దామెకు

ఫుల్ సూట్‌లో ఉన్న జయరాం అప్పటికే గుమ్మంలో నిలబడి ఉన్నాడు చిరునవ్వుతో

తడబడుతూ అతని చేతిలో బ్రీఫ్‌కేస్ అందుకుని లోపలికి రండి అన్నది ఉదయ కళ్ళు వాల్చుకుని

వచ్చి సోఫాలో కూర్చున్నాడతను

ఉదయ ప్రతి కదలికనూ కుతూహలంగా గమనిస్తున్నాడు జయరాం

అడుగులు తడబడుతున్నాయి ఉదయకు నానీ ఎప్పుడో ఆటలకు జారుకున్నాడు

కాఫీ కలిపి తెచ్చి అతనికిచ్చింది



ప్రథమ చికిత్సతాలుకు వార్త!

# గుండ్రానివీ, పట్టీలూ

## కేవలం బ్యాండ్-ఎయిడ్ మాత్రమే వీలైన యీ ఆకారాల్లో వస్తుంది




గుండ్రటి డ్రెసింగ్, మరేదీ సరిపడదు దీనికి




చదరపు డ్రెసింగ్, మరేదీ పట్టుకోదు అలా




**బ్యాండ్-ఎయిడ్**

మరింతగా కాపాడేది, మరింత త్వరగా మాన్పేది

Johnson & Johnson

నువ్వే చేశావా? నవ్వుతూ అడిగాడతను

ఔనన్నట్టుగా తలూపిందామె

అద్భుతంగా ఉంది ఖాళీ కప్పు టేబుల్ మీద పెట్టే నెపంతో ఒంగి ఆమె చెయ్యి అందుకున్నాడు

ఎవరున్నారింట్లో? అన్నాడు

ఎవరూ లేరు చెయ్యి విడిపించుకుంటూ అన్నది ఉదయ ఆమె గొంతు ఆమెకే వినిపించటల్లేదు

ఊరికే ఇంట్లోకీ బయటికి ఏదో పని కల్పించుకుని తిరుగుతున్న ఉదయ ఖంగారునూ తడబాటునూ చూసి నవ్వును అణుచుకుంటూ ఇలా వచ్చి నా పక్కన కూర్చో ఉదయా ఏదైనా మాట్లాడు అలా తిరిగితే బెరుకు తగ్గుతుందా?

పోనీ నే వెళ్ళిపోనా? అనీజీగా ఉందా నీకు? అన్నాడు జయరాం

లేదు లేదు మీరెళ్ళొద్దు అన్నదామె ఆందోళనగా

మరయితే ఇలా వచ్చి కూర్చో

సోఫాలో అతని పక్క తలదించుకుని కూర్చుందామె

ఉదయా! మాట్లాడవా?! మృదువుగా అంటూ దగ్గరగా జరిగాడతను

అతని భుజం ఆమెను ఒరుసుకుంటోంది అతన్నుంచి వస్తున్న ఇంపోర్టెడ్ సెంటు పరిమళాలామెను మత్తులో ముంచుతున్నాయి అతని చెయ్యి ఆమె మెడ దగ్గర వెచ్చగా కదుల్తోంది

కొంటెగా చూస్తూ చూపుడు వేలుతో సున్నాలు చుడుతున్నాడు

ఆమె మొహంలో ఒక లజ్జ ఒక మన్మధవిలాసం

ఒక ఉత్సాహ దీప్తి ఒక శంకాసంకులత్వం స్పష్టంగా కనిపిస్తూ ఆ ముగ్ధత్వం రెచ్చగొడుతోందతన్ని

భయమేస్తోందా?!

ఊఁ ఊహూఁ!

ఎందుకు? నేను నీ జయరాంని కాదూ?! నా దగ్గరెందుకూ భయం?

అతనడిగే ప్రశ్నలకామె పెదవులు ఒక పట్టాన విడివడటంలేదు

ఇదేమిటి! ఇది ఇది ఇలా అని నాకెందుకు చెప్పలేదూ!? అన్నాడు జయరాం

ఏది? అయోమయంగా అడిగిందామె

ఒంగి ఆమె చెవి దగ్గర గుస గుసలాడాడతను

ఛీ! అంటూ మొహం రెండు చేతులతో దాచుకుంటున్న ఉదయను చూసి పక పకా నవ్వాడతను

ఆమె వంట చేస్తుంటే

అబ్బబ్బ అలా ఆ కూరలన్నీ చేస్తూ టైం వేస్ట్ చెయ్యకు ఉదయా పెరుగూ అన్నంతో సరిపెట్టుకోగలను నేను ఇలా నా దగ్గర కూర్చుని కబుర్లు చెప్పు అలా వంటలో మునిగిపోవద్దు అంటూ ప్రతి చర్యకూ అడ్డొస్తూ వంట చెయ్యనివ్వలేదతను

బలవంతంగా ఒక కూర చేసి చారు పెట్టడం గగనమయింది

## "మలుపు"

ఏమేసుకు తింటారండీ ఏం లేకుంటే ఎలా? అని ఆమె అంటుంటే నీ కబుర్లు కలుపుకు తింటాను ఇంకా అన్నంతో నంచుకోటానికి నీ దగ్గర చాలా ఉన్నాయి అంటూ ఆమె నా వంట గదిలో నుంచి లాక్కొచ్చాడు అలా ఎవరూ లేకుండా ఆ ఇంట్లో అతనితో ఒంటరిగా చనువుగా మసలటం అతను రకరకాల కోరికలు కోరుతూ అల్లరి చేస్తూ అవి తను తీర్చనందుకు అలుగుతూ అన్నం తిననని బెదిరిస్తూ తననే తినిపించమని బ్రతిమాలుతూ

తనను వదలకుండా తిరుగుతుంటే తమాషాగా థ్రిల్లింగ్‌గా ఉంది ఉదయకు

ఓహ్! ఎన్నెన్ని కబుర్లు!

కాలం తరిగిపోతోంది గానీ కబుర్లు తరగటంలేదు!

సాయంత్రం ఊరు నుంచొచ్చిన ఉదయ తల్లి అల్లుడి రాక విని నిర్ఘాంతపోయింది

ఈ కాలం ఎల్లలకి ఏం తొందర! బొత్తిగా పట్టింపులనేవే లేవు! అని విస్తుపోతూ దొడ్లోనే తిరుగుతున్న అత్తగార్ని చూస్తూ ఓ! మేమిద్దరం కలిసి ఒక గడప దాటకూడదు కాబోలు!

తను వెళ్ళిందాకా ఆవిడ దొడ్లోనే కాపురముండేలా ఉంది! అనుకొంటూ రోజుకో ఉత్తరం రాసేలా ఉదయ నుంచి వాగ్దానం తీసుకుని వెళ్ళిపోయాడు జయరాం

మొగుణ్ణి ఇంతలా కొంగుకు కట్టేసుకున్నావేమే అప్పుడే! అంటూ వరసైన వాళ్ళంతా బుగ్గలు నొక్కుకోవటమే

తరవాత ఉదయను గుంటూరు తీసికెళ్ళారు

అక్కడ మళ్ళీ ఒక ప్రహసనం!

ఉదయ అత్తగారు కాంతమ్మ నోరు కాస్త పెద్దది ఓర్వలేనితనం కూడా ఎక్కువే

తన కొడుకు అస్తమానం ఉదయా ఉదయా అంటూ కోడలి వెంట తిరగటం చూస్తుంటే కంపరమొస్తోందామెకు

ఇంతకు ముందేం చేశాడు? తనకి కాగా ఇంత గొప్ప అందగత్తె భార్య అయిందని తెగ మిడిసిపడుతున్నాడు ఇంకా రంభలాంటిది దొరికితే ఇహ భూమ్మీద నిలిచేవాడు కాదేమో! అని గొణుక్కునేదావిడ

ఇదిగో ఈ కూర తరుగు బియ్యం కడుగు పచ్చడి నూరు పులుసు ఉడికిందేమో చూసి తాలింపు పెట్టు అంటూ సాధ్యమైనంత వరకూ ఉదయను వంటగది దాటకుండా చెయ్యటానికి ప్రయత్నించేదావిడ

ఇదంతా జయరాంకు చెప్పలేనంత అసహనాన్ని కలిగించేది

ఆ రోజు

కూర తరుగుతోంది ఉదయ

ఉదయా ఉదయా గదిలోంచి వినిపించిన జయరాం ఎలుపుతో లేవబోతున్న ఉదయను వారించి తీలా అన్నయ్యకు ఏం కావాలో అడుగు మీ వదినె కూర తరుగుతోందని చెప్పు ఈ వంటంతా తానొక్కదాన్నే చేసి తొమ్మిది గంటలకల్లా తండ్రీకొడుకుల్ని ఆఫీసులకి పంపాలంటే నా వల్లకాదు అలా అస్తమానం ఎలుస్తుంటే ఆవిడెళ్ళి గదిలో కూర్చుంటే పనులెల్లా అవుతాయి? నువ్వు చూడు ఏం కావాలో అంటున్న కాంతమ్మను నిస్సహాయంగా చూసి తలవంచుకుని మళ్ళీ కూర తరగటం ప్రారంభించింది ఉదయ

ఏం కావాలన్నయ్యా? అంటూ వచ్చిన వాణిని చికాగ్గా చూస్తూ

ఏం? ఆవిడగారేం చేస్తోంది? నిన్ను పంపిందేం? అంటున్న జయరాం విసుగెందుకో అర్థం చేసుకున్న ఉదయ పెదవులు అప్రయత్నంగా చిరునవ్వుతో విచ్చుకున్నాయి అది చూసి మరింత మండిపడింది కాంతమ్మ

అడిగేవారు మనుషులు కారు కాబోలు అక్కడాయన గారి రుసరుసలు ఇక్కడ ఈవిడగారి ముసి ముసి నవ్వులు అంటూ గొణిగింది

కాఫీ కావాలి మీ వదిన్నే రమ్మను రాత్రి ఆఫీస్ నుంచి తెచ్చిన పచ్చట్ట ఫైలు ఇక్కడ పెట్టాను అది కనపడ్డంలేదు అది నాకిప్పుడు అర్జంటుగా కావాలి వచ్చి వెతికిమ్మను ఆ కూర సంగతేమిటో నువ్వు చూసి ఆవిడగార్నిటు పంపు జయరాం గొంతు స్పష్టంగా వినిపిస్తోంది వంటింట్లోకి

కోడలి చేతిలో కత్తిపీట విసురుగా లాక్కుని దయచెయ్యి తల్లీ ఆ ముచ్చట్లేవో తీర్చిరా

ఖర్మ! కోడలొచ్చినా నా ప్రాణానికి సుఖంలేదు కొన్ని కొన్ని జీవితాలింతే అన్నది కాంతమ్మ విసుగ్గా

నిజానికి వంట సగానికి పైగా ఉదయే చేస్తుంది పురమాయింపులే కాంతమ్మవి

పదింటికి మగవాళ్ళు ఆఫీసుకెళ్ళాక మిగతా పనులు సాయంత్రం టిఫిను రాత్రి వంట ఇవన్నీ ఉదయ చేస్తుంది

అయినా ఆ ఎల్లి తన కొడుకుతో కలిసి అలా కిలకిల్లాడ్డం మాత్రం నచ్చదు కాంతమ్మకి అది చూస్తే ఆవిడకు కారంలో పడేసి దొర్లించినట్టుంటుంది

ఏం కావాలి మీకు? ఎందుకలా పొద్దస్తమానం ఎలుస్తారు? అక్కడ నన్ను మీ అమ్మగారు తిడుతున్నారు అస్తమానం గదుల్లో ఏం ముచ్చట్లుంటాయని అన్నది ఉదయ మూతి ముడుచుకుంటూ

ఆవిడెందుకూ తిట్టటం? నేనావిడను పిలవలేదుగదా! అన్నాడు జయరాం అమాయకత్వాన్ని నటిస్తూ

చాల్లేంది సరసం!

ఇంకా సరసం మొదలెట్టకుండానే చాలంటే ఎలా?

మీకేం కావాలి? ఇదిగో కాఫీ నే వెడుతున్నా

అబ్బబ్బ ఆగు ఉదయా నేను పదింటికి వెళ్ళిపోతే తిరిగి సాయంత్రం ఆరింటిదాకా రాను గదా ఈ

మధ్య సమయమంతా ఆ వంటింటినే కావలించుక్కూర్చో ఇప్పుడు మాత్రం నాతో నే ఉండు నే వెళ్ళిందాకా

పోనీ నువ్వు వంట చేస్తుంటే నేను నీ వెనకే నీకు అవీ ఇవీ అందిస్తూ అక్కడే ఉందామంటే అక్కడ ఎవరో ఒకరు ఉంటూనే ఉంటారు

ఛ ఈ ఇంట్లో టొటిగా ప్రయివసీ అనేది లేకుండా పోతోంది

లాభంలేదు త్వరలో దీనికేదో విరుగుడు కనిపెట్టకపోతే మతిపోయేలా ఉంది నాకు

సరే కనిపెడుదురుగాని లెండి వచ్చుట్ట ఫైలు పోయిందంటున్నారు రాత్రి మీ చేతిలోగాని ఈ గదిలోగానీ అలాంటి ఫైలు చూసిన గుర్తు లేదే నాకు?

వచ్చు ఫైలా పాడా! ఉత్తిదే నిన్ను రప్పించుకోటానికి గబుక్కున తోచిన మార్గమది!

ఎగ్గు లేకపోతే సరి

మధ్యన అదెందుకు?

మీకింకేం అవసరం లేదుగా?

ఎందుకులేదు? ఇలా నన్ను ఆనుకుని కూర్చుని కబుర్లు చెప్పు

ఏమిటి!

మళ్ళీ చెప్పనా?

సరేలెండి మీ కసలు ఇంట్లో పరిస్థితులేం అర్థం కావటల్లేదు చిన్న పిల్లాడికి చెప్పినట్టు ప్రతిదీ వివరించి చెప్పాలి

ఏదో ఒక సాకుతో నన్ను తప్పించుకోటం బాగా తెలుసు నీకు అసలు నాకోసం నువ్వేం చేస్తున్నావో చెప్పు

ఏం చెయ్యాలి మీకు?

స్నానం గినం చేయించాలి

ఇంకా?

తల దువ్వాలి

ఊఁ!

ఆ తరవాత ఒక

ఉదయా వంటింట్లో నుంచి కాంతమ్మ అరుపు వినిపించగానే అతన్ని నెట్టి బయటకు పరుగెత్తింది ఉదయ

డామిట్!

ఇదెక్కడి గొడవ? కాసేపు సరదాగా కబుర్లు చెప్పుకోటానికి లేదు ఇంచక్కా అమ్మ కూడా హాయిగా సావిట్లో కూర్చుని నాన్నతో ముచ్చట్లు చెప్పుకుంటూ కనీసం వంటిల్లు తనకూ ఉదయకూ ఒదలకూడదూ? అప్పుడావిడకీ అరుపులూ వంటా అన్నీ తప్పిపోతాయి గదా ఇహ ఎంత మొత్తుకున్నా ఉదయ గదిలోకి రాదు సాయంత్రమూ అంతే!

తనొచ్చేసరికి స్నానంచేసి ఫ్రెష్‌గా చిరునవ్వుతో ఎదురు రాదు

ఓసారిలాగే స్నానం చేసి తెల్ల చీరా మల్లెపూలూ వగైరాలతో తయారయితే ఇలాంటి బోగం వేషాలు మా ఇంట్లో చెయ్యకు అన్నదట అమ్మ

అంతే!

ఆ రోజు నుంచీ ఉదయ సాయంత్రం స్నానానికి ముస్తాబుకీ గుడ్‌బై కొట్టి పారేసింది

అమ్మ కూడా ఇంత దారుణంగా మాట్లాడగలదని తనకింతవరకూ తెలీదు

కోడళ్ళు రాగానే ఈ ఆడవాళ్ళు ఎందుకిలా తయారవుతారు?

అలా అభినయిస్తేగాని అత్తగారి పాత్రకు సహజత్వం రాదా?

తన తండ్రికిలాంటివి పట్టవు

ఇలాంటి క్షుద్ర గృహ రాజకీయాలు ఆడవాళ్ళ మధ్యనే గానీ మగవాళ్ళ మధ్య ఉండవు

చాలా అసహనంగా అసంతృప్తిగా ఉంది జయరాంకు తను కొంచెం సంయమనంతో సహృదయంతో ఉంటే తమ విషయంలో చూసీ చూడనట్టు పోతే ఉదయా తనూ ఆమెను నెత్తిమీద పెట్టుకు చూస్తామని అమ్మకు తెలీదా?

అప్పుడీ ఇల్లెంత కళకళలాడుతూ ఉంటుంది!

ఇలా ఒకరి గురించి ఒకరు రహస్యంగా ఈసడించుకోటాల్లాంటివి ఉండవుగదా!

(ఇంకా ఉంది)

## వ్యక్తిగతం



పశ్చిమ జర్మనీలోని బాన్ గూఢచారి వ్యవస్థలో తృతీయ శ్రేణికి చెందిన అధికారిగా 19 సంవత్సరాలుగా పని చేస్తున్న హాన్స్ జోఎమ్ టయెడ్జ్ (48) ఇటీవల తూర్పు జర్మనీకి పారిపోయారు గూఢచారి విభాగంలోని అన్ని రహస్యాలూ తెలిసిన టయెడ్జ్ వాటిని తూర్పు జర్మనీ వారికి అందచేస్తే పశ్చిమ జర్మనీ గూఢచారి కార్య కలాపాలకి తీవ్ర విఘాతం కలుగుతుందని కలవర పడుతున్నారు తాగుడు తలకిమించిన అప్పుల సమస్యల కారణంగా ఆయన సతమత మవుతున్నట్లు తెలిసినా పై అధికారులు ఆయనని ఉద్యోగంలో కొనసాగటానికి అనుమతించారట' □

---



జోసెఫ్ ఫ్రాంక్లిన్ కాంపర్ (38) అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని అలబామాలో కిరాయి సైనికులకి తీవ్రవాదులకి శిక్షణ ఇచ్చే స్కూలు ఒకటి నడుపుతున్నాడు ఎయిర్ ఇండియా జంబో జెట్ కనిష్క విమానం పతనానికి కారకులైన తీవ్రవాదులలో ఒకడైన లాల్‌సింగ్ ఇతని శిష్యుడు శ్రీమతి గాంధి హత్య జరిగిన తర్వాత ఒక వారం రోజులకి లాల్‌సింగ్ మరో ముగురు సిక్కులు తన దగ్గర శిక్షణ పొందటానికి చేరినట్లు కాంపర్ చెప్పాడు కనిష్క విమాన ప్రమాదం గురించి తాను ముందుగానే న్యూయార్క్‌లోని భారత దౌత్య కార్యాలయానికి సమాచారాన్ని అందించానని అతను అంటున్నాడు కానీ ఢిల్లీలోని విదేశాంగ మంత్రిత్వశాఖ దాన్ని త్రోసిపుచ్చింది కాంపర్ కేవలం ప్రచారం కోసం అలా చెబుతున్నాడని విదేశాలలోని సిక్కు తీవ్రవాదుల కార్యకలాపాలని కేవలం వ్యాపారపరమైన ఆసక్తితో వాడుకోడానికే అతను అలాంటి ప్రకటనలు చేస్తున్నాడని విదేశాంగశాఖ అన్నది ప్రధానమంత్రి రాజీవ్‌గాంధి హర్యానా ముఖ్యమంత్రి భజన్‌లాల్ అమెరికా సంయుక్త రాష్ట్రాల పర్యటనలో ఉన్నప్పుడు వారిని హత్య చెయ్యటానికి సిక్కు తీవ్రవాదులు పన్నిన కుట్రని ఎఫ్ బి ఐ భగ్నం చేసి నలుగురిని అరెస్టు చేసింది వాళ్లు కూడా తన స్కూల్‌లోనే శిక్షణ పొందారని కాంపర్ అన్నాడు కాంపర్ వ్యవహారం గురించి ది ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ లో పడిన దాని మీద అదే సంస్థకి చెందిన ఆంగ్ల దినపత్రిక టైమ్స్ ఆఫ్ ఇండియా సంపాదకీయం రాసింది' □

# వారఫలం

### 11-10-1985 శుక్రవారం మొదలు 17-10-1985 గురువారం వరకు

★ **మేషం** ఇటీవల కొన్ని నెలలుగా యింతటి అనుకూల వారం లేదని గ్రహిస్తారు వ్యాపారంలో ఆశించిన దానికన్న ఎక్కుడు మెరుగు కనిపిస్తుంది వస్తు సేకరణకు బాగా అనుకూలించే వారం స్త్రీలకు ఉద్యోగ యత్నాలు ఫలించటం స్వల్పంగా ధనాదాయం

★ **వృషభం** తప్పనిసరిగా బంధువులకో మిత్రులకో సాయం చేయవలసిన పరిస్థితు లేర్పడుతాయి రాశినాథుడు మీకు వారమంతా అనుకూలుడు గాన ఆశించిన సైతం అందుతుంది కార్యనిర్వహణానికి అవకాశమున్నది స్త్రీలకు సాహితీరంగాన సదవకాశాలు ఆదాయం చెప్పనైన వారం

★ **మిథునం** నైజంగా మీకు గల ప్రజ్ఞ వ్యాపార వ్యవహారరంగాలలో అనుకూలించగల రోజులు వారాంతాన డబ్బు అందటం గమనించి ఆనందిస్తారు ఎవరికో సాయం చేయబోయి యిబ్బందులకు లోను కానున్నారు గ్రహించండి స్త్రీలకు ఉద్యోగమందు పెంపు స్వల్పాదాయానికి అవకాశం

★ **కర్కాటకం** పోయిన ఉద్యోగం మరలా చేయటం సంభవించదు గాని నూత్నోద్యోగమో సమమైన ధనమో సంక్రమించవచ్చు కొందరకు వైజ్ఞానికంగా పెంపు చెప్పదగిన కాలం వ్యాపారం చేసే లాగైతే ఎలాంటి అంతరాయం రాదని చెప్పవచ్చు స్త్రీలకు సుఖశాంతులు శుభకార్య ప్రసక్తులు

★ **సింహం** మీరు గావించిన ప్రయత్నాలు ఉద్యోగరీత్యా అయితేనేమి వ్యాపార రీత్యా అయితేనేమి ఫలదాయకాలే బాగా యత్నించి రావలసిన డబ్బు రాబట్టుకోగలుగుతారు అదీ మంచిదే! స్త్రీలకు : సుఖశాంతులు స్వల్పరాబడి కొందరకు ఆశించిన ప్రమోషన్ లభ్యం

★ **కన్య** నూతన యత్నాలు సానుకూలం కాగలవు రాజకీయరంగాన కొందరకు అనుకూలత ఉద్యోగరంగాన మీకు మేలున్నది అనవసర ప్రయాణాలు కూడ చెప్పదగిన అంశం స్త్రీలకు శుభవ్యయం బంధు దర్శనం కళారంగాన సదవకాశాలు చెప్పదగిన అంశాలు గ్రహించాలి

★ **తుల** అధికారం చెలాయించాలనే ఉబలాట తప్ప మరేమిలేదు ఎన్నడో వదలిన వ్యాపార వ్యవహారాలు తిరుగతోడాలని ఆశిస్తారు వారాంతాన అన్నిరంగాలలో మీకు అభివృద్ధికరమైన మార్పులు రాగలవు స్త్రీలకు ఉద్యోగమందు అభివృద్ధికరమైన మార్పు కనిపిస్తుంది

★ **వృశ్చికం** వస్తుసేకరణకు పకడ్బందీగా వ్యాపారం సాగించుటకు అనుకూల కాలం కావలసిన వారిని జాగ్రత్తగా గౌరవించవలసిన అగత్యం ఏర్పడుతుంది సాటివారి పోటీ వ్యాపారరంగాన ఎదుర్కొనవలసిన అగత్యం ఏర్పడుతుంది మీ రహస్యాలు వ్యాపార నైపుణ్యం తెలిసికోదలచిన వారున్నారు స్త్రీలకు సర్వత్రా అభివృద్ధి

★ **ధనుస్సు** అధికారుల ఆదరణ చేకూరుతుంది శత్రువర్గీయులను ఒకకంట కనిపెట్టాలి ఉద్యోగస్థుల సహాయం కోరి మేలు పొందగలవారుంటారు మీరు చేసే వృత్తి యందు అధికాదరణం చేకూరే మార్గమున్నది స్త్రీలకు : హోదా పెరగటం వస్తువులు సమకూర్చుకోవటం ముఖ్యాంశాలు

★ **మకరం** దూరపు ప్రయాణానికి కొందరకు అవకాశమున్నది అవశ్యంగా యిల్లు మారటం కొందరకు తప్పనిసరి అవుతుంది మొగమాటానికి పోయి యిబ్బందులకు గురి కాకండి ముందు వెనకలు గమనించి మెలగదగిన దినాలు స్త్రీలకు నాట్యనాటక చలనచిత్ర రచనా సామర్థ్యం గల వారికి ఉత్తమవారం

★ **కుంభం** గత కొన్ని వారాల కన్నా వ్యాపార వ్యవహారరంగాలలో చాలమందికి అనుకూలం ఆశించిన ఉద్యోగాభివృద్ధి కొందరకు చెప్పదగిన అంశం లేనిపోని వ్యవహారాలలో తలదూర్చవలసిన పరిస్థితులుంటాయి స్త్రీలకు : గౌరవ బిరుదులో పదవులో ఉద్యోగమందు అభివృద్ధిగాని చెప్పవచ్చు

★ **మీనం** శుభకార్యాల నిమిత్తం విరివిగా డబ్బు ఖర్చు చేయవలసిన అగత్యం ఏర్పడుతుంది అనుకోకుండా ప్రయాణించవలసిన పరిస్థితులుంటాయి ఆరోగ్యమందు అభివృద్ధి కోరే లాగైతే ఆహార విహారాలందు జాగ్రత్త అవసరం స్త్రీలకు బంధు సమాగమం శుభ వ్యవహార సంబంధమైన సంప్రతింపులు

—విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

# నకిలీ డాక్టర్లు

లక్ష్మీభాస్కర్ కోలపల్లి


















# అద్దెయిల్లు

## "శిఖామణి"

"రాఘవరావు గారున్నారాండీ' మధ్య వయసులో వున్న ఒకాయన మధ్యాహ్నపు వేళలో వచ్చి అడిగాడు అప్పుడే పాతిన లేత బంతి మొక్క తల వాలేసనట్టు దీనంగా ఉంది ఆయన ముఖం

ఏ రాఘవరావు గారు ? వెదురు తడకలు ఆ వరండాను రెండుగా చేయగా ఒక వరండాలో ని బియ్యం ఏరుతున్న ఒకావిడ అడిగింది ఇంటి ఓనరు రాఘవరావు గారమ్మా! అని ఆయన అనేసరికి ఆ ప్రక్క వరండాలో చెక్కు తీసన ములగ కాడలా సన్నగా తెల్లగా వున్న ఒకాయన ఇంటి వోనరు రాఘవరావుగారా? ఆయన ఈ యిల్లు అమ్మేస చాలా రోజులయిందండి ఏం కావాలి మీకు అద్దెకు అయితే మాత్రం ఖాళీల్లేవు అన్నాడు నేను అద్దె యింటికోసం రాలేదు ఇప్పుడు రాఘవరావుగారు ఏ ఊళ్లో వుంటున్నారో తెలుసా మీకు? అడిగాడాయన ఆ మాటకు పక్క వరండాలో ఆవిడ బియ్యపు గింజె నోట్లో వేసుకుందో మట్టి బెడ్డే నోట్లో వేసుకుందో తెలియదుకాని ఆ మధ్య పార్వతీ పురంలో వుంటున్నాం అన్నారు యిల్లు అమ్మేసాక ఒకసారే వచ్చారు యింతకీ మీరెవరూ? ఆయన బంధువులా అని అడిగిందామె బందువులు కాదమ్మా తెలిసనాయన అని సమాధానం చెప్పేలోగా— అలా ఎండలోనే నిలబడి పోయారు యిలా రండి— అని ఎలిచాడు ప్రక్కవరండాలో వ్యక్తి ఆ ఎలుపు ఎండలో నడుస్తున్న వాడికి గొడుగు పట్టినంత హాయిగా అనిపించింది రెండడుగులు వేస వరండాలోనికి నడిచాడాయన ఆ ప్రక్క గోడకు వెనక రెండు కాళ్ళు లేని కుర్చి దగ్గరగా చేర్చి ఉంది ఆ కుర్చిని చూడగానే తను మాస్టారు గిరి చేసేటప్పుడు బడిలో అల్లరి చేసన ఎల్లాడినో హోం వర్కు చేయని అబ్బాయినో గోడకుర్చి వేయించి తల మీద బెత్తాన్నో డష్టరునో పెట్టి పడిపోయిందో జాగ్రత్త అని కఠినంగా ప్రవర్తించినప్పుడు గోడకుర్చి వేసన ఎల్లాడి ముఖంలా మిక్కిలి దయనీయంగా ఉంది ఆ కుర్చి

నా పేరు వెంకట్రామయ్యండి అని యింకా ఏదో చెప్పేలోగా – అలాకూర్చోండి అని కుర్చిని చూపించాడాయన విరిగి పోదుకదా అని అనుమాన పడుతూ కూర్చున్నాడు వెంకట్రామయ్య గట్టి కుర్చియేనండి మా కుర్ర వెదవలు నేను కూర్చుంటానంటే నేను కూర్చుంటానని కుస్తీ పట్టి దాన్ని కాళ్ళు కాస్తా విరగ్గొట్టేసారు – అన్నాడాయన

దాహానికి యిప్పిస్తారా అని వెంకట్రామయ్య అడిగేసరికి ఆయన మంచినీళ్ళు అని యింట్లోకి కేక వేసాడు

మా స్వస్థలం కాకినాడ ఈ ఊర్లోనే మాష్టారుగా పని చేసానండి నా వృత్తి జీవితానికి ఆఖరి మజలీ యిక్కడే ఈ ఊర్లో వుండగానే రిటైర్యైపోయాను అని వెంకట్రామయ్య చెప్పేసరికి మంచినీళ్ళు వచ్చాయి రెండుగ్లాసుల నీళ్ళు ఆయనలో ని దాహాన్నీ ఆకలినీ కూడా కొంత వరకూ తగ్గించాయి

రాఘవరావుగారు మీకేమౌ తారు? అని ఆయన అడిగినప్పుడు ఆయన నాకు మంచి స్నేహితుడు అంతకు మించి ఆత్మబందువు స్నేహం అంటే ప్రాణం యిచ్చే మనిషి శాంతస్వబావుడు అడిగిన వారికి ఎన్నడూ లేదనే వాడుకాదు అలాంటి మనిషిని మరొకరిని చూడలేం అని వెంకట్రామయ్య ఆయన గుణగణాలను పొగుడుతున్నప్పుడు— కొంపతీస ఈయనకూడా ఏమైనా అడుగుతాడా ఏమిటి? అన్న సందేహం కలిగిందాయనకు

మీకు అసలు విషయం చెప్పనే లేదుకదూ! ఈ ఇంట్లోనే ఆ ప్రక్క వాటాలో నేను పదిహేను సంవత్సరాలు కాపురం చేశాను ఆయన మాటల్లో ఆ యింటి పట్ల ఎంతో అబిమానం అప్యాయత వ్యక్త మయింది అలాగా అన్నాడాయన ఆశ్చర్యంగా' ఆ వెంటనే అప్పట్లో అద్దె ఏ మాత్రం తీసుకునేవారు అని అడగడంతో వెంకట్రామయ్య మనసు చివుక్కు మంది— ఏం మనుషులో ఎమిటో అనుకున్నాడు

మొదట్లో పాతిక తీసుకునేవారు ఆ తరువాత ఆయనకు నాకు పరిచయం పెరిగి స్నేహం కుదిరాక మా కుటుంబ పరిస్థితులు తెలుసుకున్నాక అద్దె కోసం ఏనాడు ఆయన నన్ను బలవంత పెట్టలేదు— సర్దుబాటు అయినప్పుడు నేనే యిచ్చేసే వాడిని అన్నాడు వెంకట్రామయ్య

నయమేనండి—– ఇప్పుడు మేం డబ్బైఅయిదు రూపాయలిస్తున్నాం— కరంటుబిల్లు కాక అన్నాడాయన బాధగా వెంకట్రామయ్యకు గతం ఒక సారిగుర్తుకు వచ్చింది—తను ఈ ఇంట్లో వున్నప్పుడు యిల్లు ఎల్లలతో ఎంత కళ కళలాడేది తను యింట్లో వున్నా లేకపోయినా ఎవరో ఒకరూ వెంకట్రామయ్య గారూ అని మాష్టారూ అని పిలుస్తుండే వారు ఆ పదిహేను సంవత్సరాలు తను అందరికీ తలలో నాలుకలా మసలాడు తను ఎల్లల్ని ఎంతగా అబిమానించి ప్రేమించే వాడో తన బార్య అన్నపూర్ణ కూడా అంతగానూ చూసేది

వచ్చే కొద్దిపాటి జీతం చాలక పిల్లలకు ప్రయివేట్లు చెపుతున్నప్పుడు ఆ పరిస్థితుల్లో కూడా ఆయన దగ్గరకు మాష్టారూ మీరడిగినంతా ఇచ్చుకోలేం మావాడికి రెరోడక్షరాలు నేర్పండి మీ మేలు జన్మలో మర్చిపోలేం! అని అడిగినప్పుడు తన కుటుంబం పరిస్థితి గుర్తుకొచ్చి కష్టాలు ఎవరికైనా ఒకటే అనుకుని—– ఎల్లలకు ఉచితంగానే చదువు చెప్పేవారు కానీ ఆయన మంచి ఆయన్ను పెంచలేదు చాలీ చాలని జీతం పెళ్ళికి ఎదిగిన కూతుళ్ళు చదువుతున్న కొడుకులు అన్నపూర్ణ రోగగ్రస్థ అయిపోవటం ఎప్పుడూ ఆకలి కన్నీళ్ళు నిట్టూర్పులు వెంకట్రామయ్యను నిలువునా కృంగదీసాయి మంచిరోజులు వస్తాయనే ఆశతో ఎదురు చూస చూస యిక రావని తేలిపోయాక పెళ్ళి వయసు దాటి పోయి చాలా సంవత్సరాలు అయిపోయిన పెద్దకూతురు యిక మా నాన్న ఈ జన్మలో పెళ్ళి చేయలేదని తలంచి గుమస్తా గోపాలంతో వెళ్ళిపోయి నప్పుడు వెంకట్రామయ్య బాద పడిన మాట వాస్తవమే అయినా ఆ తరువాత తరువాత ఆమె తప్పూలేదని తెలుసుకున్నాడు

ఎన్ని యిబ్బందులకు గురైనా ఎంత మానసిక సంఘర్షణకు లోనైనా ఆయన ఆత్మ విశ్వాసం ఆయన్ను నిత్య యవ్వనుడు గానే వుంచింది

మాసన గడ్డాన్ని చేత్తో తడుముకుంటుండగా ఏమిటి మాష్టారూ ఆలోచనలో పడ్డారు అని వెంకట్రామయ్యను పలకరించగానే త్రుళ్ళిపడి ఏం లేదు బాబూ! ఏదో జ్ఞాపకానికొస్తే అంటూ లేచి ఒక్కసారి ప్రక్క వాటా కూడా చూస వస్తాను పదిహేను సంవత్సరాలు దాని చల్లని ఒడిలో బ్రతికాను అంటు అవతలి వాటావైపు నడిచారాయన మెట్ల దగ్గరే నిలుచుండి పోయిన వెంకట్రామయ్య గారిని చూస ఏం కావాలండి మీకు అని అడిగిందావిడ నేను ఈ పోర్షనులోనే పదిహేను సంవత్సరాలు కాపురం వున్నానమ్మా' గాంధీనగరం బడిలో మాస్టారుగా పని చేసాను అని తనను పరిచయం చేసుకున్నారు మాస్టారు అన్న మాట వినగానే ఆమె పమిటచెంగును బుజాల చుట్టూ కప్పుకుని కూర్చోండి అంటూ కుర్చి చూపించింది పరవాలేదమ్మా అంటూనే కూర్చున్నారాయన పదిహేను సంవత్సరాలు కాదు పాతిక సంవత్సరాలు కాపరముంటే ఉండొచ్చు— ఇంతకీ యిప్పుడు ఎంధుకొచ్చినట్టు అని ఆమె అడగక పోయినా ఆ క్షణంలో ఆమె ముఖం చూసన ఎవరైనా ఆమె మనసులో అదే ప్రశ్న ఉందని అనుకుంటారు— వెంకట్రామయ్య గారూ అదే అనుకున్నారు ఆమె ఏమి అడగక పోయినా మరేం లేదమ్మ ఇల్లును ఒకసారి చూసి వెళ్దామని అన్నారాయన లోపలి

గదిలోనికి చూసాడు గోడలన్నీ మాసి పోయి బూజుతో వున్నాయి అన్నపూర్ణ యింటిని ఎంత శుభ్రంగా వుంచేది అనుకున్నాడాయన గతాన్ని గుర్తు చేసుకుని కాంపౌండ్ అంతా పరికించి చూసాడు బోసిగా ఉంది తను వుండేటప్పుడు పెద్ద బాదం చెట్టు రెండు వాటాలకు మధ్యగా మునగచెట్టు– ఆ చివర ఉసిరిచెట్టు వుండేవి తను ఎప్పుడూ ఆ బాదం చెట్టు నీడనే వాలుకుర్చీలో కూర్చుని ఎల్లలకు పాఠాలు చెప్పేవాడు ఉదయాన్నే అన్నపూర్ణ తెచ్చి ఇచ్చిన పలహారాన్ని గాలిలోకి విసిరి మరీ కాకులకు పెట్టేవాడు ఏదైనా పని వుండి వెంకట్రామయ్య గారు ఎద్దైనా ఊరు వెళ్ళితే ఆ సమయానికి బాదం చెట్టు మీద కాకులు అరుస్తూ గోల చేసేవి ఆ గోలను భరించలేక ఈయన కాకుల్ని కూడా పోషించాలిగాబోలు అనుకుంటూ ఆ పూట చేసిన పలహారాన్ని కాస్త తెచ్చి బాదం చెట్టు మొదట్లో పోసేది అన్నపూర్ణ వెంకట్రామయ్య తెల్లవారు జామునే లేచి రాలిపోయిన బాదం కాయలను ఏరి దాచి పెట్టేవారు మధ్యాహ్నం ప్రైవేటులో బాగా చదివిన ఎల్లలకు అవి యిచ్చేవారు దాంతో ఎల్లలు పోటీ పడి చదివే వారు ఆ బాదం చెట్టు క్రింద ఎంత చల్లగా హాయిగా వుండేది ఆ చెట్లన్నీ యిప్పుడేవి? తను వుండే టప్పుడు – పెరటి నిండా ఎన్నిరకరకాల పూల మొక్కలు– ఎంత ఓపగ్గా పెంచే వాడు తను?యిప్పుడవన్ని పోయి ఏవో పూలు పూయని ఎచ్చి చెట్లు గోతిలోని నిలువ నీరులా అసహ్యంగా కనిపించాయి

ఆ మూల మాత్రం గన్నేరు చెట్టు అలాగే వుంది దాని మొదట్లో ఏవో విరిగిపోయిన పోటో ఫ్రేము ముక్కలు అద్దం ముక్కలు కనిపించాయి వాటిని చూడగానే వెంకట్రామయ్యగారి మనసు చివుక్కుమంది అది శిదిలావస్థలో నున్న తిరుమలేశుని ఫోటో తాము ఈ ఇంట్లోకి అద్దెకు రాక ముందు యిల్లు చూసుకోడానికి వచ్చినప్పుడు అంతకుముందు యిల్లు కాళీ చేసినవాళ్ళు పగిలిపోయిన తిరుమలేశుని పోటో వదలివేసి వెళ్ళిపోయారు దాన్ని తాను బాగు చేయించి సొంత వస్తువులాగే చూసి పూజాదికములు చేసేవాడు అది పరాయివాళ్ళ వస్తువే అన్న భావన కలుగలేదు ఆయనకు తన వుద్యోగం అయిపోయాక వూరు వదలి సంసారం తరలి వెళ్ళిపోతున్నప్పుడు ఆయన కూడా ఆ ఫోటోను ఆ యింట్లోనే వదలి వెళ్ళిపోయారు తమలాగే ఆ ఇంట్లో దిగినవారు కూడా ఆ పోటోను పూజిస్తారు అనుకున్నాడు ఇప్పుడు ఆ గన్నేరు చెట్లు మొదట్లో ఆ ఫోటో అవశేషాలే వెంకట్రామయ్య వంక జ లిగా చూసాయి వరండాలో నుండి తొంగి చూసిన వెంకట్రామయ్య గార్కి అది ఓ పెద్ద సైజు చెత్త కుండీలా కనిపించింది ఎన్నాళ్ళయిందో ఆ గోడలకు సున్నం వేసి ఇంటినిండా సామానులు చిందరవందరగా పడివున్నాయి అన్నపూర్ణ యింటిని ఎంతగ తీర్చిదిద్దేది అందుకే ఇంటిని చూసి ఇల్లాలిని చూడమన్నారు సంసారాన్ని చక్కదిద్దడంలో అన్నపూర్ణకు ఎవరూ సాటి రారేమో అనిపించింది ఆయనకు వస్తానమ్మా! అని వెంకట్రామయ్య గారు ఇవతలి వాటాలోనికి వచ్చేసరికి ఆ



ఇంటాయన ముఖం కందగడ్డలా పెట్టుకున్నాడు కాసేపటికి గాని ఆ రెండు వాటాల వారికి అసలు పడదని గ్రహించలేక పోయేరు వెంకట్రామయ్యగారు తను వుండేటప్పుడు ప్రక్క వారితో ఎంత అన్యోన్యంగా ఉండేవారు పదిహేను సంవత్సరాల కాలంలో ఒక్కనాడు తాము మాటా మాటా అనుకున్న రోజు గుర్తులేదు ఏమిటో రోజులు మారిపోతున్నాయి మనసులు మరి సంకుచిత్వం అయిపోతున్నాయి అనుకున్నారు వెంకట్రామయ్యగారు

రామవరావు గారితో అంత ముఖ్యమైన పని వుండి వచ్చారా? అని ఆయన అడగడంతో పెద్ద పనేం లేదండీ మా మూడో అమ్మాయి పెళ్ళి నిశ్చయమైంది బంధువులు ఇంటికెళ్తూ దారిలోనే కదా అని ఓ సారి రామవరావు గారినీ ఇంటినీ చూసినట్లు ఉంటుందని వచ్చాను తీరా ఆయన లేరు అన్నాడు వెంకట్రామయ్య

అల్లుడు గారేం చేస్తుంటారు? అన్న మాటలకు యింకా ఏమీ చెయ్యటంలేదు బాబూ! బి ఎ చదివి కూర్చున్నాడు ఇదిగోనండి శుభలేఖ అంటూ మాసిన సంచిలో నుండి ఓ శుభలేఖ తీస యిచ్చాడు మా అమ్మాయి పెళ్ళికి మీరు తప్పక రావాలండీ! అని ఈ పరిచయం వ్యక్తితో ఎలా అనగలడు? అదే రామవరావును అయితే గట్టిగా అడిగేవాడు ఇంతలో ఆయన ఒక్క క్షణం

## అద్దె యిల్లు

వుండండి అంటూ లోనికెళ్లాడు అర్థంకాని వెంకట్రామయ్య అలాగే నిలబడిపోయాడు లోని నుండి వచ్చిన ఆయన శుభలేఖను తిరిగి వెంకట్రామయ్యకు యిస్తూ రామవరావు గారుంటే పెద్ద సహాయమే చేసేవారు మరేం అనుకోకండి అన్నాడు

కొంత అర్థమయిన వెంకట్రామయ్య వెంటనే శుభలేఖ తెరచి చూస్తే దానిలో పదిరూపాయల నోటు వుంది ఒక్కసారిగా వెంకట్రామయ్య ఒంట్లోని రక్తమంతా నీరైపోయినట్లు తను తేలికైపోయినట్లు అనిపించింది ఆయన కళ్లల్లో నీళ్లు తిరిగాయి ఏమిటండి ఏమిటిది రామవరావు

గారి దగ్గరికి మాత్రం నేను సహాయం అర్థించి వచ్చాననుకున్నారా! పదిహేను సంవత్సరాల స్నేహం మర్చిపోలేక ఈ యింటిని చూద్దామని ఆయనకు పెళ్లి కబురు చెప్పుదామని వచ్చాను తప్ప నేను ఇందుకోసం రాలేదు బాబూ! ఆ శుభలేఖైనా మీరే పనిమీద వచ్చారు అని మీరు అడిగితే ఇచ్చాను తప్ప మా అమ్మాయి పెళ్ళిచేసుకుంటున్నాం మీకు తోచిన సహాయం చెయ్యమని అడగడానికి యివ్వలేదు అని ఆ పది రూపాయలు ఆయన చేతిలోనే పెట్టి వచ్చేసాడు వెంకట్రామయ్య మరొక్కసారి ఆ యింటిని వెనుదిరిగి చూడాలన్న కోరికను కొన్ని నిమిషాల క్రితం అక్కడ జరిగిన సంఘటన బలంగా చంపేసింది ఆయన మనసేం బాగోలేదు తను పదిహేను సంవత్సరాలు ఆ యింటితో పెంచుకొన్న అనుబంధం ఆ యిల్లు ఎలా వుందో చూడాలన్న తపన ఆయన్ను యింత దూరం తీసుకు వచ్చాయి తీరా వచ్చాక ఎందుకు వచ్చానురా అని అనిపించింది ఆయనకు ఆ యింటిని ఆ మనుషుల్నీ మర్చిపోడానికి ప్రయత్నిస్తూ బస్స్టాండ్ వైపు దారి తీసాడు వెంకట్రామయ్య □

## శిలాక్షరాలు

మధ్యధరా
సముద్రమంత
కాగితంపై
ముద్రపడ్డ
సిరాక్షరాలు
జీవిత కవితకు
శిలాక్షరాలు

—ఇ ఏ యస్.



కొత్తగా మెరుగుపరచబడిన

# జాస్మిన్

## పూలపరిమళాలతో ప్రతిసారీ స్నానం...




ఇప్పుడు మీరు మెచ్చిన టాయ్‌లెట్
సోప్ మునుపెన్నడూ లేనంత
మెరుగయింది—మీ మనసుకు
మరింత దగ్గరయే ఘుమఘుమలతో

జాస్మిన్-హాయిగా, ఉద్యానవన
విహారం చేసిన తాజా అనుభూతిక్,
స్నానం చేసాక చాలా సేపటిదాకా
మీ శరీరమంతా మిలమిలలాడేందుకు




# జాస్మిన్

లగ్జరీ సోప్

బోంబే సోప్ ఫ్యాక్టరీ బొంబాయి 400 008

1904 నాటి నుంచి నాణ్యమైన, సబ్బులను తయారుచేస్తున్నవారు

Sai J 1 Tel

సీరియల్

# కాంచన సౌధం

రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

పోలిగాడికి బాగా స్వస్థత చిక్కింది

మర్నాడు వాణ్ణి ఇంటికి పంపుతూ కొన్ని మందులు రాసిచ్చి

ఇదిగో! మంగమ్మా! ఈ మందులు తప్పకుండా వాడాలి! మీ ఆయన వచ్చాక తెప్పించు! అన్నాడు విశ్వం ప్రిస్క్రిప్షన్ చేతిలో పెడుతూ

మంగి మొహం వెలవెల బోయింది

కళ్ళలో నీళ్ళు తిరిగాయి

ఏమిటి? అన్నాడు విశ్వం అర్థంకాక

మంగి చేతుల్లో మొహం దాచుకొని భోరుమంది

కంగారుపడిపోయాడు విశ్వం

ఏమైంది? మీ ఆయన ఇప్పుడు రాడా? అన్నాడు

తనని తాను కంట్రోల్ చేసుకుంటూ తన పరిస్థితీ భర్తవల్ల తనకెంత సహాయం లభిస్తోంది అంతా నగ్న విడిచి అతనికి చెప్పింది మంగి

తెల్లబోయాడు విశ్వం

మరైతే ఎలా? అన్నాడు

మీ దగ్గిరే ఏవైనా వుంటే ఇయ్యండి బాబూ? తంవ రునం వుంచుకోను! పని సేసైనా తీర్చుకుంటాను! బ్రతిమాల్తూ అంది మంగి

క్షణం ఆలోచనలో పడ్డాడు విశ్వం

హాస్పిటల్‌లో పెద్దగా మందుల్లేవని అతనికి బాగా తెలుసు!

జేబు చూసుకున్నాడు జేబులో పాతిక రూపాయలున్నాయి అవే తీసి మంగికిస్తూ

ఇది తీసికెళ్ళి ముఖ్యమైనవి కొంచెం తెప్పించు మళ్ళీ చూద్దాం! అన్నాడు

వద్దు బాబూ! మొహమాటంగా అంది మంగి

ఫరవాలేదు! మళ్ళీ వున్నప్పుడు ఇచ్చేద్దువుగాని! అంటూ ఆ నోట్లు బలవంతంగా ఆమె చేతిలో పెట్టాడు విశ్వం

అప్పుడొచ్చాడు ఇకిలిస్తూ వచ్చాడు దాసు

జరిగినకథ–2 పెద్దకామందు రాయుడి గారింట్లో పాలేరు వీరడు వీరడి భార్య మంగి వారి సంతానం పోలిగాడు పంచాయితీ ఎలక్షన్లలో చౌదరి నెగ్గితే రాయుడు ఓడాడు వైద్య సహాయం ఏమాత్రంలేని ఆ పల్లెలో చౌదరి మేనల్లుడు డా విశ్వం కొత్తగా బోర్డు కట్టాడు పోలిగాడికి జ్వరం వస్తే అర్ధరాత్రి వానలో మంగి డా విశ్వం ఆసుపత్రికి వెళుతుంది అక్కడ కాంపౌండరు దాసు డాక్టరు లేరని మందులు లేవని చెప్పి ఆమెను పంపించి వేస్తాడు మంగి రాయుడి గారింటికోసే పరుగు తీసింది వీరడు ఊళ్ళో లేడని తెలుసుకొని డా విశ్వం కోసం చౌదరిగారింటికి వెళుతుంది మృత్యువుతో పోరాడి పోలిగాడ్ని బ్రతికిస్తాడు విశ్వం విశ్వం దాసుని పనిలోంచి తొలగిస్తాడు దాసు చౌదరి నమ్మే విధంగా మాటలు చెప్పి విషం తలకెక్కిస్తాడు

నమస్కారం సర్! మంగిని ఆమె చేతిలోని నోట్లనీ మార్చి మార్చి చూస్తూ అన్నాడు

విశ్వం అదేమీ గమనించకుండానే

నమస్కారం! నువ్వెళ్ళి పని చూసుకో! అన్నాడు ముభావంగా

అతను దాసుతో ఎక్కువగా మాట్లాడంలేదు దాసు కొరగా మంగికేసి చూస్తూ లోపలికెళ్ళి పోయాడు

మంగి కొడుకుని తీసుకుని వెళ్ళిపోయింది

విశ్వం తన పనిలో పడిపోయాడు

ఆ రోజు ఆయా పన్లోకి రాలేదు

రాదని అతను వూహించాడు కూడా

మర్నాడు పిల్చిలా వచ్చింది

పనంతా అయి వెళ్ళిపోతుంటే ఆపాడు విశ్వం

మీరు రేపు ఫస్టు నుంచి రానక్కర్లేదు! అన్నాడు ఎలాంటి ఉపోద్ఘాతమూ లేకుండానే

రమ మాట్లాడలేదు

ఏమ్మాట్లాడుతుంది?

దాసు రంగంలో కొచ్చాడు

నువ్వు కూడా! ఫస్టు నుంచి ఇక్కడికి రావద్దు!" అన్నాడు అతనితో కూడా

పొరపాటు జరిగిపోయింది సర్! ఇప్పుడు అర్థాంతరంగా పొమ్మంటే ఎక్కడికి పోతాను అంటూ ఇంకా ఏదేదో చెప్పబోయాడు

అయితే విశ్వం వినిపించుకోలేదు దాసు రమకి సైగ చేశాడు ఆమె అతి బలవంతం మీద గొంతు సవరించుకుని

క్షమించండి డాక్టర్!" అంది

అయామ్ సారీ! అంటూ చటుక్కున లేచాడు విశ్వం

రమ మొహం అవమానంతో ఎర్రబడింది

తీక్షణంగా అతనికేసి చూసి చరచరా బైటికి వెళ్ళిపోయింది దాసుకూడా ఆమె ననుసరించాడు

* * * * *

విశ్వం! మళ్ళీ ఒక్కసారి ఆలోచించరా! అన్నాడు చౌదరి మేనల్లుడితో దాసు ఆయాల గురించి

నీకు తెలియదు మావయ్యా! ఒక్కసారి ఊరుకుంటే అది అలవాటుగా మారుతుంది!

అదీగాక దాసు తను చేసిన దానికి బాధపడ్డంలేదు సరికదా

వీడు నన్నేం చేస్తాళ్ళే! అన్న ధీమాగా తిరుగుతున్నాడు కోపంగా అన్నాడు విశ్వం

అది కాదురా! ఆ దాసు

తెలుసు మావయ్యా! రాయుడిగారి తరఫు మనిషికి వైద్యం చేశానని నీకు బాగా నూరిపోశాడు! అవునా? కానీ డాక్టర్లకే పార్టీలుంటే ఎలా చెప్పు! అయినా నువ్వు ఆ రాయుడిగారంత స్వార్థపరుడివి నీతి లేనివాడివీ కాదని

నాకు బాగా తెలుసు! అందుకే నేను ధైర్యంచేసి వెళ్ళాను అనునయంగా అన్నాడు విశ్వం

మేనల్లుడి దృష్టిలో తనో మంచి మనిషిగా వున్నందుకు మనసులోనే పొంగిపోయాడు చౌదరి అయినా

కానీ అంటూ ఆగిపోయాడు

ప్లీజ్! మావయ్యా! ఆ దాసు విషయం ఇంక మాట్లాడవద్దు! అన్నాడు విశ్వం గంభీరంగా

భారంగా నిట్టూర్చాడు చౌదరి

ఇంక ఆ విషయాన్ని గురించి అడక్కూడదు! అని కూడా నిర్ణయించుకున్నాడు

★ ★ ★ ★ ★

చౌదరిగారి మేనల్లుడు తన హాస్పటల్ తుడవటానికీ మంచినీళ్ళు అవీ పెట్టడానికి చౌదరిగారి బద్ధ శత్రువైన రాయుడిగారి పాలేరు పెళ్ళాం మంగిని పన్లో పెట్టుకున్నాడన్న వార్త కార్చిచ్చులా వ్యాపించి పోయిందా ప్రాంతమంతా

రాయుడు త్రుళ్ళిపడ్డాడు!

చౌదరి కొయ్యబారిపోయాడు

దాసు వంకరగా నవ్వాడు!

వీరడు నిప్పులు చెరిగాడు!

ఊరు వూరంతా ముక్కున వేలేసుకుంది!

కొడుకు సంగతి తెలిసినా కొంపకు రాని వీరడు ఈ వార్త చెవిని పడగానే ఉరుకులు పరుగులతో వచ్చిపడ్డాడు

అతన్ని చూడగానే

వచ్చావా మావా! ఎన్నాళ్ళకి నేను గుర్తొచ్చాను! పోన్లే! ఇన్నాళ్ళికైనా వచ్చావ్! అంతే చాలు! రా! అంటూ మురిసిపోతూ ఆప్యాయంగా ఆహ్వానించలేదు

ఏమిటి? అన్నట్లు తలెత్తి ఓసారి చూచి తిరిగి తన పనిలో పడిపోయింది

నిర్ఘాంతపోయాడు వీరడు

కోపం రెట్టింపయింది

ఏవే! నేనిన్నాది నిజమేనా? అన్నాడు ఆవేశంగా

ఏటది? తాపీగా అంది మంగి

నియ్యవ్వ! తెలీనట్టడుగుతావేందే? దూకుడుగా అన్నాడతను

బాగుంది! సెప్పకపోతే ఎట్టా తెలుసుద్ది?

నేనూల్లో లేనప్పుడు జరిగిన ఇసయం!

నువ్వూల్లో లేనప్పుడు జరిగిన ఇసయమా? అంటే పోలిగాడికి పేనం మీదికొచ్చిన ఇసయమా? నేక అప్పట్లో ఆ దాసుగాడు ఆయాతో తొంగుంది సూడను పొమ్మన్నా ఇసయమా అదీగాక డాక్టరుబాబొచ్చి అన్ని కాపాడిన ఇసయమా? ఏది? ఇయ్యన్నీ నువ్వూర్లో లేనప్పుడే జరిగినయ్! తన పని తను చేసుకుంటూనే అంది మంగి

కొయ్యబారి పోయాడు వీరడు

ఇది మంగేనా? అనుకున్నాడో క్షణం వెంటనే అతనిలోని మగతనం మేల్కొంది

ఏటే నీ యవ్వారం? ఇందాకట్నుంచి సూత్తన్నా అడిగినా దానికి సమాధానం సెప్పకుండా మంగి జబ్బ పట్టుకుని లేవదీస్తూ అన్నాడు

నువ్వుండెహె! చెయ్యి విదిల్చుకుంటూ అంది మంగి నిర్లక్ష్యంగా

వీరడిలో ఆవేశం కట్టలు తెంచుకుంది

నీకు మా పొగరు బలిసిపోయిందే! పిచ్చిగా అరిచాడు

అవును మరి! నువ్వెట్టే తిండికి బలవకేవౌద్ది! దీర్ఘం తీసింది మంగి

అంతే!

వీరడి చెయ్యి గాల్లోకి లేచింది విసురుగా అయితే ఆ చేతిని అంతకన్నా విసురుగా ఆపేసింది మంగి

ఆగు! నా మీద సెయ్యెత్తిందా నేను మడిసిని కాను! నువ్ సేసినా పనే నేనూ చెయ్యాలిసొస్తది! నీ మగతనం మీద మా పెద్ద దెబ్బ తగులుద్ది!

ఎంటనే గుండాగి సత్తావ్! తాపీగా అంది మంగి

ఏటే! ఏటి? మొగున్నట్టుకునేనా నువ్విన్ని మాట్లన్నాది? జారిపోతున్న ధైర్యాన్ని కూడదీసుకుంటూ అన్నాడు వీరడు

ఏటీ? మొగుడా? ఎవుడు? నువ్వా? ఫక్కున నవ్వింది మంగి

బిక్క చచ్చిపోయాడు వీరడు

ఎవరికి నన్నే మొగుణ్ణి కాదనే కాడికొచ్చావన్న మాట! బింకంగా అన్నాడు

ఎ! నువ్వు మొగుడివా? ఆ మాటంటానికి ఎగ్గులేదూ? అసలు మొగుడంటే అర్థం తెలుసా నీకు?

పొగులంతా గొడ్డా కట్టబడి పెల్లాం బిడ్డల్ని సాక్కునేవోడు మొగుడు! ఆడు తాగి తందనాలాడినా పెల్లాన్ని సావబాదినా ఎన్ని ఎదవ పన్లు సేసినా ఏ



థింక్ ఓ థింక్ కొంప సేర్తాడు!

అలాగాక అదహా దదహా వచ్చి కొంత సొమ్ముదేస కూసేపు గడిప్పోయేవోడు ఎవికారి! నువ్వాడితానూ లేదు! అంతకన్నా యదవ్వి? నిక్కుస్సుడివి!

గుర్తొచ్చినప్పుడు పిడుగులా వచ్చి ఎలా వున్నారనైనా అడక్కుండా వుండాది తిని నీ ఆకలి తీర్చుకు పోతావ్! సీ! నువ్వో మొగుడివి' పెద్ద మొగోడివి! అసహ్యంగా చూస్తూ అంది మంగి

వీరడు భార్య అన్న మాటలకి అగ్నిపర్వతమే అయ్యాడు తప్పు తనదే అయినా అతనిలోని పురుషాహంకారం అతన్ని పిచ్చివాణ్ని చేసింది

బండ బూతులు తిడుతూ మంగిని బాదేశాడు ముందు ప్రతిఘటించినా తరవాత నిస్సహాయంగా నిర్జీవంగా ఉండిపోయింది మంగి

నిద్రలో వున్న పోలిగాడు లేచి బావురుమన్నాడు

చేతులు నొప్పెట్టే వరకూ బాది బూతులు తిట్టుకుంటూ వెళ్ళిపోయాడు వీరడు

స్వాధీనం తప్పుతున్న వంటిని స్వాధీనంలోకి తెచ్చుకుంటూ మెల్లగా లేచింది మంగి రంగిక్కబురంపింది ఆమె వచ్చాక విషయమంతా చెప్పింది

రంగి వీరణ్ని తిట్టిపోసింది

పెళ్ళాని క్కాస్త గంజి పొయ్యలేనిధవకి పెళ్ళాన్ని కొట్టే అధికారం లేదంది! తిట్టిన తిట్టు తిట్టకుండా గంట తిట్టింది

కాస్సేపు తరువాత తన నిర్ణయం చెప్పింది మంగి

క్షణం ఆలోచించిన రంగి

అదే మంచిది! అనేసింది

* * * * *

పరీక్షలైన మర్నాడే ఫ్రెండ్స్‌తో కలిసి పిక్‌నిక్‌కి వెళ్ళింది మమత

మమత ఉత్సాహానికి మారు పేరు పెళ్ళీడొచ్చినా ఇంకా చిన్న పిల్లలాగా అల్లరి చేస్తుంది

ముఖ్యంగా విశ్వం దగ్గర మరీ అల్లరి చేస్తుంది అతని సాన్నిధ్యం ఆమెకి స్వర్గం అతని మీద ఈగ వాలనివ్వదు

అతనే అమ్మాయినైనా కన్నెత్తి చూసినా అతన్నే అమ్మాయైనా ఆరాధనగా చూసినా మండిపడేది

అందుకే తరచు మెడికల్ కాలేజీలోని అమ్మాయిల్ని మెచ్చుకుంటూ రకరకాల కథలల్లి చెప్తూ మరీ ఉడికించేవాడు విశ్వం ఆమె సంగతి తెలిసిన స్నేహబృందం కూడా తమాషాగా ఆట పట్టించేవారు

అదంతా తల్చుకుని హాయిగా నవ్వేసేది మమత

ఆ రోజు పిక్‌నిక్‌కి వెళ్ళిందన్న మాటేగానీ మనసంతా బావమీదే వుందామెకి

కొలను ఒడ్డున కూర్చుని దాంట్లోని తామర పూలని తన్మయత్వంతో చూస్తున్న మమతతో

ఏయ్! మమతా! ఏమిటే ఆ పరధ్యానం? అందో అమ్మాయి

పరధ్యానం కాదే పరవశం! ఇంకో అమ్మాయి అందుకుంది

ఎందుకు? అమాయకంగా అంది మొదటమ్మాయి

వాళ్ళ బావ గుర్తొచ్చుంటాడు అవునా? అంది ఆ అమ్మాయి

అసలు మా బావని మర్చిపోతే కదా గుర్తు రావడానికి! నవ్వింది మమత

అబ్బో చాలా వుందే! మరీ అంత ఆశలు పెంచుకోకు దెబ్బతింటావ్! అల్లరిగా అందింకో అమ్మాయి

ఏం? మా బావమీద నీకు మనసైందా ఏం కొంపదీసి? ఆశ్చర్యం నటించింది మమత

అవునే మమతా! ఆ మధ్య ఓసారి పార్కులో అనుకోకుండా కలుసుకున్నాం! ఎన్నో ఊసులు చెప్పుకున్నాం ఒకరి మనసులొకరు చదువుకున్నాం! గాఢంగా ప్రేమించేసుకున్నాం! తన్మయత్వంగా అంది

అలాగా? అయితే మీ ఇద్దర్నీ ఎంచక్కా చంపేసి నేను కూల్‌గా జైలుకెళ్తాను అవును ఎలా చంపను? కత్తితోనా లేక

తల్లీ! అవు! నువ్వంత పని చేసినా చేస్తావు! నాకు నీ బావా వద్దు! అతగాడి ప్రేమా వద్దు! అసలంటూ బ్రతికుంటే మొగుడంటూ రాకపోడు! భయంగా అందా అమ్మాయి

గొల్లుమన్నారంతా

మమత కూడా హాయిగా నవ్వేసింది

ఆమె ధ్యాస మళ్ళీ విశ్వం మీదికి మళ్ళింది

బావ ఏం చేస్తుంటాడు? నా గురించే ఆలోచిస్తుంటాడా? లేక నేనొస్తున్న సంగతే మర్చిపోయి ఆ పేషెంట్స్‌తో కుస్తీ పడుతుంటాడా? ఏమో! ఈ డాక్టర్లని నమ్మడానికి వీల్లేదు! నవ్వుకుంది

మర్నాడే ఆమె హాస్టల్‌కి గుడ్‌బై చెప్పి పల్లెకి వెళ్ళిపోతుంది

వెళ్ళగానే నాన్న ముహూర్తాలు పెట్టేస్తారు ఆపై బావ సాన్నిధ్యంలో హాయిగా బావ వడిలో వెచ్చగా ఓహ్!

ఏయ్! మమతాదేవీ! కాస్త నీ పగటి కలల్నాపి వాస్తవంలోకి రా తల్లీ! ఇలాంటి సమయం మన జీవితంలో రాదు! మీ బావ అతనితో సంసారం జీవితాంతం ఉంటాయి! అందుకే ఈ పిక్‌నిక్‌ని ఎంజాయ్ చెయ్యి! అందో





అమ్మాయి హెచ్చరిస్తూ

సారీ! నిజమే! ఇలాంటి సమయం! ఇలాంటి బాధ్యతారహితమైన హాయి ఇంక మనం మర్చి పోవాల్సిందే! అంటూ లేచింది మమత కదలివచ్చిన వసంతంలా

* * * * *

విశ్వం!

హాస్పటల్‌కెళ్ళబోతున్న విశ్వం మేనమామ ఎలవడంతో ఆగాడు ఏమిటి మావయ్యా? అంటూ

పెద్దవాణ్ణి ఓ మాట చెప్తాను వింటావా? మెల్లగా అన్నాడాయన

ఏమిటి మామయ్యా? దాసు విషయమేనా? చిన్నగా నవ్వాడు విశ్వం

ఉహుఁ! ఇంక అతని విషయంలో నేను జోక్యం కలిగించుకోను!

మరి?

మంగి విషయం!

మంగి విషయమా?

అవును! నువ్వు పనిలోకి పెట్టుకున్న మంగి విషయం! నొక్కి అన్నాడు చౌదరి

చెప్పు మావయ్యా!

వెంటనే ఆమెని పన్లోంచి తీసెయ్యి!

మావయ్యా! ఆశ్చర్యంగా చూశాడు విశ్వం

అవును విశ్వం! ఆమెని పనిలోంచి తీసెయ్యి!

ఎందుకు? అంత నేరం ఆ అమ్మాయేం చేసింది?

నేరం చేసిందని కాదు! ఊళ్ళో ఆమెని గురించి చాలా చెప్పుకుంటున్నారు

ఏమని?

నువ్వు పనిచ్చినందుకు!

ఓ! ఓ పేదరాలికి తిండికి లేకపోతే పనిచ్చి ఆదుకోవడం అంత కష్టంగా ఉందా ఈ వూరి వాళ్ళకి?

అది కాదు విశ్వం! దాని మొగుడికి

ఊఁ!

నీ మీద దాని మీద ఏవో అపోహలున్నాయి

ఛ! ఛ! కంగారుగా చూశాడు విశ్వం

అవును విశ్వం! వాడే కాదు! వూళ్ళో చాలామంది చెప్పుకుంటున్నారి విషయాన్ని

ఎవరా వూళ్ళో వాళ్ళు? ఆ రాయుడి మనుష్యులేనా? కఠినంగా అన్నాడు విశ్వం

కాదు! ఇంకా చాలామంది అనుకుంటున్నారు ఈ విషయం గురించే మొన్న మంగిని మొగుడు చావబాదాట్ట!

అందుక్కాదతను కొట్టింది! మొగుడుగా అతని బాధ్యతల్ని గుర్తు చేసినందుకు! సీరియస్‌గా అన్నాడు విశ్వం మంగి కొంతవరకు అతనికి చెప్పుకుంది

అంటే ఈ విషయం కూడా మంగి నీకు చెప్పిందన్న మాట! సూటిగా చూస్తూ అన్నాడు చౌదరి

ఆ! చెప్పింది! పాపం! నానా హింసలూ పెడుతుంటే కొడుకుతో సహా వచ్చి రంగమ్మ ఇంటిపక్కనే వున్న మరో గుడిశలో తల దాచుకుంటోంది! జాలిగా అన్నాడు విశ్వం

ఓ! చాలా వరకు వచ్చిందన్న మాట! అనుకున్నాడు చౌదరి మనసులోనే పైకి మాత్రం–

అది కాదు విశ్వం! నామాట జాగ్రత్తగా విను! ఈ ఊరి పాలిటిక్స్ నీకు పూర్తిగా తెలియవ్!

ఆ మంగి వీరడి భార్య వీరడు రాయుడి పాలేరు రాయుడు మనకి బద్ధ శత్రువన్న సంగతి నీకు తెలియంది కాదు! అదీగాక వీరడు ఆ రాయుడి కుడి భుజం! అలాంటి వాడి భార్యని తెచ్చి నీదగ్గిర పెట్టుకుంటే రాయుడి ముందు మన పరువేంగాను? అన్నాడు తీక్షణంగా

నేను నీ మేనల్లుణ్ణే! కానీ డాక్టర్ని కూడా మావయ్యా! మాదగ్గర రాజకీయాలకి తావుండ కూడదు అందరూ సమానమే!

అంతెందుకు రేపు ఆ రాయుడి గారికే ఏదైనా సుస్తీ చేసిందనుకో! నేను చూడద్దూ? నవ్వుతూనే అన్నాడు విశ్వం

నీ అవసరం వాళ్ళకెం రాదు! వాడి పాలేరుకే మనం అనలేదు! ఆవేశంగా అన్నాడు చౌదరి

ఆయనకి దాసు చెప్పిన మాటలు గుర్తున్నాయి

ఎవరో ఏదో చెప్తే ఎలా నమ్మేవ్ మామయ్యా? ఆమె నా దగ్గర కొచ్చి బతిమాలింది నా విధి నేను నెరవేర్చాను అంతేగానీ.. ఇందులో పరువు పోయే పనేం లేదు!

అయితే ఇంతకీ ఆ మంగిని పన్లోంచి తియ్యనంటావ్! అంతేనా?

కారణం లేకుండా ఆమె నోటికింది కూడు తియ్యటం నావల్ల కాదు మామయ్యా! శాంతంగానే అన్నా అతని గొంతు స్థిరంగా ఉంది

తెల్లబోయాడు చౌదరి

మేనల్లుడంత నిర్మోహ మాటంగా అంటాడని అతనెన్నడూ అనుకోలేదు

సరే! నువ్వెళ్ళు! అన్నాడు ముభావంగా

కోపం వచ్చిందా మావయ్యా?

కోపమా? ఎందుకు?

నేనిలా మాట్లాడినందుకు

# సుప్తమై గుప్తమై

మాదిరాజు రంగారావు

నాలో ప్రవహిస్తోంది నది
ప్రతి అలలో సూర్య కాంతి నిలుపుకొనీ
కణ కణంలో రస రూపం నింపుకొనీ
ప్రతి వ్యక్తిలో హరిత వనం ఆశలతో
జన సంపదకు ప్రతినిధియై ప్రేరణయై
నాలో ప్రవహిస్తోంది ధుని

నాలో ప్రవహిస్తోంది నది
బిందువుల ఘర్షణలో విద్యుదగ్ని ప్రభవిస్తూ
తరంగాల పోరాటంలో పరివర్తన కాంక్షిస్తూ
వేగంతో జనసమూహ శక్తి నటత్ చలనంతో
దుద్రాశాముఖాన రసమయ శీకర కళతో
నాలో ప్రవహిస్తోంది ధుని

ప్రతి తరంగంలో పలుకుతూ అనల స్వరం
ప్రతి స్వరంలో చిందుతూ కరుణరసం
మృత్యు వెరుగని దీర్ఘాయుః ప్రమాణంతో
అందరూ ఎరిగిన హృదయం ఉదయించే భాషతో
తరలే ప్రజా సమూహం వలె పాయలు పాయలుగా
నాలో ప్రవహిస్తోంది నది

నాలో ప్రవహిస్తోంది నది
ఉంది చూడు నీలో నూ ఈ నదీ రూపం
సుప్తమై ఉండవచ్చు హిమతుషార శ్రేణిలో
గుప్తంగా ఉందేమొ పాతాళం అంచుల్లో
విను! నీలో స్వనించే ఈ ధునీ సంగీతం
చూడు! నీలో సరించే ఈ నదీ సౌందర్యం

# కాంచన సౌధం

నీ అభిప్రాయం నువ్వు చెప్పావ్! ఇందులో తప్పేం వుంది అయినా నీ మనసులోని విషయాన్ని గ్రహించకుండా చొరవ తీసుకుని అడగడం నాదే పొరపాటు!

ఇందులో పొరపాటేం వుంది మావయ్యా? నీకా స్వతంత్రం వుంది కాబట్టి చెప్పావ్! అయినా ఒక్కటడుగుతాను చెప్పు!

ఏమిటి?

సాటి మనిషి బాధలు పడుతుంటే చేతనైనంతలో ఆదుకోవడం తప్పంటావా? వీరడు భార్యని నానా హింసలూ పెట్టి బాధిస్తుంటే ఆ రాయుడు గారు కాని మరొకళ్ళు గానీ ఆదుకున్నారా? చెప్పు మావయ్యా!

నువ్విచ్చే ఆ నలభై రూపాయలతో దాని జీవితం వెళ్ళి పోతుందా? సీరియస్‌గా అన్నాడు చౌదరి

వెళ్ళదు! కానీ వేన్నీళ్ళకి చన్నీళ్ళన్నట్టు పని కొస్తుంది పోనీ ఓ పని చేస్తావా? గంభీరంగా అన్నాడు విశ్వం

నువ్వుగానీ ఆ రాయుడు గానీ అమెక్కాస్త ఆధారం చూపించండి! వెంటనే పన్లోంచి తీసేస్తాను అంతేగానీ ఎవరో ఏదో అన్నారని తినేతినే అన్నంలో నీళ్ళు పొయ్యడం న్యాయమేనా మావయ్యా!

న్యాయాన్యాయాలు ఇవాళ నీ దగ్గర నేర్చుకోవాల్సొచ్చింది! నిష్టూరంగా అన్నాడు చౌదరి

న్యాయం నేర్పడం కాదు మావయ్యా! ఆ పరిస్థితులు చెప్తున్నాయి రెక్కాడితేనే గానీ డొక్కాడని బ్రతుకులు! ఉన్ననాడు తిని లేని నాడు కడుపులో కాళ్ళు పెట్టుకుని పడుకుంటారు మొన్న కొడుక్కి జ్వరం వచ్చి ఉద్ధరిణుడు పాలు లేక చేతిలో పైసాలేక ఆతల్లి ప్రాణం ఎంత కొట్టుకుందో తెలిస్తే నువ్విలా మాట్లాడవ్ మావయ్యా! బాధగా అన్నాడు విశ్వం

క్షణం తిక మక పడ్డాడు చౌదరి వెంటనే–

లోకం సంగతి చెప్పాను నీ ఇష్టం! నీ మీద నాకెప్పుడూ నమ్మకం ఉంది! అన్నాడు

"అది చాలు మావయ్యా! ఎవరేమనుకున్నా నాకు బాధలేదు! నాకు అయిన వాళ్ళు నన్నపార్థం చేసుకో కూడదు!. దయ చేసి జీవచ్ఛవాల్లా బ్రతికే పేద బ్రతుకుల జీవితాల్లో గుప్పెడు వెలుగు ప్రసరించడానికి ప్రయత్నిస్తున్న నన్ను అపార్థం చేసుకోకు మావయ్యా! ప్లీజ్! అంటూ భారంగా అడుగులేస్తూ వెళ్ళి పోయాడు విశ్వం

చౌదరి ప్రతిమలా అలానిల్చుండి పోయాడు అతని మనసంతా చిరాగ్గా అయిపోయింది

మమత రానీ! అంతా అదే చూసుకుంటుంది! అనుకున్నాడు మనసులో

* * * * * *

మంగి ఇంట్లోంచి వెళ్ళి పోయిందని తెలిసిన వీరడు మరింత నిర్ఘాంత పోయాడు

'ఎలా వుండేది ఎలా మారిపోయింది! అనుకున్నాడు ఇలా వుంటే లాభం లేదు! దాన్ని నాలుగు తన్నైనా తీసుకు రావల్సిందే' అనుకున్నాడు

మంగి ఉన్న ఇల్లు విశ్వం హాస్పిటల్ పక్కనే అది మరీ కారం రాసినట్టుంది అతనికి

అందుకే ఆ రోజు చేలో నించి రాగానే మంగి ఇంటికేసి నడిచాడు

గుడిశ తలుపు ఓరగా వేసుంది

మంగీ! గుడిశ బైట్నించే పిల్చాడు వీరడు

ఎవరు? లోపల్నించి గట్టిగా అంది మంగి భర్త కంఠం గుర్తించినా గుర్తించనట్టే అంది

నేనే! నసిగాడు వీరడు

మంగి తడికలోంచి తొంగి చూసి–

ఏటి?" అంది

ఓ సారి బైటికిరా!

ఎందుకు?

రా సెప్తా?"

మంగి కొంగుకి చేతులు తుడుచుకుంటూ వచ్చింది

ఇంటికి పా! అన్నాడు వీరడు

ఇంటికా?

ఊఁ!

ఏ ఇంటికి?"

మనింటికే!

మనిల్లా? అదేటుంది? ఆశ్చర్యం నటించింది మంగి–

ఈ మాట్లకేం గాని పద!

ఇది నాఇల్లు! ఇదిడిసి నేనేడికి రాను! శాంతంగానే అంది మంగి

ఇంకెప్పుడూ రావా? వీరడి గొంతులో తీక్షణత చోటు చేసుకుంటోంది

ఊఁహుఁ!

నీ మొగుడు సచ్చాడా?" ఆవేశంగా అన్నాడు

లేదు! సన్నాసుల్లో కల్సిపోనాడు!

వార్నియ్యమ్మ! జీవితకాలమంతా ఆ డాక్టర్ గోడితగ్గిరే వుంటావా?

మొగుడు కానప్పుడు ఎప్పుడైతేనేం లే!

ఎంతకి తెగించావే! నిర్ఘాంత పోయాడు వీరడు

అవసరం అయితే తప్పుద్దామరి!' దీర్ఘం తీసింది

అయితే నే విన్న మాట నిజవే నన్నమాట! కొరగా చూస్తూ అన్నాడు వీరడు

ఏటా ఇన్నమాట?"

అదే అడాక్టరుగోడికి నీకూ

ఏం? అదిగోడా ఆ దాసుగోడే సెప్పాడా? లేక ఆ అయా సెప్పిందా?

ఎవురైనా సెప్తారే! ఎల్లి కల్లుమూసుకు పాల్తాగితే ఊరోల్లి క్కాపాడ వేటి?

ఎందుక్కాపాడవు? కాపాడతయ్! అదిగో ఆ దాసుగోడికి ఆయాకీ ఎల్లి పాల్తాక్క పోయినా తాగినట్టే కాపాడతాయ్! సీ ఎగ్గులేని జన్మలు!

అసహ్యంగా అంది మంగి



అళ్ళవి కాదే ఎగ్గులేని జన్మలు! నది! ఎగ్గులేని జన్మ!

అవును! అందుకే ఇద్దరి నౌకరిలూ ఊడగొట్బాడా డాట్రు బాబు!

అయ్యాడింది కూడా మీ మూలానే అని నాకు తెలవదనుకుంటున్నావా? మీరు సేసిన పాపం అళ్ళిద్దరి కల్ల పడిందనీ అల్లిక్కడ గుట్టు బైటిడతారో అని అన్యాయంగా అల్లని బైటికంపేశారు! దరమ పెబువులు! ధూ! తుపుక్కున ఉమ్మేశాడు వీరడు

దాసు చెప్పిన కథ అతనికి బాగా తలకెక్కింది

_ ఇంతకీ ఏటంటావ్! విసుగ్గా అంది మంగి

నీ కతలన్నీ నాకు తెల్సు!

మరైతే ఇప్పుడెందు కొచ్చినట్టు? ముఖం చిట్లించింది మంగి

తప్పుకట్టి నిన్నట్టుకు పోదారని!

నే రాను!

ఎందుకురావే! నువ్వేకాదు! నీతల్లో జేజెమ్మొస్తది! మంగి జుట్టు పట్టుకోబోయాడు వీరడు

అంతే!

మంగి ఆదిశక్తే అయింది!

ఇదిగో! అడుగు ముందుకేశావంటే పేణాలు తీత్తాను జాగ్రత్త! ఆరోజూరుకున్నానని ఇయ్యాల నీ పెతాపం సూపిద్దారనుకుంటున్నావేమో! నామీద సెయ్యెయ్యడానికి నీకే కాదు! నిన్ను పుట్టించిన ఆ బెమ్మ తరంకూడా కాదు! ముందిక్కణ్ణుంచెల్లు! అంటూ అతన్ని ఒక్క విదిలింపు విదిలించి గుడిశలో పలికెళ్ళి దడాల్న తలుపు వేసుకుంది

వీరడిలో ని ఆవేశం కట్టలు తెంచుకుంది

దవడలు బిగుసుకున్నాయి!

కళ్ళు ఎర్రబడ్డాయి

నియ్యమ్మ! ఏటే కూశావ్? నీ మీద సెయ్యెయ్యడానికి ఆ బెమ్మ తరంకాదా! సూత్తాను! సూత్తానే! అంటూ తలుపుమీద కాలితో బలంగా తన్నాడు

రంగమ్మా!

తుళ్ళిపడి వెనక్కి తిరిగాడు వీరడు

ఎదురుగా డాక్టరు!

ఇదిగో! రంగమ్మా! ఇతగాడికేదో కావాలట చూడు! తలుపు విరక్కొట్టుకుంటే మళ్ళీ చేయించుకోవడానికి బోల్డు ఖర్చవుతుంది తాపీగా అన్నాడు విశ్వం

గభాల్ని పక్క గుడిశలో నించి రంగమ్మ బైటికొచ్చి –

అలాగే బాబుగారూ! అంటూ వినయంగా అతనికి నమస్కరించింది

విశ్వం హుందాగా తల పంకించి వెళ్ళిపోయాడు

నిర్ఘాంత పోయిన వీరడితో –

ఇంకా ఏట్రా సూత్తన్నావ్! ఇంకెల్లు! సేసింది సాలు! కఠినంగా అంది రంగమ్మ

అంటే పెద్ద దానివి దెగ్గిరుండి ఈ ఎదవ పన్లన్నీ సేపిత్తన్నా వన్నమాట! కొరగా అన్నాడు వీరడు

అవున్రా! ఎదవపన్లు సేసే వోడి కల్లకి అందరి పన్లు ఎదవపన్లలాగే కాపడతాయి! అంతెందుకు! ఇంక మంగి నీ గుడిశకి రాదు! ఏ గెంజినీల్లు తాగినా ఇక్కడే ఆయిగా బతుకుద్ది! నువ్వు నీ ఇంటికో నీకావంది ఒంటికో పో! ఇంకా గొడవెట్టావంటే సెల్లు సీటీ ఇయ్యడానిక్కూడా ఎద్దంగా ఉంది మంగి! ఆవేశంగా అంది రంగి

నిర్ఘాంత పోయి అలా నిల్చుండిపోయాడు వీరడు!

(ఇంకాఉంది)




ఎ ఆర్ – కడప

3 సంవత్సరముల క్రితం మద్రాసులో డాక్టర్లు తలయందు నీరు చేరి వున్నందున తల పైభాగంలో రెండు వైపుల రంధ్రములు చేసి నీరు తీసివేసినారు అప్పటి నుండి యిప్పటి వరకు ఏ విదంగా బాదలేదు కానీ ఆపరేషన్ చేసి నీరు తీయక ముందు మజ్జిగ వాడితే జలుబుగా వుండేది యిప్పుడు అదే విధంగా మజ్జిగ వేసుకున్నపుడు జలుబుగా వుంది సన్నగా తలనొప్పిగా వుంటుంది

• అలా మజ్జిగ పడనప్పుడు దాని వాడకం మానటం మంచిది దీనికి ప్రత్యేక చికిత్స లేదు మళ్ళీ తలలో నీరు చేరిందని అనుమానపడనక్కర లేదు

### కె ఎన్ –వెంకటగిరి

యితరుల వీర్యంతో ఎల్లలు పొందే ప్రక్రియను ఏమంటారు? అది ఎక్కడ చేస్తారు? ఎవరిని కలుసుకోవాలి? మరియు ఆ ప్రక్రియకు సంబందించిన కొన్ని వివరములు తెలియజేయండి

• దీనిని ఆర్టిఫిషియల్ ఇన్సెమినేషన్ అని అంటారు మెడికల్ కాలేజ్ ఆసుపత్రులలో ఈ ప్రక్రియ చేయటానికి వీలు ఉంటుంది కానీ దీనికి చాలా లావాదేవీలు ఉన్నాయి చట్టపరంగా కొన్ని చర్యలు అవసరం

### టి ఆర్ కె–కర్నూలు

నా వయసు 42 సంవత్సరములు నా 18 వ ఏటనే వేసెక్టమీ అయినది నా తల్లిదండ్రులు 10 సంవత్సరముల క్రితం మా కులంలో అమ్మాయి నిచ్చి పెళ్లి చేసారు మాకు సంతానం కలగలేదు నేను రికెనలైజేషన్ చేయించుకుందామంటే భయంగా వుంది మా వాళ్ళు కూడా భయపడుతున్నారు

• చేయించుకుందామని ఆలోచన ఉన్నప్పుడు భయం ఎందుకు? 18వ ఏటనే వేసెక్టమీ ఆపరేషన్ ఎవరు చేశారు? పెళ్ళి కాకుండా వేసెక్టమీ చెయ్యటం చట్టవిరుద్ధం!

### ఎన్ కె– కావలి

నా వయసు 20 సంవత్సరములు నా శరీరము పగిలినట్లు వుంది అసహ్యముగా వున్నది ఏమి పూసినా తగ్గలేదు కొబ్బరి నూనె వేజలైను వెన్న మొదలగునవి వాడినాను శరీరము నున్నగా వుండి తెల్లబడాలంటే ఏమి వాడవలెనో తెలుపగలరు

• మీరు చర్మ రోగాల వైద్యులను కలిసి వారి సలహా ప్రకారం మందులు వాడవలసి ఉంటుంది ప్రత్యక్షంగా చూడనిదే రోగ నిర్ణయం చెయ్యటం కష్టం!

### యస్ యన్ యం– నౌపడా

నా వయసు 18 సంవత్సరములు నా కుడిచేతి మీద బొటన వేళ్ళ నుంచి భుజము వరకు సన్నని తెల్లని పాము ఆకారముతో మచ్చలు వున్నవి నేను పుట్టినప్పటి నుండి కూడ యివి వున్నాయి ఇది ఏమన్నా వ్యాధా?

• దీనిని ల్యూకో డెర్మా అని అంటారు ఇది పుట్టుకతోనే వస్తుంది దీనికి ప్రత్యేకించి చికిత్స లేదు □

# నేను తెలుసుకున్న నిజం

'చంద్రహాస'

బయట సన్నగా తుంపర పడుతోంది అందులో నూ ఒకటే ఈదురుగాలి మనిషిని తోసేసే వేగంతో వీస్తోంది చెట్లు ఒకటే ఊగిపోతున్నాయి ఆ వీధిలోని పిల్లలు ఓ విశాల ప్రాంగణ మందు నిలబడి చేతులతో చప్పట్లు కొడుతూ ఎవరికి వారు గుండ్రంగా తిరుగుతున్నారు చిన్నచిన్న ముక్కలుగా చించిన కాగితపు ముక్కలను గుప్పిట నుంచి ఒక్కసారిగా గాలిలోకి విసురుతున్నారు

ఆ చిన్నచిన్న కాగితాలు గాలిలో కొన్ని పైపైకి వెళ్ళిపోతూంటే వింతగా చూస్తూ చప్పట్లు కొడుతున్నారు కొన్ని కొన్ని పైకి వెళ్ళలేక వానతో పాటు క్రిందపడుతూంటే పూలజల్లు కురుస్తున్నట్లుగా భావిస్తున్నారు

వారికి వానలో తడుస్తూంటే ఎంతో వింతగా హాయిగా వున్నట్లు తోస్తోంది



చినుకులు ఉండుండి కాస్త ఎక్కువవుతున్నా వాళ్ళు ఖాతరు చేయటంలేదు

వారిలో గిరిజ కొడుకు రాము వనజ కొడుకు గోపి కూడా వున్నారు ఇద్దరూ ప్రక్క ప్రక్క వాటాల్లో వుంటున్నారు

గోపి కాస్త అల్లరి పిల్లవాడు రాము మంచి పిల్లవాడు కానీ గోపితో కలిస్తే మాత్రం ఇక ఎవరి మాటా వినిపించుకోడు గోపీకి రాము అంటే కొంత అసూయ దానికి కారణం తన తల్లి ప్రతిదానికి తనను తిడుతూ అస్తమాను కొడుతూ వుండటం రాము వాళ్ళ అమ్మ వాడ్ని అసలు కొట్టకపోవడం మంచి మాటలతో సముదాయించడం అప్పటి నుంచి గోపీ అనుకున్నాడు రాముని ఏ విధంగా కొట్టించాలా అని

గిరిజ పిల్లల్ని ఎలా పెంచాలో వాళ్ళ మనస్తత్వాలను క్రమశిక్షణలో ఎలా వుంచాలో బాగా తెలిసిన మనిషి వనజకి అది చేతకాదు ప్రతీ పనికి కొడుకుని తిట్లుతిడుతూ కొట్టడమే ధ్యేయంగా పెట్టుకుంటుంది

వాన ఉధృతమవుతూంటే గాబరా పడి రామూ ఇంట్లోకి రామ్మా వాన ఎక్కువౌతోంది అని గట్టిగా కేక వేసింది కానీ రాము దానిని ఖాతరు చెయ్యలేదు

ఇక టపటపమని వాన గట్టిగా కురిసేసరికి పిల్లలు చెల్లాచెదరై నెత్తి మీద చేతులు పెట్టుకుని ఎవరిళ్ళకు వాళ్ళు చేరుకున్నాను

అయ్యో బాబోయ్! వానలో అంతగా తడి చచ్చావు రేపొద్దున్న ఏదైనా రోగమొస్తే హాస్పటల్ చుట్టూ తిరగలేక చావాలిరా విధవా! వెళ్ళొద్దన్నానా? ఎందుకు వెళ్ళావు? ఇక వెళ్తావా? అంటూ గదమాయిస్తోంది వనజ

అమ్మా నన్ను కొట్టకే ఇక వెళ్ళను కొట్టకు కొట్టకు భయంతో బిక్కచచ్చి పోతున్నాడు గోపీ

అంతే రెండు దెబ్బలు వీపు మీద మారుమ్రోగాయి

గోపి ఇక ఓర్చుకోలేక బిగ్గరుగా ఏడవసాగాడు

నోర్మూస్తావా ముయ్యవా? మళ్ళీ ఒక్కటియ్యనా? ముయ్యి నోరు ముయ్యి అంటూ గట్టిగా అరచింది వనజ

నేను వానలో తడిస్తే నీ కేమయింది? ఎక్కిళ్ళ మధ్య మాట తడబడుతూ అన్నాడు గోపి

ఏమయిందా నీ శ్రాద్ధం అయింది అంది కోపంగా వనజ

గోపీలో ఉక్రోషం వచ్చింది కానీ ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో అలాగే ఏడుస్తూ

పడుకున్నాడు

ఇంట్లోకి ప్రవేశించబోతున్న రాము గడప దగ్గరే ఆగిపోయాడు

ఏం అక్కడే నించున్నావే రారా లోపలికిరా! గద్దించినట్లు అంది గిరిజ

నువ్వు నన్ను కొడతావు అన్నాడు భయంభయంగా రాము

అంత భయం వున్నవాడివి ఎలవంగానే రానవసరం లేదా? అంది గిరిజ

రాము మాట్లాడలేదు నిన్ను కొట్టనులేరా ఈ సారిలా చేసావంటే ఆ చీకటికొట్లో వేసెస్తాను జాగ్రత్త! అంది భయపెడుతూ గిరిజ

రాము కాస్త తటపటాయించి లోపలికి వచ్చాడు గిరిజ తువ్వాలు తెచ్చి కొడుకు తల తుడుస్తూ అంది వానలో తడిస్తే ఏమవుతుందో తెలుసా?

చల్లగా వుంటుంది కదమ్మా

నీకు ఇప్పుడు చల్లగానే వుంటుంది రామూ తర్వాత విపరీతమైన జలుబు చేస్తుంది అది రోగం క్రిందో తయారై మనిషి జీవించి వున్నంత కాలం వాన పడినప్పుడల్లా జలుబు చేస్తూ ప్రతీసారి తుమ్ములొస్తాయి అప్పుడు ఏ పని చేయడానికి వీలు కుదరదు

మన ఎదురింటి బామ్మగారికి కూడా అలానే వచ్చింది రోగం క్రింద చూశావుకదూ అంది గిరిజ

రాముని పరిస్థితులు కాస్త అర్థమవుతున్నాయి అమ్మ చెప్పింది నిజమే వాన పడుతుంది వెంటనే రమ్మనమంటే తను అలాగే నించున్నాడు వెంటనే వాన పడింది

మరి అలా వానలో తడిస్తే జలుబు చేస్తుంది ఇది కూడా నిజమే అనుకుంటూ ఓ ఘుమ్మ తుమ్మాడు అప్పుడు అమ్మ మాటకి ఎంత విలువ వుందో అర్థమైంది రాముకి

ఇక వానలో ఎప్పుడూ తడవను అన్నాడు రాము

గుడ్ బాయ్ అని ఓ ముద్దు ఇచ్చి లాలించింది గిరిజ

గోపీ మాత్రం ఏడుస్తూ ఏదో తెలియని ఉడుకు మోతుతనంతో వున్నాడు వాన వెలిసింది సన్నటి చినుకులు అప్పుడప్పుడు ఒకటో అరో పడుతున్నాయి ఇంటి ముందర చిన్న కాల్వల ద్వారా వాననీళ్ళు పారుతున్నాయి ఇంటి ముందట పల్లంగా వున్న నేలలో నీళ్ళ నిలిచి వున్నాయి

మళ్ళీ పిల్లలంతా వీధిలో జేరి అల్లరి చేయసాగారు వాన నీళ్ళలో కాళ్ళు పెట్టి నదిలో నడుస్తున్నట్టు అనుభూతి చెందుతూ పరిగెత్తసాగారు ఆ పరిగెత్తడంతో నీళ్ళు చెల్లాచెదరై చుట్టూ నుంచుని వున్న ఎల్లలపై పడటం జరిగింది వాళ్ళ గుడ్డలన్నీ బురదతో ఎర్రగా తయారయ్యాయి

చుట్టూ నుంచుని వున్న ఎల్లల్లో ఓ పిల్లాడు ఒక లావురాయి తెచ్చి నీళ్ళల్లో పడేశాడు నీళ్ళలో పరిగెత్తుతున్న వాళ్ళ మొహం మీద మొత్తం స్నానం చేసిన రీతిలో తయారయ్యారు

అంతే! అలజడి చెలరేగింది జట్లు జట్లుగా విడిపోయి ఆ మురికి నీళ్ళు దోసిళ్ళతో తీసుకుని ఒకరి మీద ఒకరు పోసుకోసాగారు

తర్వాత ఎల్లలంతా గుంటలోకి చేరి కాళ్ళతో మర్దనా చేస్తున్నట్లు త్రొక్కసాగారు ఆ నీళ్ళన్నీ రోడ్డు మీద పడి రోడ్డు మట్టిరోడ్డయింది బురద బురద

అమ్మా నేను బయటికి వెళతా అన్నాడు రాము తల్లితో

వద్దమ్మా సరే వెళ్ళు కానీ వారితో చేరకు! వాళ్ళు చూడు ఎలా వికృతంగా ఆడుతున్నారో అదీ ఒక ఆటేనా? బురదనీళ్ళు చొక్కాల మీద లాగుల మీద ఎలా పోసుకుంటున్నారో వాళ్ళ కాళ్ళంతా బురద బురద అదిగాక మట్టిలో అందులో బురదలో చేతులు పెట్టి ఆడితే కురుపులు లేస్తాయి చేతులు మరి బయంకరంగా తయారౌతాయి నువ్వు ఇక బలపం పెట్టి పలక



మీద రాయడానికి వీలు లేనంతగా' అంది గిరిజ

అమ్మో! భయపడ్డాడు రాము

మళ్ళీ హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చినవాడిలా అమ్మా కాగితం పడవలు నీళ్ళలో వదలి ఆడుతుంటానే! ఇక్కడే ఆడుకుంటా చేసివ్వవూ' అన్నాడు జాలిగా

గిరిజ ఓ క్షణం ఆలోచించి సరేనన్నది

రాము వాళ్ళ చెల్లెలు గుమ్మం ముందు కూర్చుని వానలో తడవకుండా కాగితం పడవలు వదులుతున్నారు

చిన్నప్పుడు ప్రతీమానవుడూ వానలో తడిసి, నీళ్ళలో కాగితం పడవలు వదిలిన వాడే! దాంట్లో వున్న అనుభూతి వానాకాలంలో అపూర్వమైనది కావటంతో గిరిజ కూడా చూస్తోంది వింతగా

ఆ పడవలు నీటి మీద విచిత్రంగా తేలుతూ ప్రయాణం చేస్తున్నాయి

గాలి కొంచెం వేగంగా వీచగానే పడవ చాలా వేగంతో ముందుకు పోతోంది దాన్ని చూసి ఆ పడవ నాదంటే నాదని అన్నా చెల్లెల్లు ఆనందంతో అరుస్తున్నారు

ఇంతలో ఆ పడవ హఠాత్తుగా ఆగిపోయింది దానికి అడ్డంగా ఏదో చిన్న మొక్క ఆటంకం ఏర్పరచింది గాలి వీచినా అది కదలటంలేదు గానీ వేరొక పడవ శరవేగంతో దానిని అధిగమించి తీరం వేపు పయనిస్తోంది

గిరిజకి ఆ పడవలలోనూ జీవితపు నగ్నసత్యాలు గోచరిస్తున్నాయి ఎన్నో నీతులు ఈ పడవలు నేర్పుతున్నాయి అవన్నీ మంచి నీతులు అవి నేర్పే నీతులన్నీ తన కొడుక్కి నేర్పి వాడిని ప్రయోజనకరంగా తీర్చిదిద్దాలి అది తల్లి మనసు

రాము కాస్త ముందుకి పోయి దారిలో ఆగిపోయిన పడవని కర్రపుల్లతో నెట్టాడు అది ముందుకి పోయినట్లే భ్రాంతి కలిగింది వెంటనే మునిగిపోయింది

# నేను తెలుసుకున్న నిజం

ఇంకా ఒద్దునే నిలుచుని మరదగొడిగా వున్న రెండు పడవల్లో ఓ పడవ గమ్యం వేపు నిటారుగా పోకుండా ఎడమ వైపుగా ప్రయాణిస్తోంది మళ్ళీ గాలి రావడికి అది దారిమళ్ళిపోయి కుడిదిక్కుగా కొట్టుకుపోయి మళ్ళీ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే నన్నట్లు ఆవలి తీరం చేరక ఈ తీరపు ఒద్దునే నిలిచింది

సొంత అభిప్రాయాలు లేక కాలప్రవాహానికి కొట్టుకుపోతూ అంతా దేవుడిదే భారం అంటూ ఏ కార్యం చేపట్టని అజ్ఞానపు మనుష్యులకు ప్రతీక ఈ పడవ

అంతవరకూ నీటిలో ఆడుతూ గోల చేస్తున్న ఎల్లలంతా తమ అల్లరి మానేసి కామ్‌గా రాము ఇంటి ముందు గుమిగూడారు

వారికి రాము మీద చాలా అసూయ కలిగింది రాము ఎంచక్కా వాళ్ళమ్మ వాళ్ళ చెల్లెలి దగ్గర కూచుని హాయిగా కాగితపు పడవలు వదులుతూ ఎంత ముసిముసిగా నవ్వుతున్నాడు మరి తామో మురికి కాళ్ళతో మురికి చేతుల్తో గుడ్డలంతా పాడు చేసుకుని ఇలా చెడ్డ ఎల్లలని పేరు తెచ్చుకుంటున్నాము అని అనుకున్నారు వాళ్ళంతా

గోపీ ఉన్నట్టుండి వేగంగా వెళుతున్న పడవ మీద లావు రాయి వేశాడు వెంటనే అది నీటిలో సగం మునిగి సగం తేలుతూంది

రాముకి గోపీ మీద చాలా కోపం వచ్చింది అందులో ఆ రాయి నీళ్ళల్లో పడి ఆ నీళ్ళు రాము మీదా గిరిజ మీదా పడ్డాయి

నా పడవని ఎందుకు ముంచేశావ్? అని కోపంగా అడిగాడు రాము

పోతే పోనీరా రాముూ వాళ్ళు అల్లరిపిల్లలురా! బుద్ధిమంతులు చేసే పని కాదది అంటూ రాము వైపు తిరిగి అంది గిరిజ

వెళ్ళండరా మీరిక్కడ నుంచి పొండి వెధవల్లారి మీరూనూ? అని సున్నితంగా కసిరింది వాళ్ళని

గోపి మొహం వాడిపోయింది

దానికి కారణం రాము తన పడవ మునిగి ఏడుస్తాడనుకున్నాడు కానీ రాము ఏడవటం లేదు

గోపికి ఉక్రోషం వచ్చింది

మాకూ వున్నాయి కాగితాలు పడవలు చేయటం మీకొక్కళ్ళకే కాదు! మాకూ వచ్చు' అని గిరిజకేసి కోపంగా అని రండిరా పెద్ద గొప్ప పడుతున్నారు మనం మన ఇండ్లలో చేసుకుందాం అన్నాడు మిగతా వారితో

గోపీ నాయకుడిగా వున్న ఆ జట్టు గోపీ ఇంటికి వెళ్ళింది

అరేయ్ గోపీ! ఈ అవతారంతో మా ఇంటికి వెడితే మా అమ్మ నన్ను కొడుతుంది అందుకే నాకు భయం! నువ్వు మాకు కూడా కాగితం పడవలకి పేపర్లు తీసుకువస్తే మనందరం కలసి ఆడుకోవచ్చు అన్నాడు రాజు

తన నోట్సులోని పేపర్లు వీళ్ళకెందుకు ఇవ్వాలి అన్న మంచి ప్రశ్న ఉదయించింది గోపీలో కానీ అది మరుక్షణం మాయమయింది

తనని రాము వాళ్ళ అమ్మ తిట్టింది తను తన స్నేహితులలో పరాభవం పొందాడు దానికి ప్రతీకారం తీర్చుకోవాలంటే తను వీళ్ళతో పాలుపంచుకుని ఆ రాముగాడు అసూయ చెందేలా చేయాలి

ఇలా ఆలోచిస్తూ సరేనన్నాడు మొత్తం గోపీతో కలిపి వాళ్ళు ఆరుగురున్నారు

వాళ్ళందరినీ ఎయట నుంచోమని తాను వెళ్ళాడు లోపలికి

అదృష్టం అమ్మ లోపల ఎక్కడో వుంది ఆత్రుతతో గబగబ మట్టికాళ్ళతో లోపలికి వెళ్ళి ఒకనోట్సు తీసుకుని బయటకి పరిగెత్తుకుని వచ్చేశాడు గోపి

ఆ రూమంతా మట్టితో మరకలతో వికృతంగా వుంది

వాళ్ళ నాన్న వాడికోసం మొన్ననే తెచ్చిన లేపాక్షి నోట్సులో పేజీలు చించసాగాడు

పేజీలు చించుతున్నాడు పడవకోసం తయారీకి శ్రమపడుతున్నాడు కానీ ఆ ఆకృతి రావటం లేదు అలా ఓ పది పేజీలు చించి పోగులు పెట్టాడు

ఆఖరికి రాజు తయారు చేశాడు మొత్తం ఒక్కొక్కరికీ రెండేసి పడవలు చొప్పున పన్నెండు పడవలు తయారయ్యాయి నోట్సు సగానికి తగ్గిపోయింది

అందరూ ఉత్సాహంగా దాంట్లో వదిలారు అప్పుడు గాలి వీచడం చాలావరకూ ఆగిపోయినందువల్ల పడవలు ఒకదాని కొకటి



# కండరాల పట్లతో తన వ్యాయామం చెడటం దేనికి?




# నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి— ఇవే తనకి కావలసినవి అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి ఎందుకంటే అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయం చేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి**

నొప్పి తగేవరకూ ఆ తర్వాత రెండు రోజుల వరకూనూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు ఎందుకంటే నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువులకైన గాయం

కనుక మీ ఆప్తులు ఎవరైనా కండరాల పట్లు, బెణుకులు కీళ్ల పట్లు లేద ఒళ్లు నొప్పులతో బాధ పడటం జరిగితే కాస్త అయొడెక్స్ మర్దించండి రోజుకు రెండుసార్లు తమని రెండింతలు శీఘ్రంగా మళ్ళ చురుకుగ చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు

**అయొడెక్స్** —నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్

SKF—ఎస్‌కేఎఫ్ ఉత్పాదన

ELI 1511

అతుక్కుని ఏదీ కదలటం లేదు  కదిలితే కొంత దూరం పోయి మళ్ళీ అక్కడ ఆగిపోతున్నాయి

మరి రామూ పడవలు బాగా వెళ్ళాయి  మరి మనవి వెళ్ళటం లేదే? అన్నారు ఇద్దరు ఒక్కసారిగా  అంతా ఆ స్టేట్‌మెంట్‌ని ఆమోదించారు

ఇంతలో అపరకాళికాదేవిలా వనజ బెత్తం తీసుకుని వెనుకగా వచ్చి గోపీని చితక బాదింది  వాడికళ్ళముందే తన తల్లి చేతిలో అందమైన కాగితపు పడవలు నలిగి ఉండలా పెంటదిబ్బలో కలిసిపోయాయి  స్నేహితుల ముందు ఇంతకు ముందుకన్నా పరాభవం

మిగతా పిల్లలందరూ భయంతో వెళ్ళిపోయారు  గోపీలో ఆవేదన పెల్లుబుకుతోంది

తను చేసిన తప్పేమిటో  తనకు అస్తమానూ దెబ్బలెందుకు తగులుతున్నాయో ఆలోచించలేకపోయింది ఆ పసి హృదయం అంతకు మించి తల్లి ఆదరణలేక రగులుతోంది వాడి మనసు

వాడి మనసంతా ఇప్పుడు రాము గురించే ఆలోచిస్తోంది  రాము వాడి కళ్ళముందు బుద్ధ భగవానుడిలా  గోచరిస్తున్నాడు  తను రాముపట్ల ప్రవర్తించిన గుణాలు వాటి ఫలితాలు అన్నీ కళ్ళముందు మెదలుతున్నాయి

# నేను తెలుసుకున్న నిజం

ఓ రోజు ఇలాగే ఓ సంఘటన జరిగింది  ఆ రోజు బాలవిహార్‌లో ఇంత ఎత్తున ఇసుక పోశారు  ఎల్లలంతా ఆడుకోడానికి వచ్చారు  అంతా ఆ తడి ఇసుకతో  ఎచ్చుక గూళ్ళు కట్టుకుంటున్నారు  రాము కూడా వాళ్ళతో ఆడుతున్నాడు

అందరూ చాలా ఎత్తుగా దాన్ని కడుతున్నారు  రాము చాలా నీట్‌గా కట్టి దానిమీద కాగితపు పూలు  మందారం పూలు అన్నీ అమర్చి అందంగా తయారు చేశాడు

గోపీ ఇక ఆట అయిపోయిందన్నట్లు అందరి గూళ్ళూ కాళ్ళతో పుటుక్కున కూల గొట్టించాడు  ఆఖరుగా రాము గూడుని కూడా ధ్వంసంచేసి అరుపులతో కేకలు పెట్టసాగారు

రాము మౌనంగా వున్నాడు ఏమీ బాధపడ లేదు

మురళి మాత్రం తన గూడుని ఎందుకు కూలగొట్టావని కోపంగా కళ్ళనీళ్ళు తిరుగుతూండగా ప్రశ్నించాడు గోపీని  అప్పుడు రాము అన్నాడు

చ! ఇంతదానికే ఏడుస్తే ఎలా! నీ ఒక్కడి గూడు కూలగొడితే నువ్వు అనచ్చు! అందరి గూళ్ళూ కూలగొట్టబడాయి  దాంట్లో కూడా ఆనందం ఉంది కదా! ఇంత ఇసుక వుంది  రోజు చాలా గూళ్ళు కట్టుకోవచ్చు!

గోపీ నిర్ఘాంత పోయాడు  రామూ బాధపడడు ఎందుకని?

అందుకే ఒక నిర్ణయానికొచ్చాడు గోపి  ఇక రాముతో మంచి స్నేహం చేదామని!

సాయంత్రం కాస్త చల్లబడింది

గోపి ఆ సాయంత్రం లెక్కల పుస్తకం పట్టుకుని రాము వాళ్ళింటికి వచ్చాడు

రామూ  పిలిచాడు గోపి

నేను రాను ఆటలకి  మా అమ్మ తిడుతుంది  లెక్కలు చేసుకుంటున్నాను  అన్నాడు బుద్ధిగా చదువుకుంటున్న రాము

నేను ఆటలకి రాలేదు  నీతో చదువుకుందామనే వచ్చాను  ఇదిగో లెక్కల పుస్తకం తెచ్చుకున్నాను  మనిద్దరం చేసుకుందాం లెక్కలు  అన్నాడు గోపి

రాము సంభ్రమంలో వున్నాడు  తను విన్నది నిజమేనా  వీడిలో ఇంత మార్పు వచ్చిందేమిటబ్బా  అని లోపలకి రమ్మని చెప్పాడు

ఇద్దరూ బుద్ధిగా లెక్కలు చేసుకోవటం చూసింది గిరిజ

ఇంతలో వనజ  హఠాత్తుగా వచ్చి వెధవా ఇక్కడున్నావన్నమాట  నడువ్ అని రెక్కపట్టి లాక్కుపోతోంది  ఎందుకండీ  ఏమయింది? ఆత్రుతతో ప్రశ్నించింది గిరిజ

వీడు దొంగతనం కూడా నేర్చాడు గిరిజగారూ! వాళ్ళ నాన్న జేబులో ఐదు రూపాయలు




తనలో వైశిష్ట్యం ఉన్నా సామాన్య ప్రజలతో కలిసి మెలిసి ఉండడం సర్వసాధారణమైన దుస్తులు ధరించడం నిరాడంబరుల స్వభావం మరికొందరి స్వభావం వేరు ఆడంబరంగా దుస్తులు దరించడం వల్లనూ సామాన్యులకు కొంత దూరంగా ఉండడం వల్లనూ గౌరవం కలుగుతుందని వారి అభిప్రాయం అసలు సత్తువ లేని వారికే ఆర్భాటం ఎక్కువ వారు బడాయిగా వేషం వేస తమకు లేని శక్తులను ప్రకటించుకొని స్వార్థం కోసం ఇతరులను మోసగిస్తూ ఉంటారు మొదట తెలియక పోయినా క్రమంగా నైనా వారి గుట్టు బయట పడక తప్పదు అమాయకులు వారినినమ్మి మోసపోతారు

శక్తి సామర్థ్యాలు ఉన్నవారూ స్వార్థం విడిచి ప్రజాక్షేమానికి పాటు పడేవారూ నిరాడంబరంగానే ఉంటారు అపరిచితు లెవ్వరూ వారిని గాని వారి గొప్పతనాన్ని గాని గుర్తించలేరు తమ్ము గురించి ఇతరులకు తెలియకుండా ఉండాలనే వారి కోరిక దీనికి గాంది మహాత్ముడు తగిన ఉదాహరణ

అది అసహాయోద్యమం ముమ్మరంగా ఉన్న సమయం ఒకప్పుడు బీహారులో ఒక వూరిలో జనసామాన్యాన్ని ఉద్దేశించి గాంధీ మహాత్ముడు ఉపన్యసించ వలసి ఉన్నది ఆయన యంతటి నిరాడంబరజీవి మరి యొకరు ఉండరనే చెప్పవచ్చును మోకాళ్ళు దిగని ముతక ఖద్దరు పంచె కప్పుకొనే అంగవస్త్రం మాత్రమే ఆయన దుస్తులు రైలులో వెళ్ళేటప్పుడు మూడవతరగతి (ఇప్పటి రెండవ తరగతి) పెట్టెలోనే ప్రయాణం అప్పట్లో రిజర్వేషను లేదు ఆయన ఆ ఊరు వెళ్ళడానికి బండి ఎక్కారు జనం కిటకిటలాడుతున్నా ఆయనను గుర్తించిన కొందరు ఆయన కూర్చుండుటకు విశాలంగా చోటువదిలారు ఒక స్టేషను దాటాక-మీటింగుకు అవూరు వెళ్ళుతున్న ఒక మోటు రైతు ఆ బండిఎక్కి మహాత్మునికి ఇరువైపులా కొంచెం ఖాళీ చోటు ఉండడం చూచాడు మహాత్ముణ్ణి అతడు ఎరగడు ఇంత మంది శ్రమ పడుతూవుంటే నీవు అంత విశాలంగా కూర్చుంటావేం? నాకు కొంచెం జాగా ఇయ్యి అని గద్దించి అడిగాడు మహాత్ముడు కొంత జరిగి అతనిని కూర్చోమన్నాడు ఇతరులు ఏదో అనబోతూ ఉంటే మహాత్ముడు ఊరుకోమని సైగ చేశాడు ఆ వ్యక్తి మహాత్మునిపై ఏవో పాటలు పాడసాగాడు గమ్యస్థానం రాగానే గాంధీగారు రైలుదిగారు వందలకొద్దీ జనం ఆయనను పూలమాలలతో ముంచి మహాత్మా గాంధీకీ జై నినాదాలు చేశారు ఆయన ప్రక్క కూర్చుండి ఉండిన రైతు నిర్ఘాంత పోయి ఆయనను గుర్తించలేక తాను మోటుగా ప్రవర్తించినందుకు చాలా నొచ్చుకొన్నాడు క్షమాపణ చెప్పుకోడానికైనా అవకాశం ఇయ్యకుండా నాయకులు మహాత్ముణ్ణి తాము తెచ్చిన వాహనం ఎక్కించి తీసుకు పోయారు

మనిషికి విలువైన దుస్తులు భేషజంగా ఉండడం కీర్తి ప్రతిష్ఠలను ఇయ్యవు నిరాడంబరత్వమే ప్రశస్తిని కలిగిస్తుంది

—బులుసు వేంకట రమణయ్య

---

పోయాయట పీడుగాళ ఇంకెవరు తీస్తారు వెధవ నడవరా నీ తోలు వలుస్తా అంటూంది వనజ

అమ్మా ఒట్టే నేనేపాపమూ ఎరగను నాకసలు తెలియదు నేను తియ్యలేదమ్మా తియ్యలేదు అంటూ ఏడుస్తున్న గోపీని రెండు దెబ్బలు వేస

అబద్దాలు చెపుతావురా రాస్కెల్! అని అంది వనజ

ఎరిక్షీలనతో తిలకిస్తున్న గిరిజ వనజని వారించి వాడిని కొట్టడం ధర్మం కాదని చెప్పింది వాడు

## నేను తెలుసుకున్న నిజం

మారాడనీ శుభ్రంగా ఇక చదువు కుంటాడనీ చెప్పింది

వాడిని వదిలి వనజ గిరిజతో నడిచింది వాళ్ళింట్లోకి

వనజగారూ! మీకో విషయం చెప్పనా పిల్లలిప్పుడూ తల్లి ప్రేమను ఆశిస్తారు , అలా ఆశిస్తున్న పిల్లల్ని మంచి మారాన మంచి మాటలతో మళ్ళించాలే తప్ప ఇలా వాతలు తేలేలా కొడితే వారు మరి అల్లరిగా తయారై కాడిస్టులవుతారు

భగవంతుడు వుట్టుకతో ప్రతీ పిల్లవాణ్ణి అల్లరివాడిగా కాంచడు పిల్లలు బుద్ధిమంతులుగా తయారవటానికి అల్లరివారుగా మారటానికి మనదండీ తల్లిదండ్రులదండీ అసలైన బాధ్యత! మంచి క్రమశిక్షణతో పెంచి వారిని లాలిస్తే మంచి మారాన పయసించి ఉత్తమ భావి భారత పౌరులుగా తయారౌతారు అంది గిరిజ...

నన్ను క్షమించండి ! మీవల్ల నాకు నిజం బోధపడింది అంది అర్థం చేసుకున్న మనస్సుతో వనజ □



హిప్పీలకు భూతల స్వర్గమే గాక ఎల్లప్పుడు జనంతో రదీ గా
వుండే కలన్‌గూట్ బీచ్



అంజునా బీచ్

# హిప్పీలకు భూతల స్వర్గమైన గోవా బీచ్‌లు

పర్యాటకులు సందర్శించి అనందించదగిన సుందర ప్రదేశాలు మనదేశంలో అనేకం వున్నాయి అలాంటి వాటిలో గోవా ఒకటి భరించరాని ఎండల వల్ల ఎల్లప్పుడు పనిపాట్లతో సతమతమయ్యే మైదాన ప్రాంతవాసులకు గోవా ఎంతో మనోల్లాసాన్ని కలిగిస్తుంది ప్రకృతిసిద్ధమైన సుందరవనసములతో సరస్సులతో సముద్ర తీరంతో కొబ్బరి తోపులతో మామిడి పనస జీడిమామిడి తోటలతో అక్కడక్కడ వరిచేలతో అపారమైన అటవీ సంపదలతో శోభాయమానమైన సహజ సౌందర్య ప్రకృతి దృశ్యాలతో సుందర వినోద పర్యటన కేంద్రంగా విరాజిల్లుతున్నది గోవా

నేటి కర్నాటక రాష్ట్రానికి వాయువ్య దిశగా 3611 చదరపు కిలోమిటర్ల విస్తీర్ణం కలిగిన గోవా ప్రస్తుత జనాభా 11 లక్షలు గోవా జిల్లాలో మొత్తం 11 తాలూకాలు వున్నాయి దీని రాజధాని నగరం పాంజిమ్ ఇక్కడి ప్రజలు కొంకణి భాష మాట్లాడుతారు

గోవాకు 120 కిలో మిటర్ల పొడవు కలిగిన సముద్రతీరం వుంది ఈ తీరం పొడవునా అక్క దక్కడా 8 అందమైన బీచ్‌లు వున్నాయి వీటిలో కలన్‌గూట్ కోల్వా అంజునాబీచ్‌లకు ఎంతో ప్రత్యేకత వుంది గోవా వెళ్ళిన ప్రతి సందర్శకుడు స్త్రీ పురుష బేదం లేకుండా అందరూ ఈ బీచ్‌లను సందర్శిస్తారు

ఈ బీచ్‌లకు వున్న ప్రత్యేకత ఎమిటంటే వీటిలో సంచరించే విదేశాలకు చెందిన ఆడవాళ్ళు మగవాళ్ళు ముఖ్యంగా హిప్పిలు కొన్ని జంటలు జంటలుగా దిగంబరంగా సందర్శకులకు దర్శనమిస్తుంటారు అక్కడ దుస్తులు లేకుండాను అర్ధనగ్నంగాను సందర్శించే స్త్రీ పురుషులను అక్కడికి వెళ్ళిన మన వారు (భారతీయులు) ఎంతో వింతగా నోటి మిద వేలు వేసుకొని చూస్తుంటారు అంజునా బీచ్‌లో నగ్నత్వం ఎక్కువగా ప్రదర్శిస్తున్నందు వల్ల అక్కడ దిగంబరత్వం నిషేదించబడింది అని ప్రభుత్వం వారు బోర్డు పెట్టారు

ఈ బీచ్‌లలో కనబడినంత దిగంబరత్వం మనదేశంలో ఏ ఇతర బీచ్‌లలో కానరాదు బీచ్‌లలో నగ్నసుందరిమణులను ఫొటో లు తీయడం నిషేదం అయినప్పటికి మనవారు చాటుగా తీస్తుంటారు అయితే సందర్శకులు ఫోటో కోసం వారిని ప్రత్యేకంగా కోరితే ఒప్పుకుంటారు బీచ్‌లలో నే బీరు బ్రాంది అమ్మే బారు షాపులుంటాయి వాళ్ళు చాలా మంచివారు (దుష్టులు లేకపోలేదు) ఏదైనా ప్రశ్నిస్తే ఎంతో గౌరవంగా వినయవిధేయతలతో సమాదానమిస్తారు ఒక ఇటాలియన్ జంటను నగ్నంగా ఎందుకున్నారని ప్రశ్నించగా శీతలదేశపు వాసులమైనందు వల్ల మా దేహాలను సూర్యరశ్మితో వెచ్చపరుచుకుంటున్నామని సమాదానమిచ్చారు గోవాలో భోజన వసతి సౌకర్యాలు ఎలా వున్నాయని అడుగ్గా ఫరవాలేదు చాలా తక్కువ దరకు లభ్యమవుతున్నాయి అని చెప్పారు

బీచ్‌లలో కనబడే స్త్రీ పురుషులు 40 శాతం దిగంబరంగా 60 శాతం అర్ధనగ్నంగా ఇంతకు పూర్వం అగపడేవారట కాని ఇప్పుడు అంతగా లేదు చాలా వరకు దిగంబరత్వం తగ్గిపోయింది ఇలా ఎందుకు జరిగిందని ఒక స్థానికుడిని ప్రశ్నించగా భారతీయుల పోరు పడలేక జనం వింతగా వాళ్ళ చుట్టూ తిరుగుతూ వుంటే వారు కూడా దిగంబరత్వం తగ్గించారు అంటూ ఇంకా అనారోగ్య పరిస్థితులు ఎర్పడి కొన్ని దుస్సంఘటనలు కూడా జరిగాయి పైగా బీచ్‌లు ఎల్లప్పుడు జనంతో రద్దీగా వుంటున్నందు వల్ల దిగంబరత్వం తగ్గించుకున్నారు అన్నాడు

బీచ్‌లలో చాలా దూరం వెళ్ళి జనసంచారం లేని చోట నగ్నంగా సూర్యరశ్మితో స్నానం చేస్తూ ఆనందిస్తుంటారు విదేశీయ స్త్రీ పురుషులు కాని అక్కడకు కూడా పనికట్టుకొని వెతుక్కుంటూ వారి దగ్గరికి వెళ్ళి వారిని తిలకిస్తూ వేదిస్తూ సంతృప్తి చెందుతుంటారు కొంతమంది మన భారతీయ యువకులు అని మరో స్థానికుడు తన ఆవేదనను వ్యక్తం చేశాడు

గోవాలో బ్రాంది బీరు చాలా చౌకధరకు లభిస్తాయి (ఒక బీరు బాటిల్ అరు రూపాయలు మాత్రమే) గోవాను సందర్శించిన ప్రతి యాత్రికుడు బీచ్‌లను సందర్శించకుండా బీర్‌ను సేవించకుండా వెళ్ళరనడంలో అతిశయోక్తి లేదు

— వరికూటి వెంకటసుబ్బారెడ్డి

కలన్‌గూట్ బీచ్‌లో బీర్లు అమ్మే బారు షాపులు



కోల్వాబీచ్‌లో సూర్యరశ్మితో స్నానం చేస్తూ ఆనందిస్తున్న ఒక విదేశీయుడు



# గొడుగు



చినుకులు ప్రారంభమయ్యాయి –

అప్పుడే ఆగిన బస్సులోంచి నారాయణమూర్తి దిగాడు

జల్లు మొహంమీద పడింది

కాలనీలోకి వెళ్ళాలి  ఇక్కడ బస్సు ఆగుతుంది కానీ ప్రత్యేకంగా బస్సుస్టాండ్ లాంటిది లేదు

దగ్గర్లో షాపులు కూడా లేవు

పది నిముషాలు నడిస్తే ఇల్లు వస్తుంది

జేబులోంచి రుమాలు తీసి నెత్తిమీద వేసుకొని వేగంగా జాగ్రత్తగా నడక ప్రారంభించాడు –

ఖాన్ కూడా అదే బస్సులోంచి నారాయణమూర్తి వెనకే దిగాడు ఖాన్ యిల్లు కూడా కాలనీలోనే అతనూ రుమాలు తలమీద వేసుకొని నడుస్తున్నాడు–

జార్జి పక్క కాలనీ నుండి వస్తున్నాడు అతని చేతిలో పెద్ద గొడుగుంది జాగ్రత్తగా సర్దుకోగలిగితే ముగ్గురు ఆ గొడుగు క్రింద పడతారు

కాస్త అటు– ఇటులో ముగ్గురూ నడుస్తున్నారు

జార్జికేసి గొడుగు కేసి ఖాన్ నారాయణమూర్తి చూశారు జార్జి యిద్దరికేసి చూశినా చూడనట్టు పూర్కున్నాడు అతని ధోరణిలో అతను

ఎ.వి.వి.యస్.యస్.ప్రసాద్

నడుస్తున్నాడు.

ఖాన్‌ని పిలిస్తే నారాయణమూర్తికి కోపం!

నారాయణమూర్తిని పిలిస్తే ఖాన్‌కి కోపం!

ఇద్దర్నీ పిలిస్తే –

ఖాన్‌కి, నారాయణమూర్తికి ఒకరంటే ఒకరికి పడదు.

మొన్నీ మధ్య కర్ఫ్యూముందు "మసీదు" మీద రాళ్ళు వేసిన వాళ్ళలో నారాయణమూర్తి వున్నాడని ఖాన్ అనుమానం.

హిందువుని చౌరస్తా దగ్గిర చంపడంలో ఖాన్ హస్తం వుందని నారాయణమూర్తికి విపరీతమైన నమ్మకం.

ఒక్క క్షణం పడదు –

ఒకరి కొకరు ఎదురైనప్పుడల్లా "మానవత్వం" భగ్గు మంటుంది.

నారాయణమూర్తి "ఇల్లు" పక్కనే ఖాన్ "ఘర్". "ఖాన్" ఘర్ పక్కనే జార్జి "హౌస్."

ఓ రోజు –

యిద్దరూ (నారాయణమూర్తి, ఖాన్) ఏదో విషయంలో మాటా మాటా వచ్చి కొట్టుకుంటుంటే, మధ్యలో వెళ్ళాడు జార్జి –

అంతే!

యిద్దరు జార్జిని, జార్జి వంశాన్ని, మతాన్ని యిష్టమొచ్చినట్టు తిట్టారు –

తన "మతాన్నే" అవమానించిన వాళ్ళకి,




## "గొడుగు"

గొడుగులో "చోటు" యివ్వడాన్కి అతని మనస్సు అంగీకరించ లేదు. వాళ్ళు వానలో తడవ వలసిందే!

నారాయణమూర్తికి జార్జిమీద చాలా కోపం వచ్చింది.

వానలో అవతల మనిషి తడుస్తున్నా "కల్చర్" లేదనుకున్నాడు.

ఖాన్ కూడా దాదాపు అదే అనుకున్నాడు.

ముగ్గురూ, మిగిలిన యిద్దర్నీ మనస్సులో తిట్టుకుంటూ కాలనీ చేరారు.

వానమాత్రం అందరి మీద సమానంగా కురిసింది.

వాన ఎడతెరిపి లేకుండా కురుస్తూనే వుంది.

స్కూళ్ళు నుండి పిల్లలు వచ్చే సమయం.

వెళ్ళి పిల్లల్ని తీసుకురావాలి –

జార్జికి మరో అర్జెంటు పని వుండడం వల్ల "జేమ్స్" (జార్జి కొడుకు)ని తీసుకు రావడాన్కి వెళ్ళదల్చుకోలేదు.

ఖాన్ కూడా వెళ్ళలేదు. ఎందుకంటే ప్రొద్దున్నే వెళ్ళేటప్పుడు "అలీ"కి గొడుగు యిచ్చి పంపాడు–

నారాయణమూర్తి వెళ్దామనుకున్నా వున్న ఒక్క గొడుగు తీసుకొని భార్య ఎక్కడికో వెళ్ళింది.

వాన యింకా కురుస్తూనే వుంది –

అసలే బురద రోడ్లు ఎలా వస్తారో ఏంటో?

ముగ్గురిలోను ఇదే ప్రశ్న!

ఖాన్, నారాయణమూర్తి యిళ్ళ గుమ్మాల్లో నుంచున్నారు పిల్లల కోసం ఎదురు చూస్తూ–

జార్జి బైటికి వస్తుంటే–

దూరంగా –

వాన చినుకుల చాటు నుండి స్పష్టంగా కన్పిస్తోంది ఆ దృశ్యం –

జేమ్స్, అలీ, నారాయణమూర్తి కొడుకు శివరాం ముగ్గురూ అలీ గొడుగులో మెల్లగా నడుచుకుంటూ వస్తున్నారు.

పదేళ్ళు కూడా నిండని ఆ కాన్వెంట్ పిల్లల మొహాల్లో స్వచ్ఛమైన మానవత్వం లాంటి నిర్మలత్వం!

వాన కురుస్తూనే వుంది....! □





ప్రసన్న ఆర్ట్స్

# కత్తుల కొండయ్య

నిర్మాత: **కెళ్ల రామస్వామి** కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: **యన్.బి.చక్రవర్తి**

Satya

మాటలు: సత్యానంద్ పాటలు: వేటూరి సంగీతం: చక్రవర్తి ఫోటోగ్రఫీ: కన్నప్ప ఎడిటింగ్: డి.వెంకటరత్నం

లక్ష్మీ ఫిలింస్

## అక్టోబర్ మొదటి వారంలో

## తులసీదళం"

గత పాతికేళ్ళుగా పాఠకులను విమర్శకులను విపరీతంగా కదిలించిన యండమూరి వీరేంద్రనాద్ నవల కన్నడ బాషలోకి అనువదించబడి కర్నాటక రాష్ట్రంలోనూ సంచలనాన్ని సృష్టించింది అదే పేరుతో కన్నడ చిత్రంగా రూపొందింది దాని తెలుగు

పరివర్తనాన్ని అక్టోబర్ మొదటి వారంలో మన ఆంధ్ర ప్రేక్షకులకు అందిస్తున్నాం, అన్నారు పశ్చిమ గోదావరి జిల్లాలో పంపిణీదారులుగా ప్రసిద్ధి పొందిన వాణి ఫిలిమ్స్ వారు శరత్‌బాబు ఆరతి నాయకా నాయికలు రాజశ్రీ రచన అన్నయ్య– మల్లిక్ ఛాయ ఉపేంద్రకుమార్– శ్రీనివాసమూర్తి సంగీతంతో వి జగన్నాధరావు దర్శకత్వం నెఱపారు ఎం వి రావు సమర్పణలో బి సత్యనారాయణ ఎ వి సూర్యనారాయణ నిర్మాతలు

## శృంగార నృత్యాల దృశ్యకావ్యం

## 'గరం మసాలా"

వినోదాత్మకమైన సరస శృంగార నాట్యభరిత చిత్రం ముఖ్యంగా స్మిత, అనూరాధ, జయమాలిని, జ్యోతిలక్ష్మి నృత్యాలు విశేషాకర్షణ రెండు గంటల పాటు సాగే ఈ నవరస శృంగార గీతమాలికల శతదినోత్సవాలు, రజతోత్సవాలు ఏడాదిపాటు ప్రేక్షకులను అలరించిన చిత్ర నృత్యాల తన్మయత్వం కలిగిస్తాయి సమాజంలోని నిజమైన పాత్రలకు ప్రాణ ప్రతిష్ఠ చేసిన నూతన్ ప్రసాద్ రాళ్ళపల్లి, పొట్టి ప్రసాద్, చిట్టిబాబు శ్యాంబాబు శ్రీరాజ్ చిడతల అప్పారావు పొట్టి వీరయ్య– వీళ్ళంతా టాకీ విభాగానికి ముఖ్యపాత్రదారులు, అన్నారు చక్కని వక్త, రచయిత, ప్రచారకర్త అయిన వీరమాచనేని ప్రమోద్ కుమార్ ఈయన తాతాజీ కలిసి నిర్మించిన హరిహర ఆర్ట్ మూవీస్ గరం మసాలా చిత్రానికి మధురాధర్ రచన కె సత్యం కూర్పు, వి శ్రీనివాసరాయ్ చౌదరి నిర్వహణ బాధ్యతలు వహించారు గోపాల్ నందూరి దర్శకుడు

"శ్రీవారు"లో శోభన్‌బాబు, విజయశాంతి



## సినిమా

—జి వి జి

## త్వరలో విడుదలయ్యే

### పద్మజా పిక్చర్స్ "భలే మిత్రులు"

"విజయవాడలో జరిగిన ఒక యధార్థ సంఘటన ఆధారంగా నవరసాల మేలు కలయికతో తయారైన ఇతివృత్తం. ఆగస్టు 20 నుంచి సెప్టెంబర్ 20 వరకు జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయింది." అన్నారు ఎ. హెచ్. నరసింహారావు. ఈయన పద్మజా పిక్చర్స్ పతాకంలో నిర్మించే "భలే మిత్రులు" చిత్రం కోసం వాహిని స్టూడియో 4వ ఫ్లోర్‌లో లక్ష రూపాయల వ్యయంతో వేయించిన టూ-ఇన్-వన్ "రేడియో కమ్ టేప్ రికార్డర్" సెట్ చిత్ర పరిశ్రమలో గొప్ప సంచలనాన్ని కలిగించింది. శిల్ప దర్శకుడు ముదరపల్లి నాగేశ్వరరావు ప్రతిభకు తార్కాణమైన ఈ సెట్‌లో ప్రముఖ హాస్యనటుడు నాగేష్ తనయుడు ఆనంద్‌బాబు, కొందరు సుందరాంగనలతో చేసిన నృత్యం ఈ చిత్రంలో హైలైట్. డిస్కో డాన్స్ కంటే అతి నవీనమైన బ్రేక్ డాన్స్‌లో ఆనంద్‌బాబు ప్రావీణ్యత పొందాడు. ఇతను, హీరో భానుచందర్ "భలే మిత్రులు" రాజేష్, భానుప్రియ, రాళ్ళపల్లి, వేలు, రమ్య, చలపతిరావు ప్రభృతులు తక్కిన పాత్రలు ధరించారు. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, శంకర్- గణేష్ సంగీతం, గౌతంరాజు కూర్పు, డి. ప్రసాద్‌బాబు ఛాయ, సాయి సహకార దర్శకత్వం వహించిన ఈ చిత్రం విజయదశమి కానుక. దర్శకత్వం: ఎ. మోహన్ గాంధి.

## తుది మెరుగులు దిద్దుకుంటూన్న

### "ఖైదీ నాగమ్మ"

"ఇది సోషియో ఫాంటసీ. తన కుటుంబానికి జరిగిన అన్యాయానికి తెగించి, దుష్ట శిక్షణా ప్రయత్నంలో పోరాడి పోరాడి బలి అయ్యేముందు నాయిక తమ కులదైవం నాగదేవతను ప్రార్థిస్తుంది. ఆమె కాయంలోకి నాగదేవత ప్రవేశించి, నరరూప రాక్షసులైన లంకేశ్వర, భస్మాసుర, నరకాసుర, తారకాసుర, మహిషాసురల మీద ప్రతీకారం తీర్చుకుంటుంది." అన్నారు పి. చంద్రశేఖర రెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో పంపిణీదారుడుగా, ఎగ్జిబిటర్‌గా, నిర్మాతగా, చిత్ర పరిశ్రమ అనుబంధ సంస్థ అధినేతగా రెండు దశాబ్దాలుగా అనుభవం గడించిన సహదేవ వెంకటేశ్వరరావు నిర్మిస్తున్న విజయరాఘవేంద్ర మూవీస్ వారి "ఖైదీ నాగమ్మ" చిత్రంలో మాధవి నాయిక. శరత్‌బాబు (ద్విపాత్రలు), రాజశేఖర రెడ్డి, సిలోన్ మనోహర్, రవివర్మ, ప్రతాప్ రాజు, జయశ్రీ, నాదినేని లక్ష్మి, జయవిజయ, మహిజా, షహదా, సాక్షి రంగారావు తదితరులు నటవర్గం. పూసల సంభాషణలు, రాజ్-కోటి సంగీతం, ఎస్. ఎస్. రాజు ఛాయ, లీలాకృష్ణ శిల్పంతో ధ్రువకుమార్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్.

## గాంధీ జయంతి నాడు

### "మగాళ్ళకో నమస్కారం"

"పూజ్య బాపూజీ సూక్తి ఆధారంగా మహిళల పలు సమస్యలకు రూపకల్పన చేశాం. మహిళలు మెచ్చే విధంగా రూపొందించామని ఫస్ట్ కాపీ చూసిన వాళ్ళందరూ అన్నారు. అక్టోబర్ 2న విడుదల

"పట్టాభిషేకం"లో బాలకృష్ణ, శరత్‌బాబు, శారద



గణపతి పిక్చర్స్ ప్రొడక్షన్ నెం 1లో – కృష్ణంరాజు, జయసుధ

చేయడానికి సన్నాహాలు చేస్తున్నాం. అన్నారు డాక్టర్ రంగారావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో బొమ్మదేవి రాజు నిర్మించిన సాయిబాబా ఆర్ట్ పిక్చర్ వారి పై చిత్రంలో మురళీమోహన్, ప్రభ, శ్రీధర్ ఈశ్వరరావు, నూతన్ ప్రసాద్, పద్మనాభం, మాడా గోకిన రామారావు, విజయలలిత నటించారు. ఆంధ్ర సాంబమూర్తి కథ, మాటలు రాశారు. లక్ష్మీకిరణ్ సంగీత దర్శకుడు. జి. కె. రాము ఛాయాగ్రాహకుడు. రవి సంకలన కర్త.

## కృష్ణ దర్శకత్వంలో "సింహాసనం"

## రెండవ షెడ్యూల్ ముగింపు

"ఎక్కడా కన్‌ఫ్యూషన్, టెన్షన్ లేకుండా చకచకా పని సాగిపోతోంది. కృష్ణగారు ఇంత కాలంగా తనకున్న అనుభవాన్నంతా రంగరించి పోసి చాలా పర్‌ఫెక్ట్‌గా, తాను అనుకున్న దానికంటే చాలా సంతృప్తికరంగా వచ్చేలా డైరెక్ట్ చేస్తున్నారు," అన్నారు జయప్రద. తెలుగు, హిందీ భాషల్లో ఏకకాలంలో 70 ఎం. ఎం. స్టీరియోఫోనిక్ సౌండ్ సిస్టమ్‌లో తయారవుతూన్న "సింహాసనం" చిత్రం రెండవ షెడ్యూల్లో పాల్గొని ఈమె సెప్టెంబర్ 8న మద్రాసుకు తిరిగి వచ్చారు. కళ్ళు మిరుమిట్లు

నిర్మాతగారా? నేను ఇవాళ షూటింగ్‌కి రాలేను... ఇవాళ మా కుక్క పుట్టినరోజు!



గొలిపే ఆరు లక్షల రూపాయల సెట్‌లో కృష్ణ, అనూరాధ, జయమాలిని, జయశ్రీ టి. పాల్గొన్న ఓ పాట నేత్రపర్వంగా చిత్రీకరింప బడింది. బొంబాయి స్టంట్ మాస్టర్ వీరూదేవ్‌గన్ ఆధ్వర్యంలో కృష్ణ, హిందీ నటుడు ప్రవీణ్ కుమార్ పాల్గొన్న ఒక ఫైట్ గగుర్పాటు కలిగించే విధంగా నవ్యపంథాలో తీశారు. పద్మాలయా స్టూడియోలో 40 లక్షల రూపాయల సెట్స్ కాకుండా మదుమలై, హొగెనెకల్ ప్రాంతాలలో కూడా భారీ సెట్లు నిర్మిస్తున్నారు. సెట్స్‌కూ, కాస్ట్యూమ్స్‌కూ కోటి రూపాయలకు పైగా వ్యయమవుతుందని అంచనా. ద్విపాత్రలు నిర్వహించే కృష్ణతో పాటు జయప్రద మహారాణిగా, రాధ రాజనర్తకిగా, మందాకిని విషకన్యగా నటిస్తున్నారు. వహీదా రెహమాన్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, బాలయ్య, గుమ్మడి, కాంతారావు, గిరిబాబు, సుదర్శన్, రాజ్‌వర్మ ఆదిగాగలవారు పాల్గొంటున్నారు. మహారథి సంభాషణలు, బప్పిలహరి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం, శీను నృత్యాలతో జి. హనుమంతరావు, జి. ఆదిశేషగిరిరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్స్. కథ, స్క్రీన్‌ప్లే, కూర్పు, నిర్మాణం, దర్శకత్వం: కృష్ణ.

# ఆనాడూ ఈనాడూ కొందరి చర్మసౌందర్యం ఒక్కటే!



Pears
The original glycerine soap

Pears
The original glycerine soap.

సరికొత్త సొగసైన రూపంలో పియర్స్—
అసలైన గ్లిసరిన్ సబ్బు

**పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా,
సుకుమారంగా ఉంచుతుంది.**

హిందుస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS PS 63 2720 TL

# సినిమా

## విడుదలకు సిద్ధమవుతూన్న

## కొండ పిడుగు

తరతరాలుగా దనమదాందుల దోపిడికి పీడనకు బలియైన అమాయకపు గిరిజనులలో చైతన్యం కలిగించి దోపిడీ వ్యవస్థను తన బుది బలంతోను బాహుబలంతోను కొండపిడుగై ఎదిరించి గిరిజన జాతికి విముక్తి కలిగించిన ఒక విప్లవవీరుని కథ మాటుంగంతా ఖమ్మంజిల్లా అడవుల్లో హైదరాబాద్ బాగ్యనగర్ స్టూడియోలలో జరిగింది అన్నారు గిడుతూరి ఇంటర్నేషనల్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రానికి స్క్రిప్ట్ సమకూర్చి నిర్మించిన గిడుతూరి సూర్యం రష్యాలో దర్శకత్వ శాఖలో శిక్షణ పొంది ఈయన బహుముఖ ప్రజ్ఞావంతుడు ఈయనతోపాటు ఆర్ తిరుమలై దర్శకత్వం వహించిన పై చిత్రంలో రఘు మధు ప్రభాకర్



సాగరమధనం లో బిందు

అశోక్, వరలక్ష్మి, స్వప్నప్రియ, దేవి ఓం ప్రకాష్ రంగారావు, పద్మజ, బెజవాడ చంద్రకళ, నార్ల విజయలక్ష్మి, వరంగల్ టైగర్ జోసఫ్ పహిల్వాన్ ప్రభృతులు నటించారు. జి. రేవతి కథకు కొమ్మనపల్లి గణపతిరావు సంభాషణలు రాశారు ఎ. ఎ. రాజ్ స్వరకల్పనలో సి. నారాయణరెడ్డి విజయరత్నం, వడ్డేపల్లి కృష్ణ గీతాలు రాశారు. పాండ్యన్ ఛాయ, బి. చలం శిల్పం, అంకిరెడ్డి కూర్పుతో జి. పృథ్వీరాజ్ ప్రొడక్షన్ కంట్రోలర్.

గొల్లపూడి మారుతీరావు రమాప్రభ రామరాజ్యం వచ్చింది లో

## డి. రామానాయుడు నిర్మించే

## "ఝూన్సి, పసిడి కిరణాలు"

"సగటు జనం మెప్పు పొందాలి. డి. సి. ఆర్. లు" నిండాలి, ఇదే డి. రామానాయుడి సూత్రం. అందుకే ఈయన విజయపరంపరలను చవి చూస్తున్నారు. "దిల్ వాలా" హిందీ చిత్రం తర్వాత ఈయన నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ "ఝూన్సి" చిత్రంలో శారద, శరత్‌బాబు, అర్జున్ ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. డిసెంబర్‌లో విడుదలయ్యే ఈ చిత్రం గోపాల్ అనే కొత్త దర్శకుడ్ని పరిచయం చేస్తుంది. ఇది సురేష్ ప్రొడక్షన్స్ పతాకంలో తయారవుతుంది. ఇదే బానర్‌లో కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఒక చిత్రం, ఎ. ఎన్. ఆర్. – సుహాసిని జంటతో వి.మధుసూదనరావు దర్శకత్వంలో "పసిడి కిరణాలు" సెట్స్‌కు వెళ్ళాయి సురేష్ మూవీస్ పతాకంలో చిరంజీవితో ఓ చిత్రం బాలకృష్ణ–విజయశాంతి జంటతో కె మురళీ మోహనరావు దర్శకత్వంలో మరో చిత్రం ప్రారంభమవుతాయి ఇటీవల డి. రామానాయుడు సారధ్యంలో సికింద్రాబాద్‌లో "సురేష్ ఎలిమ్ డిస్ట్రిబ్యూటర్స్ సంసకు అంకురార్పణ జరిగింది

## 3–డి చిత్రం
## "గుడ్ బై టార్జాన్ సుందరి"

ఇది పూర్తి జంగిల్ చిత్రం. 'చిన్నారి చేతన' టెక్నికల్ యూనిట్ ఈ చిత్రానికి పని చేస్తోంది. హాలీవుడ్ చిత్రాల స్థాయిలో రూపొందిస్తున్నాం. ఆరు నెలల పాటు వంద మందికి పైగా అభ్యర్థినులను పరీక్షించిన అనంతరం 5 అడుగుల 8 అంగుళాల పొడవున్న జమున అనే రూపసిని బొంబాయిలోని ఓ నృత్య కళాశాలలో చూసి బుక్ చేశాం. ఈమె టార్జాన్ సుందరి. జంగిల్ క్వీన్‌గా సిల్క్‌స్మిత నటిస్తోంది. వినోద్ అనే హీరోను కూడా పరిచయం చేస్తున్నాం. 30 ఏనుగులు, చిరుతపులులు, సింహం, కొండచిలువలు కూడా పాల్గొంటున్నాయి. 'వజ్రాయుధం'లో పేరు పొందిన బేబీ సీత, వై. జి. మహేంద్రతో పాటు చాలా మంది నటిస్తున్నారు. సెప్టెంబర్ 20కి ఫస్ట్ షెడ్యూల్ పూర్తి చేశాం. సెకెండ్ షెడ్యూల్ అక్టోబర్ 1 నుంచి నెలాఖరు వరకు మదుమలై అరణ్యంలో జరుగుతుంది," అన్నారు జగదీష్. ఈయన నిర్మించె వసుంధర ఎంటర్ ప్రైసెస్ వారి పై చిత్రానికి ప్రసన్నకుమార్ సంభాషణలు, వేటూరి గీతాలు, ఇళయరాజా సంగీతం, బాబు శిల్పం, టి. ఆర్. శేఖర్ కూర్పుతో నివాస్ ఛాయాగ్రహణంతో పాటు దర్శకత్వం నిర్వహిస్తున్నారు. సమర్పణ : వై. నాగేశ్వరరెడ్డి. □


పారిపోయిన ఖైదీలు లో సిల్క్‌స్మిత

## సీరియల్






డాక్టర్ ముదిగొండ శివప్రసాద్

(గత సంచిక తరువాయి)

భవభూతి ప్రవృత్తి రెండుగా చీలి ద్విధా ప్రవర్తిస్తున్నది

అటువైపు కల్లోలం – ఇటువైపు కల్హారం!

అటువైపు శరత్తు – ఇటువైపు సరిత్తు!

అటువైపు అనుమానం – ఇటువైపు సమాధానం!

చీకటి పడింది

దశాబ్దాల నాటి సుదీర్ఘమైన విస్తృత పరిధిగల వృక్షాలు– సమీపంలోని అతి సుకుమారమైన నీటి తామరలు–ఎక్కపక్కనే వున్నాయి

భవభూతి చాలా సేపు మానసికమైన ఏకాంతంలో వుండిపోయాడు అతని మనస్సులో పారిజాతమ్మ చెప్పిన ఆనందవల్లి కథ చలనచిత్రం వలె తిరిగింది సన్మానాల మధ్య పూల మాలల మధ్య విషాద రేఖతో తిరిగే ప్రతిభ–

బెంగుళూరుకు వచ్చిన సుధారాణి –

కాన్వెంటులో గిరిజ –

వీటి అన్నింటి మధ్యా ఏదో ఒక విడదీయరాని లంకె వున్నట్లు భవభూతికి అంతరాంతరాళల్లో హేలామాత్రంగా స్ఫురించింది లాల్‌బాగ్ చుక్కలు పొదిగిన నల్లటి చీకటి శాలువను కప్పుకుంది

తోట మొత్తం లైట్లు వెలిగాయి

భవభూతి లేచాడు

అతని మనసులో ఒక ప్రశ్న తీవ్రంగా వేధిస్తున్నది అది ఇప్పుడు ఘనీభవించి సాకారమై ఇప్పుడు తన కళ్ళ ముందు సాక్షాత్కరించింది

అది – కళాకారునికి లేదా కళాకారిణికి వైవాహిక జీవితం అవసరమా? – అనవసరమా? – అనేది

ఈ ప్రశ్నకు సమాధానం దొరికితే తన అన్వేషణ ముగిసినట్లే అవుతుంది

భవభూతి లాల్‌బాగ్ నుండి కెంపెగౌడనగర్ చేరాడు అప్పటికే డాన్స్ క్లాసు ముగిసింది

సుధారాణి తన కోసం ఎదురు చూస్తున్నది భవభూతి రాగానే ఆమెయే ఇద్దరికీ భోజనం వడ్డించింది

ఇద రికీ హైదరాబాదుకు టిక్కెట్లు రిజర్వేషను అయింది అన్నది సుధారాణి పూరిలు వడ్డి స్తూ

నేను వచ్చిన పని కూడా అయింది

ఇరువురూ భోజనం చేస్తూ ఏవో కబుర్లు చెప్పుకున్నారు ఆమె కేంద్రం నిర్వహణలోని కష్టసుఖాలను గూర్చి లాభనష్టాలను గూర్చి వివరిస్తున్నది

భవభూతి అంతా ఓపికతో వింటున్నాడు భోజనానంతరం భవభూతి ఆమెను గిరిజ గురించి అడగాలనుకున్నాడు అయితే సంభాషణ ఆ విషయం ప్రస్తావించడానికి ఎలా మొదలు పెట్టాలో తెలియలేదు

కళాకారుల జీవితం రోజా పూల బాట కాదు అదొక కష్టకంటకాకీర్ణ మార్గం ఆర్థికంగా లాభిస్తే మానసికంగా సుఖశాంతులు ఉండనివారు శరీరారోగ్యాన్ని కోల్పోయిన వారు దుఃఖితులు చివరి దశలో దీనులు వీరే కళాకారుల్లో ఎక్కువగా ఉంటారు అన్నది సుధారాణి

అంతే కాదు కళాకారులు ఒక రకంగా తారాజువ్వలాంటి వారు నిప్పులు కక్కుకుంటూ ఎగుర్తూ ప్రకాశవంతంగా గగన తలానికి ఎగిరి మరుక్షణంలోనే నేలకు దిగిపోతారు తారాపథంలోని ఆ కాసేపటి వెలుగు కోసమే వాళ్ళు జీవితమంతా తహతహలాడతారు దీనికే ఎన్నో విమర్శలు అసూయలు ద్వేషాలు పొందుతారు

కవిగారూ! నా కథ చెపితే నిజంగా మీరు కంట తడిపెడతారు మీకు వినే ఓపిక వుందా?

ఎంత మాట! తప్పకుండా వింటాను

అప్పుడు సుధారాణి తన జన్మ వృత్తాంతాన్ని చెప్పింది

నిజంగా అది కంటి తడి పెట్టించే కథే

జరిగినకథ–9 : ప్రతిభ హైదరాబాదులోని రవీంద్ర భారతిలో నృత్య ప్రదర్శన ఇచ్చినప్పుడు భవభూతి పరిచయం అయ్యాడు వాత్సాయన శర్మ ఆరంగేట్రం అండాళ్‌ను ప్రిన్సిపాలుగా ఒప్పించి నటనాలయంతో పాటు కవుల కాలేజీ ప్రారంభించాడు ఆ సంస్థ పేరు విపంచి భవభూతి తాను క్షీరసాగర మథనం అనే యక్షగానాన్ని రాసినట్లు అందులో మోహిని పాత్రను ప్రతిభని అభినయించమని కోరుతూ ప్రతిభకి ఉత్తరం రాయగా తాను హైదరాబాదు వస్తున్నట్లు అన్ని విషయాలు అప్పుడే మాట్లాడుకోవచ్చని ప్రతిభ సమాధానం రాసింది క్షీరసాగర మథనంలో మోహిని పాత్రను అభినయించడానికి ప్రతిభ అంగీకరించింది ద్రాక్షారామంలో ప్రదర్శన ఇచ్చేందుకు ప్రతిభ ఆమె బృందం బయలుదేరి వెళ్ళారు వారితో భవభూతి వెళ్ళాడు ప్రతిభ అద్భుతంగా ప్రదర్శన ఇచ్చింది భవభూతికి పారిజాతమ్మ ఆనందవల్లి కథ చెప్పడం ప్రారంభించింది ఆనందవల్లి తన చివరి దశలో కూతురి దగ్గర వివాహ వాంఛకి చోటువ్వనని ప్రమాణం చేయించుకున్నదని పారిజాతమ్మ ద్వారా భవభూతి తెలుసుకుంటాడు ప్రతిభ ఆనందవల్లి కూతురని వినికిడి బెంగుళూరు వెళుతున్న సుధారాణిని భవభూతి దొంగచాటుగా వెంబడించాడు బెంగుళూరులోని కళా కేంద్రంలో ఆమెను కలుసుకున్నాడు

సంగ్రహంగా ఆ కథా సారాంశం ఇలా వుంది.

కర్నూలు జిల్లాలోని నంద్యాలకు సమీపంలో చిన్నపల్లెలో మహదేవప్ప అనే కళాకారుడున్నాడు. అతడు ఎన్నో తరాలుగా తోలు బొమ్మలను ఆడించే కుటుంబంలో పుట్టాడు అది వారి కులవృత్తి. కేవలం తోలు బొమ్మలను ఆడించడమే కాదు స్వయంగా ఆ కుటుంబ సభ్యులే బొమ్మలను తయారుచేసుకునేవారు తోలును కోసి రంగులు వేసి వాటిని ప్రదర్శించటం అందుకు ప్రతిఫలంగా వచ్చిన ధనమో, ధాన్యమో స్వీకరించి సంసారాన్ని పోషించుకోవటం మహదేవప్ప వృత్తి. పేరుకు మహదేవప్పది నంద్యాల అయినప్పటికీ అతడు మొత్తం రాయలసీమ పర్యటిస్తూండేవాడు ఒక్కొక్కప్పుడు కోస్తా ప్రాంతానికి కూడా వెళ్ళేవాడు అతనికి ప్రతిదినమూ ఒక ఉత్సవమే ప్రతి రోజూ ఒక వేదికయే ఇలా చాలా సంవత్సరాల కాలం గడిచింది

మహదేవప్ప కూతురు రాణి ఆమె చిన్నప్పటి నుంచీ తండ్రి చేసే ఈ ప్రదర్శనలను చూస్తుండేది నంద్యాలకు సమీపంలో మహానంది అని పేరుగల పుణ్యక్షేత్రం వుంది అక్కడి స్వామి వారి పేరు మహానందీశ్వరుడు ఇక్కడ కొండనుండి ఒక పెద్ద జలపాతం నిరంతరం పడుతూ వుంటుంది భక్తులు దానికి ఒక నంది ఆకారపు ముఖాన్ని అమర్చారు చూచేవారికి నంది నోట్లో నుండి నీరు పడుతున్నట్లు అనిపిస్తుంది ఇదే మహానంది శ్రీశైలానికి చుట్టూ కొన్ని యోజనాల దూరం శక్తిపీఠం కింద లెక్క ఈ క్షేత్రానికి నాలుగు వైపులా నాలుగు ద్వారాలున్నాయి అందులో ఒకటి నంద్యాల వైపు ఉంది ఈ విధంగా ఇది అనాదిగా నవనందులతో ప్రసిద్ధమైన క్షేత్రం నంద్యాలకు మహానందికి ఈ విధంగా విడదీయరాని సంబంధం వుంది మహదేవప్పకూ తోలుబొమ్మలాటలకు ఉన్నట్లే! మహానందిలో కార్తీక మాసంలోను మాఘ బహుళ చతుర్దశినాడు, చైత్రశుద్ధ పాడ్యమినాడు ఇలా కొన్ని నిర్ణీతమైన తిథులలో బ్రహ్మాండమైన ఉత్సవాలు నిర్వహిస్తుంటారు ఆ సందర్భంలో స్వామివారిని దర్శనం చేసుకుని, నంది స్వచ్ఛమైన జలంలో స్నానమాడి తరించడానికి భక్తులు ఆంధ్రదేశం నలుమూలల నుండి వస్తుంటారు అప్పుడు జరిగే ఉత్సవాలలో మహదేవప్ప తప్పకుండా తన తోలుబొమ్మలాటను ప్రదర్శిస్తూ వుంటాడు ఆయన వద్ద రామాయణం, భారతం, భాగవతం, శివలీలలు వంటి ఇతివృత్తాలకు సంబంధించిన తోలుబొమ్మల సెట్లు చాలా వుండేవి

ఇలా కొంతకాలం గడిచేసరికల్లా మూకీ సినిమాల యుగం వచ్చింది. మహదేవప్ప విస్తృతమైన పర్యటనలకు అంతరాయం కలిగింది. అయినా ఏమాత్రం అధైర్యపడకుండా మహదేవప్ప తన కళాసేవను కొనసాగిస్తూనే వచ్చాడు.

రాణి తండ్రి వెంట ఒక్కొక్కప్పుడు సుదీర్ఘ పర్యటనలకు కూడా వెళ్ళేది. శ్రీశైలం, మహానంది, కర్నూలు, మహబూబ్‌నగర్ వంటి ప్రదేశాల్లో ఇచ్చే ప్రదర్శనలన్నీ ఆమెకు సుపరిచితాలే మహానంది క్షేత్రం. అక్కడి మామిడి తోపులు, దట్టమైన అడవులు, కదళీ వనాలు, స్వచ్ఛమైన నందితీర్థం, సరిగ్గా నందీశ్వరుని పాదంలా కనపడే శివలింగం - ఇవన్నీ ఆమె జీవితంలో భాగాలే. వారు శివలీలలు ప్రదర్శించినప్పుడు భక్తులు వారిని ఎన్ని విధాలో మెచ్చుకునేవారు. మహదేవప్ప కేవలం సామాన్య జానపద కళాకారుడు కాదు సాక్షాత్తూ ప్రమథగణం నుంచి నటరాజ అంశతో భూమి మీదకు దిగివచ్చాడని భక్తులు వేనోళ్ళ ప్రశంసించేవారు. ప్రశంసలకు పొంగిపోకుండా దీన స్థితికి కృంగిపోకుండా మహదేవప్ప ఒక ఆరాధనగా సాగించుకుంటూ వెళ్ళిపోయేవాడు. ఆ తర్వాత కొంత కాలానికి మూకీల యుగం పోయి టాకీల యుగం వచ్చింది. బస్తీలలో సినిమాహాళ్ళు వెలిశాయి. పల్లెటూళ్ళలో టూరింగు థియేటర్లు వచ్చాయి ఒక వర్షాకాలంలో తప్ప మిగిలిన అన్ని ఋతువుల్లోనూ ఈ సంచార చలనచిత్ర ప్రదర్శనశాలలు ప్రజలకు ఎనలేని వినోదాన్ని సమకూరుస్తూ వుండేవి. వీనితో మహదేవప్ప వంటి కళాకారుల వృత్తులకు బలమైన దెబ్బ తగిలింది చాలామంది 'తోలుబొమ్మలాట' కళాకారులు ఆ వృత్తిని విరమించుకున్నారు కాని మహదేవప్ప మాత్రం తన పని మానుకోలేదు. దినదినానికి క్షీణిస్తున్న తమ ఆర్థిక పరిస్థితిని చూచి మహదేవప్ప భార్య కంట తడిపెట్టుకున్నది.

"నలుగురితో పాటు నారాయణ అన్నట్లు ఇక మనం కూడా ఈ బొమ్మలాట ప్రదర్శనలు మానుకోవడం సమంజసం" అన్నదామె

అది విని మహదేవప్ప నవ్వి "పిచ్చిదానా! నా కొండిలో ప్రాణమున్నంత వరకు నేనీ జానపద కళను వదిలిపెట్టుకుంటానా? మీ అందరి దృష్టిలో ఇది ఒక భుక్తికోసం ఉపయోగపడే కళ కావచ్చు. కాని - నాకిది జీవన తరుణోపాయం ముక్తి మార్గానికి సోపానం! నా తాత తండ్రులిదే జీవనంతో తరించారు కొన్ని వేల సంవత్సరాల నుంచి తెలుగుదేశంలో వస్తున్న కళా సంప్రదాయం ఇది ఇప్పటికి వెయ్యేళ్ళ క్రితం శ్రీశైలం ప్రాంతంలో మన పూర్వీకులే మల్లికార్జున స్వామి సన్నిధానంలో తోలు బొమ్మలాడించి తరించారు దానినే పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రంలో ఇలా పేర్కొన్నాడు.

బారతాది కథల పెర మరుగుల సారంగ బొమ్మల నాడించువారు కదు



నద్భుతంబుగ కంబ సూత్రంబు

లడరంగ బొమ్మల నాడించువారు - అని ప్రశంసించాడు ఈ తోలుబొమ్మలాట క్రమ పరిణామమే యక్షగానంగా మారింది బొమ్మల మాదిరే మనుష్యులు ఆడటం మొదలెట్టారు ఇదే కేరళలోని 'కథాకళి' నృత్య సంప్రదాయం - ఆవిర్భావ దశ నాటకంలోని సూత్రధారి అనే మాట మన తోలుబొమ్మలాట నుంచే దృశ్య కావ్యాలలోకి వచ్చింది అంటే మన కళ ఎంత ప్రాచీనమైందో గ్రహించు అన్నాడు మహదేవప్ప

మహదేవప్ప సామాన్యమైన వీధి గాయకుడు, బిచ్చగాడు గాదు మంచి పండితుడు కళను పరమేశ్వరారాధనలో ఒక భాగంగా భావించిన కళాయోగి

డబ్బు రావడం రాకపోవడం కేవలం నిమిత్త మాత్రమే సంసార పోషణ మీద అతనికంత పట్టింపు లేదు అతనికి తన పూర్వీకులిచ్చిన ఆస్తి ఈ బొమ్మలాట ఇది వినోద కాలక్షేపం కాదు లేదు విజ్ఞానదాయకమనీ కాదు అక్షరాలా ఇది ఒక ఆరాధనా సేవ అదే వారి వంశంలో తరతరాలుగా వస్తున్న దృక్పథం

అందువల్ల ఆర్థికమైన పరిస్థితులను గూర్చి విచారించకుండా మహదేవప్ప తన బొమ్మలాటను ప్రదర్శిస్తూనే వచ్చాడు అయితే వెనుకటిలాగా కొత్త బొమ్మలను తయారు చేసుకోవడం కాని, వాటికి రంగులు కొట్టడం కాని కష్టమైపోయింది

ఆంగ్లేయ పరిపాలన ప్రారంభమయినప్పటి నుంచీ దేశీయమైన కళలు క్షీణించడం ప్రారంభించాయి ఎన్నో కులవృత్తులు మూలపడ్డాయి నేతలు, అల్లికాలు నశించిపోయాయి జానపద కళారీతులు ఇంకిపోయాయి యంత్రయుగం వచ్చిన తర్వాత క్రమంగా వాటి శోభ అదృశ్యమయింది ఒక్క నాటకం తప్ప తక్కిన అసంఖ్యాకమైన జానపద కళా ప్రక్రియలు దాదాపు రూపుమాసినట్టే లెక్క ఆ కళాకారులంతా పొట్ట చేతబట్టుకుని బస్తీల కెగబ్రాకి ఎక్కడో కూలీలుగాను, నౌకర్లుగాను ఉద్యోగాల్లో స్థిరపడ్డారు ఈ పరిణామం తన కుటుంబానికి రాకుండా చూడాలని మహదేవప్ప ప్రయత్నం కాని కాలపురుషుని ప్రచండ ఝంఝులో మహదేవప్ప తోలుబొమ్మలు గడ్డిపోచల్లాగా ఎగిరిపోయాయి

మహదేవప్ప కొడుకు మహారుద్రప్ప తండ్రితోపాటు తిరిగి ఇక తోలుబొమ్మలను ఆడించనని తిరగబడ్డాడు

'కళాసేవ పేర నేనింక ఆత్మ వంచన చేసుకోలేను కనీసం మానెడు వడ్లయినా కూడా ఇవ్వడానికి నేడు ప్రేక్షకులు సంసిద్ధంగా లేరు మహానందీశ్వరుని నోట్లోంచి వచ్చే నీరు తాగి గాలి పీల్చి నేనింక బతకలేను అన్నాడు మహారుద్రప్ప

మహదేవప్ప కొడుకును ఎన్నో విధాల అనునయించడానికి ప్రయత్నించాడు

మన శరీరం ఒక తోలుతిత్తి ఈ విషయమే తోలుబొమ్మలాట చెపుతున్నది బొమ్మల నాడించడం ద్వారా జీవనసాఫల్యం చేసుకోవడమే మన పూర్వులు మనకొసగి వెళ్ళిన కళ అని ఎన్నో విధాల కొడుకుకు నచ్చ చెప్పడానికి ప్రయత్నించాడు

కాని ఈ మాటలేవీ మహారుద్రప్పకు రుచించలేదు ఆదాయమూ లేక గౌరవమూ లేక సమాజంలో హీనంగా చూడబడుతూ బిచ్చగాళ్ళ వలె చూడబడుతూ ఎందుకీ జానపద కళను పోషించాలో మహారుద్రప్పకు అర్థం కాలేదు తన తోటి వాళ్ళు బస్తీకి వెళ్ళి యథాశక్తి ఏదో ఉద్యోగం సంపాదించుకుని హాయిగా తింటూ తిరుగుతూ కాలం వెళ్ళదీస్తుంటే తనకెందుకీ ముష్టి బ్రతుకు అనుకున్నాడు మహారుద్రప్ప అయితే తన తండ్రి మొండితనం మహారుద్రప్పకు తెలుసు అందుకని ఒక రాత్రికి రాత్రి చెప్పకుండా ఇంట్లోంచి పారిపోయాడు మహదేవప్ప పైకి ఏమీ బాధపడినట్లు కనిపించలేదు కాని లోలోపల బాగా కుమిలిపోయాడు కొడుకు దూరమైనందుకు గాదు జీవనది వలె ఇన్ని వేల సంవత్సరాలూ ప్రవహిస్తూనే వచ్చిన ఈ కళావాహిని తనతో ముగిసిపోతున్నందుకు ఆయన బాధపడ్డాడు

ఒకనాడు ప్రదర్శన ముగిసిన తర్వాత ఏకాంతంగా మహానందీశ్వరుని మంటపంలో కూచుని మహదేవప్ప కన్నీరు పెట్టుకున్నాడు

అయ్యో! అన్నది ప్రక్కనే వున్న రాణి ఎన్నడులేని తండ్రి కన్నీళ్ళను చూచి

తల్లీ! ప్రజలకే గాదు దేవునికి కూడా ఇక మన కళ అక్కర్లేదమ్మా! అన్నాడు మహదేవప్ప

ఈ మాటకు అర్థం ఏమిటో ఆమెకు వెంటనే స్ఫురించలేదు మహదేవప్ప ఒకనాడు ఉదయం స్నానం, పూజ ముగించుకున్నాడు పూజ అయిన తరువాత వెళ్ళి సీతారాముల పటం ముందు కూర్చున్నాడు ఇతనికి తరతరాలుగా చరిత్రకందని కాలము నుంచి ఈ పటమే అతనికి, అతని వంశము వారికి అన్నోదకాలను ప్రసాదిస్తున్నది మహదేవప్పకు బుద్ధారెడ్డి వ్రాసిన రంగనాద రామాయణము కంఠతావచ్చు ఇందులోని ద్విపదలే మహదేవప్ప తన ప్రదర్శనకు – నేపథ్య సాహిత్యముగా ఉపయోగిస్తుంటాడు వానితో పాటు భాస్కర–రామాయణంలోని పద్యాలు కూడా వాడుతూ ఉంటాడు ఐతే ఇవి తరతరాలుగా వారికి ఒకరి ముఖము నుంచి మరొకరి ముఖముకు






అందిరావడముతో ఉచ్చారణ స్పష్టంగా ఉన్నప్పటికీ రచనలోనే కొన్ని శబ్దదోషాలు వస్తుంటాయి పల్లెప్రజలకు అందుబాటులో ఉండాలనే ఉద్దేశ్యముతో మహదేవప్ప వాటిని సంస్కరించకుండా అలాగే గానము చేస్తుంటాడు అనాడు ఉదయం ఎందుకో మహదేవప్ప రంగనాథ రామాయణాన్ని ఉదయం నుంచి గానం చేయటం మొదలు పెట్టాడు

ఉదయం నుంచి ఉపవసించాడు రోజంతా అతడు భక్తితాదాత్మ్యములో ఉండిపోయాడు అనాడు మహదేవప్పను సమీపించటానికి రాణికి కాని ఇతరులకు కాని ధైర్యం చాలలేదు

ఆ రాత్రి మహదేవప్ప అంతా నిద్రపోయిన తరువాత మెల్లగా అటక మీదకి ఎక్కాడు ప్రదర్శనలు ఆగిపోయినప్పటి నుంచి తోలుబొమ్మలన్నీ అక్కడే మూలుగుతున్నాయి నిచ్చెన మీద నుంచి బొమ్మల పెట్టెను దింపాడు వాటిని నట్టింట్లో పరిచాడు రాణికి మెలకువ వచ్చింది ఐతే, మంచం మీద నుండి కదలకుండా అలాగే పండుకొని తండ్రి ఏమి చేయబోతున్నాడోనని ఆసక్తిగా చూస్తున్నది మహదేవప్ప ఒక తెరను తెచ్చి కట్టాడు లాంతరును వెలిగించి ఆ తెర వెనక పెట్టాడు పెట్టెలో నుంచి ఒకొక్క బొమ్మను తీసి దుమ్ము దులుపుతున్నాడు ఆ బొమ్మ చేతులను, తలను, కాళ్ళను-ఒకొక్క భాగాన్ని ఆత్మీయంగా తన రెండు చేతులతోనూ తాకి తనివితీరా చూచుకుంటున్నాడు

రామయ్యా! ఆశీర్వదించు! కోదండరామయ్యా భద్రాద్రిరామయ్యా పట్టాభిరామయ్యా దశరథరామయ్యా ఇవిగో తండ్రీ నమోవాకాలు -అందుకో! నీవు నన్ను ఇన్నాళ్ళూ కాపాడావు కాని -నేను నిన్ను కాపాడలేకపోయాను తండ్రీ! నీవు ఈ తోలుబొమ్మల మీద కూర్చున్న రంగుల మూర్తివి కాదు నావేనా సాకారదైవానివి ఈ జాతికి నీవు అక్కరలేదు అందుకని నేను నిన్ను పెట్టెలో పెట్టి అటక మీదకి ఎక్కించాను దుమ్ము పట్టింది నీకు కాదు ప్రభూ మాకే మా బ్రతుకులకే, మా జాతి జీవితానికే

ఇలా అని మహదేవప్ప ఆ బొమ్మను ముద్దు పెట్టుకున్నాడు అతని కన్నీటి బిందువులతో తోలుబొమ్మ తడిసిపోయింది ఇలాగే సీత లక్ష్మణుడు, విభీషణుడు హనుమంతుడు భరతుడు మొదలైన బొమ్మలను ఒక్కొక్కటి ఆప్యాయంగా తీసుకోవడం ముద్దు పెట్టుకోవడం, అశ్రువులతో వాటిని అభిషేకం చేయడం ఇలా అన్ని బొమ్మలను చేశాడు రావణాసురుడు, శూర్పణఖ, మండోదరి కేతిగాడు బంగారక్క వంటి బొమ్మలే కాదు గుఱ్ఱాలు ఏనుగులు జటాయుపక్షి, సంపాతి, వంటివి కూడా వస్తున్నవి వాటిని గట్టిగా కౌగిలించుకొని బావురుమని ఏడ్చాడు

రాణి హృదయం ద్రవించిపోయింది క్షితాజ రేఖల వద్ద భూమ్యాకాశాలు కలిసినట్లు కలిసి దూరమైనట్లు బల్లపరుపుగా ఉన్న భూమి గుండ్రంగా తన నిజస్వరూపాన్ని ప్రదర్శించి గిర గిర తిరుగుతూ తనపై నడుస్తున్న జీవ-జంతుజాలాన్ని క్రిందకి పడవేస్తున్నట్లు ఆమెకు అనుభూతి కలిగింది ఐతే రాణికి మంచం మీద నుండి లేచి తండ్రిని పలకరించేందుకు ధైర్యం చాలలేదు

మహదేవప్ప ఒకొక్క బొమ్మనీ తీసుకోసాగాడు

తకధిమి తకధిమి తోలుబొమ్మ

దీని తమాష చూడవె తోలుబొమ్మ

తోలుబొమ్మా మాయబొమ్మా అంటూ గాద్గదికంగా తోలుబొమ్మను ఆడిస్తూ-పాడుతున్నాడు

రాణికి గుండె చెరువైంది

తండ్రి ఇలా చేయటం ఎప్పుడూ చూడలేదు

రామ రామ, రఘురామ పరాత్పర రావణ సంహార రణధీరా పతంగవాహన అంటూ అర్ధరాత్రి వేళ మహదేవప్ప గానం చేస్తున్నాడు తరువాత మళ్ళీ నిచ్చెన మీద గుండా అటక పైకెక్కి ఇంకొక పెట్టెను దింపాడు అందులో శివలీలలు ఉన్నాయి ఒకొక్క బొమ్మనే తీస్తూ తెర మీద ఆడిస్తూ మహదేవప్ప సూత్రధారియై, వాగ్గేయకారుడై, తానే ప్రేక్షకుడై వినోదింపసాగాడు

అంతే!!

మహదేవప్ప కైలాసానికి చేరుకున్నాడు దేశంలో చాలా మార్పులు వచ్చాయి కర్నూలు, నంద్యాల వంటి ప్రాంతాలలో సినిమా థియేటర్లు వెలిసాయి స్వామివారి కళ్యాణోత్సవాలలో కూడా వెనుకటి వలె జానపద కళాకారులను పిలవడం మానేసి ప్రభుత్వం వారు ఉచితంగా ఏర్పాటు చేసే

# కరుణలేని మేఘం

–పులికంటి కృష్ణా రెడ్డి

కదలిరావె! కదలిరావె!
కరుణ లేని మేఘమా!
కన్నీళ్ళ పోవళ్ళ మాన్ప
కదలిరావె జలదమా!

ఝురులలో జవరాలు
జలకన్య నాట్యమ్ము
గిరులపై వనలక్ష్మి
వాహ్యాళు లేమాయె?
కదలిరావె! కదలిరావె!
కరుడుగట్టిన మేఘమా!!

సెలయేటి పాటులో
చెలరేగు గల గలలు
నీలాల ఫించాన
నిగనిగలు కరువాయె
కదలిరావె! కదలిరావె!
కరుడు గట్టిన మేఘమా!!

అందాల ఆ పడవ
అలల తేలెడి పడవ
సైకతీ స్థలి నెటుల
చిన్నవోయెను చూడు!
కదలిరావె! కదలిరావె!
కరుడు గట్టిన మేఘమా!!

కడలి ప్రియుగుండెలో
కరిగి పరవశించు కన్య
ఇసుక మేలి ముసుగు వేసి
విలపించెను విరహమ్మున
కదలిరావె! కదలిరావె!
కరుడు గట్టిన మేఘమా!

ప్రచార చలన చిత్ర కార్యక్రమాలు నిర్వహించటం మొదలుపెట్టారు దేవాలయాలన్నీ ప్రభుత్వ అధీనంలోకి వెళ్ళాయి పూర్వం ఆలయాల పాలన భక్తులు, ధర్మాత్ములు అయిన వ్యక్తుల చేతిలో వుండేది ఇప్పుడది లౌకిక రాజ్య నిర్మాణ దీక్షాదక్షుల చేతిలోకి వెళ్ళింది వారికి దేవుడూ మతమూ అక్కర్లేదు దేవుడు సొమ్ము మాత్రం కావాలి! ప్రాచీన కళా రీతుల పోషణ అక్కరలేదు ప్రణాళికల ఫ్యామిలీ ప్లానింగుల ప్రచారం కావాలి– దీనికి కూడా దేవుని డబ్బే! తండ్రి మరణంతో రాణి ఒక విధంగా దిక్కులేనిదయింది ఆమెలో తండ్రి రక్తం ప్రవహిస్తున్నది అందువల్ల జీవితాన్ని కళకే అంకితం చేయాలని నిశ్చయించుకుంది

తోలుబొమ్మలు అటక మీదికి ఎక్కాయి అక్కడ వాటిని క్రమంగా చెదలు తినివేస్తున్నాయి బస్తీకి పారిపోయిన మహారుద్రప్ప ఒక ఫ్యాక్టరీలో కూలీగా చేరాడు కొన్నాళ్ళ తర్వాత తల్లినీ చెల్లినీ తనతో పాటు తీసుకుపోయాడు

రాణి ఇప్పుడు మానసిక వేదనను అనుభవిస్తున్నది నీటిలోంచి బయటపడ్డ చేపలా అయిపోయింది జీవితానికి ఒక అర్ధమూ పరమార్ధమూ కనిపించటంలేదు తండ్రి జరిపే రసాత్మకమైన ఆ ప్రదర్శనలలో ఆమెకెంతో ఉత్సాహంగా జీవితమే ఒక పండగగా అనిపించేది ఇప్పుడు తానెందుకు బ్రతుకుతున్నదో తనకే తెలియని పరిస్థితి మహానందీశ్వరుని సన్నిధానంలో తండ్రి కంటి నుండి జారిన రెండు నీటిబిందువులు ఆమెలో రెండు అగ్ని పర్వతాలను రగిలించాయి

మా అన్న చేయలేని పనిని నేను చేస్తాను నా తండ్రి ఆత్మకు శాంతి చేకూరుస్తాను అనుకున్నది రాణి

అయితే తానిప్పుడు చెదలను దులిపి అటకపై నుండి తోలుబొమ్మలను కిందికి దింపలేదు

ఆ యుగానికి కాలం చెల్లిపోయింది

మారింది ప్రదర్శనాల రీతులే గాని ఆదర్శం కాదు కదా అనుకున్నది రాణి బెంగుళూరు వచ్చి గురువుగారిని ఆశ్రయించి కూచిపూడి భరతనాట్యం విద్యలు నేర్చుకుంది ప్రతిభ యొక్క అభిమానాన్ని సంపాదించింది ప్రతిభకు ఆమె ఇప్పుడు కుడి భుజం స్థూలంగా ఇదీ సుధారాణి భవభూతికి చెప్పిన కథ

మహదేవప్ప కూతురు రాణి నేనేనని మీకు వేరే వివరించనక్కర లేదనుకుంటాను అంది సుధారాణి

ప్రతి కళాకారుని జీవితమూ ఒక పెద్ద కన్నీటి సెలయేరు అందులో చాలామంది రసపిపాసువులు మునుగుతూ తేలుతూ వుంటారు ప్రతి కళాకారుని జీవితమూ ఒక పెద్ద దీపపు శెమ్మెలాంటిది అది ప్రపంచానికి వెలుగును ప్రసాదిస్తూ ఉంటుంది కాని దాని కింద మాత్రం చిమ్మ చీకటి అన్నాడు భవభూతి

ఆ మాటలు విని సుధారాణి చలించిపోయింది ఆమె కన్నులు కరుణార్ద్రములైనాయి

సుధారాణీ! అడుగవచ్చునో అడగకూడదో తెలియదు అయినా సాహసించి అడుగుతున్నాను కాన్వెంటు స్కూల్లోని గిరిజ ఎవరు?

సుధారాణి స్తంభించిపోయింది ఆమె చెక్కిళ్ళు తెల్లబారాయి

గిరిజ మీకెలా తెలుసు?

ఎలాగో అలా తెలుసు నీవామె వద్దకు వెళ్ళి భద్రంగా వస్తువులను ఇచ్చి రావడం నాకు తెలుసు ఇంతకూ మీ ఇరువురకూ వున్న అనుబంధం ఏమిటి?!

సుధారాణి కంఠం గాద్గధికమైంది ఆమె కన్నుల వెంట నీరు తిరిగింది ఒక్క క్షణం అయోమయంగా చూచింది

ఆమె ఎవరో చెప్తాను కాని మీరు సత్పురుషులనీ ధైర్యమైన కళాకారులని నా విశ్వాసం నేను చెప్పే ఈ రహస్యాన్ని శాశ్వతంగా మీరు మీ హృదయంలోనే దాచగలరా? అని సుధారాణి తన కుడిచేతిని ముందుకు చాపింది

అలాగే నని భవభూతి ఆమె చేతిలో చేయివేసి ప్రమాణం చేశాడు

గిరిజ నా కూతురు అని చెప్పింది కుమారి సుధారాణి!

(ఇంకా ఉంది)



# చిన్న నవలలు రాసే వారికి మనవి!

భారతిలో వేసేందుకు చిన్న నవలలు పంపవలసిందిగా రచయిత్రులనీ రచయితలనీ కోరుతున్నాము!

ఒక్కొక నవలా సుమారు 50 అర రావు కాగితాలు ఉండవచ్చు!

ఒక అర రావు పేజి ఇంచు మించు 20 x 30 సెంటీ మీటరులు ఉంటుంది!

సంపాదకుడు

భారతి
ఆంధ్రపత్రిక కార్యాలయం
గాంధీనగరం
విజయవాడ - 520 003




### ఎ ఎ కె గుంటూరు

★ డియర్ కె, రా గారూ మీ ప్రశ్నావళి చాలా బాగుంది కాని చిన్న అబ్జెక్షన్. మీ శీర్షికకు ప్రశ్నావళి అనేకన్నా ప్రేమావళి" అంటే బాగుంటుందేమో?

● బాగానే వుంటుంది కనకదుర్గా కాని ప్రేమావళిలో మామూలు వాటికి చోటుండదే ప్రశ్నావళి అయితే – ఏమన్నా ఫరవాలేదు ఏమంటావు?!

### ఎమ్ ఎస్ కె విజయవాడ

★ రామలక్ష్మిగారు కొంతమంది అమ్మాయిలు అంత అందంగా వుంటారేమిటి చెప్మా!

● సంతోషించండి– అలాంటి వారు చుట్టూ సీనరీని కాస్త భరించేలా చేయకల్గుతున్నందుకు

### ఎన్ ఎస్ బసకేరి

★ మీరు దేవుడిని ప్రేమిస్తారా? ఆరాధిస్తారా?

● ఆరాధనా, ప్రేమా కూడా నాకు మనిషి మీదే! దేవుని ఉనికిని – గుర్తించడం మాత్రమే–నేను చేసేది

### జి ఎమ్ ఆర్ కాశీబుగ్గ

★ రామలక్ష్మిగారూ ఆడవాళ్ళకు కోపం వస్తే?

● కొందరు అలుగుతారు, కొందరు ఏడుస్తారు నేను విరుచుకుపడుతూ వుంటాను

### ఆర్ ఆర్ ఎ పెదకాకాని

★ పెద్దవాళ్ళ నెదిరించి ప్రేమ వివాహం చేసుకుని తీరా తరవాత పెద్దల మాటలకు విలువ నిచ్చి ఆశ్రయం లేకుండా చేసే భర్తని ఏమనాలి?

● వదిలేయక ఏవో అనడం దేనికి?! పౌరుషం వున్నవాడు భరణం యిస్తాడు

### బి ఎస్ ఎ ఇచ్ఛాపురం

★ మిమ్మల్ని పొగుడుతూ రాసే ఉత్తరాలకే జవాబు లిస్తారు మిగిలినవివ్వరు ఎందుచేత– మీ బలహీనత అంటాను

● చచ్చాం! నే జవాబిచ్చేవన్నీ పొగడ్తలకే –అయితే దాని అర్థం వేరై వుండాలి!

### వెంకట్, ఉరవకొండ

★ ప్రాచీన భారతీయ మహిళా మండలి నుండి, ప్రస్తుత భారతీయ మహిళా లోకానికి సందేశాలేమైనా ఉన్నాయా?

● అప్పుడు దేవతని కాళ్ళు విరిచి కూర్చోపెట్టారు ఇప్పుడు మనిషివే కాదని కాల్చుకు తింటున్నారు సమాజం అప్పుడు – ఇప్పుడు కూడా పురుషాధిక్య సమాజంగానే వుంది అంచేత – చెప్పుకొందుకేముంది? అప్పుడు మనువు ఆడదాన్నెలా చూశాడో– యిప్పటి అధునిక మనువులూ– చూచాయిగా అదే కోరుతున్నారు

### ఆర్. కె ఎస్. హైదరాబాదు

★ నమ్మకం –మూఢనమ్మకంగా మారదని గ్యారంటీ ఏమిటి?

● లేదు కాని– మీ ఆశలకి అగ్నిపరీక్ష –నమ్మకం అనుకుంటే – అది మూఢనమ్మకం కాదేమో

### డి ఎ ఎన్ ఉంద్రాజవరం

★ మీ నుండి విజ్ఞానపరమైన సమాధానాలు కోరుతూ రాసేవారు చాలా తక్కువగా కనబడుతున్నారు మీరు ఓటు ఎవరికి వేశారు? మీరేం చదివారు? నిరాశకు కారణం ఏమిటి? నేనొక అమ్మాయిని ప్రేమించాను ఇటువంటివి

● విజ్ఞానం పుస్తకాలు చదివితే – దొరుకుతుంది కాని ఊహలు కలబోసుకోవటం –ఎలా? మీరెప్పుడేనా ఆలోచించారా? నాగ్రిగారు విజ్ఞానం కోసమే అయితే యిన్ని పత్రిక లెందుకు? యిన్ని పుస్తకాలెందుకు? వేదాలు చాలవా?! మనుషులు సరదాకి, క్యూరియాసిటీకి కొన్ని పనులు చేయడం –నేను తప్పనుకోను నేను మామూలు మనిషిని అందుకే మీరు సూచించిన లాంటి ప్రశ్నలు నాకిష్టమే

### ఎమ్ జి కె లేపాక్షి

★ దేవాలయంలో కొంతమంది దాతలు దేవుని విగ్రహం కంటె పెద్దదైన తమ ఫోటోలు వుంచుతారు వీరి ఉద్దేశ్యం?

● దేవుడుంటాడు –గాని తమ పేరుండదేమోనని భయం అణా దానానికి అర్ధరూపాయి పబ్లిసిటీ జాడ్యం!

### టి ఎ తణుకు

★ ప్రకృతిని చూస్తే మీకేమనిపిస్తుంది?

● మనం ఎంత అల్పమైన వాళ్ళమో తెలుస్తూ వుంటుంది

★ మానవ జీవితంలో సుఖం ఎక్కువా? కష్టం ఎక్కువా?

● కష్టం వచ్చినప్పుడు – అదీ. సుఖం వచ్చినప్పుడు అదీ ఎక్కువగా వున్నట్టు అనిపిస్తుంది

### పి కె బిహెచ్ ఆర్ పేకేరు

★ మీ సొది మాకెన్నాళ్ళు?

● మిమ్మల్నేం పీక మీద కూర్చుని చదవమంటున్నానా భీమేశ్వరా?!

### ఎ యు ఎమ్. ఆర్. పూరి

★ ఇప్పటి దేశ పరిస్థితుల గురించి మూడు ముక్కలు రాస్తారా?

● మూడే ముక్కల్లోనా– ఇదేం రామాయణమా – కట్టె కొట్టె తెచ్చె అని చెప్పడానికి! మనకు తగిన ప్రభుత్వం – మనం ఎన్నుకున్నాం. అనుభవించక తప్పదు– రాష్ట్రంలో నైనా, దేశంలో నైనా అధికార దాహం వున్నవాళ్ళ దగ్గిరే డబ్బుంటుంది వాళ్ళు టికెట్లు కొనకలరు – ఓట్లు కొనగలరు– పదవి కొనగలరు– మనస్సైనవారి చేసి –ఖర్చు చేసినదంతా రాబట్టనూ– కలరు అందుకే దేశం యిలా తయారైంది □



# అసలైన తెలుపు ఏమిటో...ప్రపంచానికి చూపండి

# డెట్






## ఉత్తమం... ఉత్తమం... తెలుపులో సర్వోత్తమం!

డెట్ మీకు అందిస్తుంది ఎంతో ఎక్కువ. దీని క్రొత్త రేపర్ ఎంతో అందమైనది. ఆకర్షణీయమైనది. తీసి చూడండి, లోపల మరో ఆశ్చర్యం — ఉల్లాసకరమైన మనమోహక పరిమళం. అంతేకాదు, డెట్‌లో నిండి వున్నది ఎంతో ఎక్కువ తెలుపు శక్తి. మరి రండి, డెట్ ప్రపంచంలో అడుగిడండి. స్వయంగా చూడండి, అందరికీ చూపండి. డెట్ తెలుపు...అసలైన తెలుపు!



# మానవత్వం

మిట్టదొడ్డి సాయిలీల

అపరాహ్న వేళ

అందులో వేసవి ఎండ మాడ్చేస్తూంది

వరండాలో ఈజీ చైర్‌లో కూర్చుని మూర్తిగారు ఆకాశం వైపు చూస్తున్నారు ఆయన ఆలోచనలు మాత్రం ఎటో ఉన్నాయి

అమ్మా కాస్త గంజి పోయండమ్మా అన్న కేక విని గేటువైపు చూచారాయన క్షణంపాటు తేరిపార చూచిన ఆయన కనుబొమలు ముడిపడ్డాయి

ఎప్పుడనగా నాలుగు మెతుకులు కతికిందో లోతుకు పోయిన పొట్ట తైల సంస్కారం లేని జుట్టు గుంటలు పడిన కళ్లలో దైన్యం, చిన్న గుడ్డ ముక్కని చీరలా చుట్టుకుని నామ మాత్రంగా ఉన్న జాకెట్టులో ఉన్న ఆ బిచ్చుగత్తె వరండాలోని మూర్తిగారి వైపు క్షణకాలం చూచి తల దించుకున్నది

ఆయన హృదయంలో లిప్తపాటు అలజడి రేగింది అంతలోనే సర్దుకున్నారు

అమ్మా శ్రీదేవి కాస్త అన్నం ఉంటే వేసి పంపించు అని కోడల్ని కేకేసి టీపాయి మీద పేపరు అందుకున్నారు గుండెల్లో రేగిన తుఫాను తాలూకు ఛాయలు మాత్రం మొహంలో కదలాడుతూనే ఉన్నాయి

కోడలు శ్రీదేవి ఆ ముష్టిదానికి కాస్త అన్నం పచ్చడి వేసి వెనుదిరిగింది

కాసిని మంచి నీళ్లియ్యమ్మా పుణ్యముంటుంది అన్నదా ముష్టిది

అలాగే నీళ్ళు పోస్తాను తిన్నాక పడుకోడానికి చాప తలగడా కూడా అడుగుతావా' అని విసుక్కుంటూ శ్రీదేవి లోపలి కెళ్లి ఒక చెంబులో నీళ్ళు తెస్తుంటే పాపం, ఎండకి దాహం అయినట్టుంది కొంచెం ఫ్రిజ్‌లో నీళ్ళు పోయకూడదమ్మా అన్న మామగారి మాటలకు ఆశ్చర్యంగా చూచింది శ్రీదేవి

ఆయన అలా అనడం కాస్త విసుగు కూడ కలిగించింది

కానీ శ్రీదేవి ఏ భావం పైకి వ్యక్తం చేయలేదు ఆయన చెప్పినట్టే ఫ్రిజ్‌లో నీళ్ళు తెచ్చి ముష్టిదాని సిల్వర్ గ్లాసులో దూరంగా నిలబడి పోసింది

చల్లటి నీళ్ల స్పర్శకి దాని కళ్ళు తళుక్కుమన్నాయి ఒక్క గుక్కలో గ్లాసుడు నీళ్ళు త్రాగేసి మళ్లీ గ్లాసునిండా పోయించుకుని వెళ్లి పోయింది

కోడలు యింట్లోకి వెళ్లాక మూర్తిగారు గేటు దగ్గర కొచ్చి రోడ్డు వైపు చూచారు కళ్ళు తుడుచుకుంటూ వెనక్కి వెనక్కి చూచుకుంటూ వెడుతున్న ఆ బిచ్చుగత్తె కనిపించి ఆయన మనసు కలచి వేసింది

మర్నాడు అదే సమయానికి గేటు ముందు ప్రత్యక్షమయిందా ముష్టిది కోడల్ని పిలచి కాస్త అన్నం పెట్టమన్నారు

అంతేకాదు కోడలు పట్టుకొచ్చిన అన్నం చూచి ఏంటమ్మా అన్నం ఇంక లేదా' ముష్టి వేసేటప్పుడు కనీసం ఒక్కపూట పొట్టన్నా నిండేట్టు వెయ్యాలి ఉంటే ఇంకొంచెం పెట్టు ముసలి ప్రాణం నకనకలాడుతున్నట్టుంది అన్నారు

ఆ ముష్టిదానిపై మామగారు చూపిస్తున్న శ్రద్ధ ఆమె కనిపెట్టక పోలేదు అయినా ముసలాళ్ల చాదస్తం ఏమోలే అనుకున్నది వయస్సు పైబడిన కొద్దీ దాన ధర్మాల మీద మనసు పోయింది లెమ్మనుకున్నది

ఎలాగయితేనేం ఆ ముష్టిదానికి రోజూ ఆ యింట కడుపునిండా తినడం ఫ్రిజ్ నీళ్ళు తాగడం యించుమించు అలవాటయి పోయింది

నాల్గు రోజులు గడిచేసరికి గేటు ప్రక్కనే ప్రహరీ గోడ దగ్గర బొగన్ విల్లా నీడన తినడం అప్పుడప్పుడు ఆ నీడనే చిన్న కునుకు తీయడం ముష్టిదాని దినచర్య అయ్యింది

ఆఫీసు నుంచి యింటికి వచ్చే సమయానికి గోడ ప్రక్కన ముష్టిదాన్ని చూచి మూర్తిగారి ఏకైక కుమారుడు మదుసూధనం ఒకటి రెండుసార్లు కసురుకున్నాడు

పోనీలేరా ముసిల్ది ఎండలకి ప్రాణం అలసి పోయుంటుంది మనకి నష్టం ఏంవుంది? అన్నారు ఓ రోజు మూర్తిగారు కొడుకు ఆమెను కసురుకుంటుంటే తండ్రి మాటకి ఎదురు చెప్పని మధుసూధనం మరి మాట్లాడకుండ లోపలకి వెళ్లిపోయాడు

ఏమిటో నండీ ఈయనకి ఆ ముష్టిదాన్ని చూస్తే తగని జాలి ఒక్క మాట దాన్ని అననివ్వరు మొన్న రెండు పాత చీరలు యిమ్మంటే యిచ్చాను చూడబోతే అది మన వరండాలో మకాం వేసినా కాదనేట్టు లేరు ఏవిటో చాదస్తం శ్రీదేవి భర్త చెవిలో గుసగుస లాడింది

సరేలే' ఇప్పుడే కాదు ఆయన మొదట్నుంచీ అంతే , ఈ విషయంలో నువ్వేం అనకు మా నాన్న బాధపడతారు కానీ ఓ కంట కనిపెట్టి వుండు ఎందుకేనా మంచిది ఈ తరహా ముష్టివాళ్లని నమ్మడానికి లేదు యేమారితే చేతికందింది పట్టుకు చక్కాపోతారు

అలాంటిది కాదనుకుంటా లెండి

అది సరేగాని ముష్టిదాని సంరక్షణలో పడి మా నాన్న మధ్యాహ్నం నిద్ర కూడ మానేశాడా' తండ్రి గేట్లోంచి లోపలికి రావడం చూచి అన్నాడు మధుసూధనం

ఏమో ఆయన్నే అడగండి వయస్సు వచ్చేకొద్దీ చాదస్తం పెరుగుతుందంటారు

అబ్బ సందు దొరికితే సామెతలు సాధించడం మొదలెడతావ్

* * * *

శీతాకాలం వచ్చింది

ఎప్పుడూ తెల్లవారు ఝామున అయిదు గంటల్లోపే వచ్చే పాలవాళ్ళు నిక్కి నీలిగి కాస్త వెలుగొస్తేగాని రావడం లేదు

ఆ రోజు మూర్తిగారి భార్య ఆబ్దీకం పాలవాడు వీధిలో ఎవరితోనో బిగ్గరగా మాట్లాడుతుంటే ఏమిటోనని వరండాలో కొచ్చింది శ్రీదేవి

ఏమిటా గొడవ అడిగింది

మీరోమారి ఇలా రండమ్మా మీ గేటు పక్కన ముష్టిముండ పడుకుని కదలడం లేదు చచ్చిందేమో అన్నాడు పాలవాడు

శ్రీదేవికి ఒక్కసారి వళ్ళు జలదరించింది వీధిలోకి తొంగిచూచి వెళ్లి భర్తను లేపి తీసి కొచ్చింది. ఇంతలో మూర్తిగారు నిద్ర లేచారు

ఏమిటమ్మా శ్రీదేవి హడావుడి అడిగారాయన

అదే మామయ్యా' రోజూ మధ్యాహ్నం మనింటి కొచ్చే ముష్టిది అది మన గేటు పక్కన చచ్చిపడి వుంది నిన్న వేసిన అన్నం కూడ తిన్నట్టు లేదు కోడలు తన ధోరణిలో తాను చెప్పుకు పోతోంది కాని అప్పటికే మూర్తిగారు గేట్లో కెళ్లిపోయారు

ఆ సరికే ఆ శవం చుట్టూ పది పదిహేను మంది పోగయ్యారు

మూర్తిగారు ఆ శవాన్ని కొద్దిసేపు కన్నార్పకుండ చూచారు మున్సిపాల్టీ వాళ్లకి ఫోన్ చేయండి ఎత్తి పారేస్తారు అన్నారెవరో అలా అన్న వ్యక్తి కేసి తీక్షణంగా క్షణం చూచి మూర్తిగారు మౌనంగా లోపల కొచ్చేశారు

ఓరేయ్ మధూ ఒక్కసారిలారా అని కొడుకుని పిల్చి తన గదిలో కెళ్లారు

మావయ్యా కాఫీ అంటున్న కోడలికి వద్దన్నట్టు సౌజ్ఞ చేసి కొడుకుని మాత్రం రమ్మన్నట్టు తలాడించి వెళ్లారు

భర్తకి కాఫీ యివ్వబోయిన శ్రీదేవి మేడ మెట్లెక్కుతున్న తండ్రీ కొడుకుల వంక వింతగా చూస్తుండి పోయింది

గదిలో కెళుతూనే తలుపులు మూసారు మూర్తిగారు

మదూ

అయోమయంగా తండ్రి ముఖంలోకి చూచాడు మదుసూధనం

నీకిప్పుడో షాకింగ్ న్యూస్ చెబుతాను నిజంలో నీకీ విషయం ఎప్పుడో చెప్పాల్సింది కాని విని తట్టుకోగలవో లేవో నని తాత్సారం చేశాను ఇప్పుడు చెప్పాల్సిన పరిస్థితి వచ్చింది తప్పదు నీకు తండ్రిగా ఓ స్త్రీకి భర్తగా నా దర్మం నెరవేర్చాలను కుంటున్నాను

మధుసూధనం మెదడులో నరాలన్ని బిగుసుకు పోయాయి తండ్రి యింత రహస్యంగా చెప్పే ఆ షాకింగ్ న్యూస్ ఏమిటో అన్న ఆతృత వల్ల అతని నిలువెల్లా కంపించింది

మధూ వాకిట్లో చచ్చి పడివున్న ముష్టిది నీ కన్న తల్లి

నాన్నా దాదాపు పిచ్చి వాడిలా అరిచాడు మధుసూధనం

మీరంటున్నది ఏమిటి నాన్నా ఇదెలా సాధ్యం? నా తల్లే అయితే ఆ దిక్కులేని చావేమిటి?

నేను నెలలు బిడ్డగా ఉన్నప్పుడు చనిపోయిన అమ్మ తిరిగి ఎలా వచ్చింది? ఇదంతా నిజమా

సంఘంలో ఎంతో గౌరవంగా చూడ బడుతున్న ఒక రిటైర్డ్ ఆఫీసర్ భార్య అలా

హోదాతో జీవితం ముడి పెట్టి ఉండదురా! మనం ఎన్నుకున్న మార్గం మన జీవితాన్ని నిర్దేశిస్తుంది ప్లీజ్ నిగ్రహించుకో మదూ నేను చెపుతున్నవి అక్షరాలా నిజం !

అవి నేను నాగపూర్‌లో పని చేస్తున్న రోజులు నా రూము ప్రక్కపోర్షన్‌లో మన తెలుగు వారి కుటుంబం వుండేది అతనికి రైల్వేలో పని ఆయనకున్న నలుగురు ఆడ సంతానంలో పెద్దమ్మాయి కరుణ కుందనపు బొమ్మలా వుండేది మెట్రిక్ పాసయ్యింది ఆమె పట్ల నే నెందుకో ఆకర్షితుడనయ్యాను ఆమెను వివాహం చేసుకోవాలన్న నా అభిప్రాయానికి ఆమె తరఫు గాని నా తరపుగాని ఏ అభ్యంతరం లేక పోయింది కరుణంటే నా కిష్టమే గానీ ఆమెకి నేను యిష్టమో కాదో నాకు తెలియదు తెలుసుకునే ప్రయత్నమూ నేను చేయలేదు ఏమయితే నేం మా పెళ్ళి అతి నిరాడంబరంగా జరిగిపోయింది అందగాడు అని చెప్పుకునే అర్హతలేని నల్లగా ఉన్న నాకు కరుణలాంటి అందగత్తె భార్యగా దొరకడం అంతా నా అదృష్టం అన్నారు

సంవత్సరం ఎలాగో గడిచి పోయింది నువ్వు పుట్టావు కానీ నీకు నెలలు నిండే కొద్దీ కరుణకి నేనంటే అనాసక్తి పెరగడం గమనించాను కానీ యింటి పనీ వంటపనీ నీ పాలనా – వీటన్నిటిలో ఎర్పడిన చిరాకేమో ననుకున్నాను....

"అప్పుడు నీకు పది నెలలు. కరుణలో మార్పు కనిపించడం మొదలు పెట్టింది. హుషారుగా ఉండటం ప్రారంభించింది. నేనెంతో



# ఇవేమన పద్యాలు




సంతోషపడ్డాను

ఆ రోజు ఆ రోజు జీతం అందుకున్న రోజు ఉత్సాహంగా ఆమెకి తెల్లటి వాయిల్ చీర , నీకు షర్టు వగైరా తీసుకుని ఇంటి కొచ్చాను వాకిలి

తలుపు ఓరగా వేసి ఉంది లోపల కొచ్చాను ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది ఉయ్యాల్లో నీవు నిద్రపోతున్నావు కరుణ కోసం యిల్లంతా వెదికాను ఎక్కడా లేదు పొరుగు వాళ్ల నడిగాను రాలేదన్నారు ఇంతలో నీవు లేచి ఏడుపు ప్రారంభించావు నిన్నెత్తుకోగానే – నీ జేబులో మూర్తిగారు క్షణం ఆపి తన పెట్లో అడుగు నుంచి

## మానవత్వం

ఓ ఉత్తరం కొడుక్కి చూపిస్తూ ఇది కనిపించింది అన్నారు

కరుణ వ్రాసిన ఉత్తరం

మూర్తి గారికి నేను అతనితో వెళ్ళిపోతున్నాను బాబుని మీకే విడిచాను బహుశః మీరు వచ్చే వరకు వాడు నిద్ర లేవడు నేను చేసిన ఈ పనికి క్షమించరని నాకు తెలుసు నా మనస్సుని మీతో సరిపెట్టుకో లేక అందగాడైన కార్మికతో

వెళ్ళిపోతున్నాను

– కరుణ

నాకు ప్రపంచమె శూన్యమయ్యింది కరుణ తల్లిదండ్రులు వచ్చి కూతురు చేసిన అప్రాచ్యపు పనికి క్షమించమన్నారు ఇందులో వాళ్ళు చేసిన తప్పేమి లేదు క్షమించడానికి

నేనా ఊరు వదిలి ఇక్కడికి బదిలీ చేయించుకుని వచ్చేశాను ఇక్కడి వారందరికి నా బార్య చనిపోయిందనే చెప్పాను కరుణ ఫోటో పెట్టి పూలమాల వేశాను అందరూ నమ్మారు ఆమె వెళ్ళి పోయిన రోజే ఆమె చచ్చిన రోజు

నాన్నా ఇన్నాళ్ళూ ఈ రంపపు కోతని ఎలా మీ గుండెల్లో దాచుకున్నారు అంతటి నీచురాలు నా తల్లంటే నాకే తల బద్దలు కొట్టుకుని చావాలనిపిస్తోంది ఇప్పుడెందుకు చెప్పారు నాన్నా ఇది?

మధూ ఇప్పుడామె తల కొరివి నీవు పెట్టాలి కనుక

ఇంపాసిబుల్ నేనా పని చేయలేను అంతటి పాపాత్మురాల్ని మున్సిపాలిటీ వాళ్ళే ఈడ్చి పారేయాలి– మధులో ఆవేశం "ఆమె చేసిన పాపానికి సరిపడా శిక్ష యిప్పటికే ఆమె అనుబవించింది మనం యిక్కడ వున్నామని తెలిసే ఆమె వచ్చినట్లుంది క్షమాభిక్ష కోరేదేమో ఆ విదంగా ఆమెను ముష్టిదానిలా చూస్తుంటే నరకయాతన అనుబవించాను కాని ఈ సంఘానికి కట్టుబడ్డాను"

మీ రెన్నయినా చెప్పండి నేనా పని చేయలేను

ఏం మధూ కూతుర్ని క్షమించ గల్గిన వాడివి కన్న తల్లిని క్షమించలేవా ?

నాన్నా!!

నాకు తెలియదనుకోకురా ఇంటర్మీడియెట్ మొదటి సంవత్సరం చదువుతున్న నీ కూతురి పెళ్ళికేం తొందరొచ్చిందని నిముషాలమీద పెళ్ళి కుదిర్చి ముహూర్తాలు పెట్టించావు మీ బార్యాభర్తలిద్దరూ దానికి కడుపు నెప్పని చెప్పి ఇరవై రోజులు క్రిందట నర్సింగ్ హోమ్‌లో చేర్చి చేసుకొచ్చిన ఘనకార్యం ఏమిటి నాకు తెలీదనుకోకు నిన్ను వేలెత్తి చూపడం తండ్రిగా నా ఉద్దేశం కాదు "

" నీ తల్లికి అందరికి తెలిసేలా దహన సంస్కారం చేయమని నేను కోరడం లేదు కేవలం ఒక అనాద ప్రేత సంస్కారం లానే సంఘానికి అలాగే చెప్పు

అలాగే నాన్నా మీ యిష్ట ప్రకారం కానివ్వండి

క్షణాల్లో అంత్యక్రియలకి ఏర్పాట్లు జరిగి పోయాయి మూర్తి గారి యింటి ముందు చావడం ఆ ముష్టి దాని పూర్వజన్మ సుకృతం అనుకున్నారంతా □

సీరియల్

# అంతరాలు-అంతర్యాలు

బోసుబాబు

(గత సంచిక తరువాయి)

ఇంతలో శ్యామం తల్లి వర్ధనమ్మగారు అబ్బాయి అనిపిలుస్తూ ఆపీసు గదిలో కొచ్చింది గదిలో ఓ అందాలరాశి కనబడగానే అలాగే దృష్టి నిలిపి చూచింది ఎవర్రా ఈ అతిలోక సుందరి అని ప్రశ్నిస్తున్నట్టుగా కొడుకు వైపు చూపులు మళ్ళించింది తల్లి మనసు తెలిసిన కొడుకు చెప్పాడిలా ఈమె మాధవరావు నాయుడిగారి అమ్మాయి పేరు శోభారాణి

వర్ధనమ్మగారి చూపులు శోభ వదనం మీదనుంచి చేతులమీదకు మళ్ళాయి స్లీవ్‌లెస్ బ్లవుజ్ ధరించినందువల్ల శోభ భుజాలు చేతులు పసిమివన్నెలో నిగనిగలాడుతూ మెరుస్తూండటం చూచి అందమైన అబ్బాయిలను వలలో వేసుకోడానికే కాబోలు ఈ సీమరాణి ఫ్యాషన్లు చేసింది అని వర్ధనమ్మగారు మనసులోనే అనుకుని లేని నవ్వు తెచ్చుకుని పైకిలా అంది చక్కగా వున్నావమ్మా సీమరాణిలా చదువుకున్నావా తల్లీ ?

శోభ లేచి నిలబడి వినయంగా నమస్కరించింది ఏదో చెప్పబోతుండగా శ్యామం అడ్డు తగిలి-

ఈమె పెద్ద చదువే చదివింది ఇంగ్లీషు దంచేస్తుంది మాట్లాడించమంటావా అన్నాడు చిరునవ్వుతో

అబ్బే అదేం లేదండీ మీ అబ్బాయిగారు చెప్పింది నిజంకాదండీ అని బిడియపడిపోతూ వర్ధనమ్మగారితో అంది వెంటనే శ్యామం వైపు తిరిగి ఉడికించడానికి నన్ను అల్లరి పెడతారా అన్నట్టు చిరు కోపాన్ని ప్రదర్శించింది కందిన చెక్కిళ్ళపై ఆ చిరుకోపం ప్రతిఫలించింది

శ్యామం తల్లికి కనబడనీయకుండా కుడి అరచేతిని నోటికి ప్రక్కగా చెంపకు అడ్డుగా ఆనించుకుని నోరు కొద్దిగా తెరచి సన్నని నాలుకను మెల్లగా ఆడించాడు ఈ వింత దృశ్యాన్ని చూచిన శోభ తత్తర పడింది ఆపుకోలేని నవ్వు పొంగుకొస్తుంటే, సిగ్గు తెరలు వచ్చి ఆ నవ్వును కప్పివేశాయి సిగ్గుదే పైచేయి కావడంతో ఆ సిగ్గే ఆమె వదనాన్ని సింగారింపజేసింది ఆ సిగ్గు తెరల మధ్యనుంచి త్రోసుకుని ముందుకొచ్చిన వాత్సల్య పూరితమైన దృక్కులు దూసుకుపోయి శ్యామం చూపులల్లో కలసి దోబూచులాడుకున్నాయి మళ్ళీ వర్ధనమ్మగారి వైపు తిరిగి

ఏంలేదండీ ఓ చిన్న కథ రాశాను తీసుకొచ్చి చూపించాను అని చెబుతూ 'నన్ను రక్షించవా శ్యామ్ అన్నట్టు శ్యామం వైపు చూచింది

అబద్ధాన్ని గోడకట్టినట్టు చెప్పడం ఆడవాళ్ళకే చెల్లు అని మనసులో అనుకున్నా శోభ పడిపోతున్న అవస్థ చూచి జాలిపడి 'అవునమ్మా ఈమెగారు వ్రాసి తెచ్చిన కథ గురించి చర్చిస్తున్నాము? అన్నాడు తల్లితో 'సుబ్బులుతో కాఫీలు పంపుతానుండండి అంటూ తిరిగి వెళ్ళిపోయింది వర్ధనమ్మ

అయినదా అమ్మాయిగారి పెళ్ళి అన్నట్టు చూశాడు శ్యామం శోభ కళ్ళల్లోకి 'పెళ్ళయ్యాకచూడండి మీకు ముక్కుతాడు వేస్తానో లేదో ' అన్నట్టు చూచింది శోభ కనురెప్పలు రెపరెపలాడుస్తూ

ఇంతలో పనిమనిషి సుబ్బులు కాఫీలున్న ట్రేను బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది

వెంటనే శోభ ట్రేలోని ఓ కప్పు తీసి శ్యామం ముందు వుంచింది మరో కప్పును ముట్టుకోలేదు

మరి మీరు ? అని ప్రశ్నార్థకంగా చూచాడు శోభ మూగనోము

శోభారాణిగారికి కోపం వచ్చింది కాబోలు ' ఒక్కసారి కళ్ళెత్తి చూచి మళ్ళీ దించుకుంది ఆ ముగ్ధ మోహనమూర్తి

పొగలు కక్కుతున్న కాఫీని కొద్దిగా సాసరులోకి ఒంపి కాఫీ కప్పును శోభ ముందుంచాడు శ్యామాన్ని మరోసారి చూచి ఆ కప్పును చేతిలోకి తీసుకుంది

శ్యామం ఎందుకోగాని అప్రయత్నంగానే ఓ మాట అన్నాడు నా స్వభావం మీ కింకా తెలియదనుకుంటాను ప్లీజ్ ఎక్స్‌క్యూజ్‌మి తాను ఊహించని మాటలు వినగానే శోభ గుండెలు ఝల్లుమన్నాయి ఈసారి తగిలిన షాక్ సామాన్యమైనది కాదు ఈ షాక్‌తో నరాలన్నీ జివ్వుమన్నాయి రక్తం వేడెక్కింది ఉద్వేగం పెల్లుబికింది పువ్వులాంటి మనసులో సిగ్గు మొగ్గలేసినా అంతలోనే అది ఆర్ద్రమై, దానిఛాయలు కళ్ళల్లో ప్రతిఫలించి అవి కూడా ఆర్ద్రమైనాయి ఇది చూచిన శ్యామానికి నిజంగానే మతిపోయింది అంతలోనే అతడి మనసు హెచ్చరించింది

శ్యామ్ నువు పొరపాటు చేస్తున్నావేమో ఒక్కసారి ఆలోచించుకో అని ఈ హెచ్చరికతో శ్యామం మేలుకున్నాడు ఏదో తప్పు చేసిన వాడిలా తబ్బిబ్బయ్యాడు

ప్రతి మనిషిలోను బలహీనతలు వుంటాయి ఇది సహజం అయితే ఆ మనిషిలోని విజ్ఞత విజ్ఞానం ఆ బలహీనతలను కొంతవరకు మరుగుపరుస్తాయి

శ్యామం కూడా మనిషే అయితే అతని అందం ఆకర్షణ తెలివితేటలు –

జరిగినకథ–6 సుబ్బారావు సుబ్బమ్మగారి కుమార్తెలు శాంత సరోజ వీరుకాక వారికి ఎదిగిన ఇద్దరు మగ సంతానం ఉన్నారు కానీవారు తల్లిదండ్రులకు ఏ విధమైనట్టి డబ్బు సహాయం చేయరు పెద్దకూతురు శాంతని పురిటికి విజయవాడ తీసుకువస్తారు సుబ్బారావుగారు ఆయనకి ప్రయాణంలో శ్యామసుందరరావు పరిచయం అవుతాడు శ్యామం సుబ్బారావు ఇంటికి ఒకసారి వచ్చివెళతాడు తన స్నేహితురాలు శోభతో కూడా సరోజ శ్యామసుందరరావు ఇంటికి వెళ్తుంది శాంత మగబిడ్డను ప్రసవించి చనిపోతుంది శాంత భర్త ముత్యాలరావు తన ముగ్గురి పిల్లల్ని సరోజని తన ఊరికి తీసుకు వెళతారు సరోజ అక్క చనిపోయిన సంగతి శ్యామంకు చెపుతుంది శోభ

అనే స్వాభావిక లక్షణాలు బలహీనతలుగా మారి అతనికి తెలియకుండానే అప్పుడప్పుడు ప్రకోపిస్తుంటాయి

నిగ్రహ శక్తిని కోల్పోవడమే బలహీనతకు చిహ్నం విజ్ఞతతో ఆలోచించగలడమే వివేకానికి చిహ్నం ఏది ఏమైనా తాను చేసింది పొరపాటేనని గ్రహించగలిగాడు శ్యామం కాని దాని ఫలితాలు ఎలా వుంటాయో ఊహించలేకపోయాడు

స్త్రీ మనసు చంచలమైనదంటారు కొందరు అది పాక్షిక సత్యమే కావచ్చు స్త్రీ శక్తి స్వరూపిణి అంటారు మరికొందరు అది కూడా పాక్షిక సత్యమేనేమో తరచి, తరచి పరిశీలిస్తే స్త్రీ హృదయం అమృతకలశమని, మనసు ఆరాధనా నిలయమని భావించవచ్చునేమో!

శోభ శ్యామ్‌ల మనసులు సుమారు గంటక్రితం ఎన్నో యోజనాల దూరంలో వున్నాయి ఇప్పుడు వారి మనసుల మధ్య దూరాన్ని కొలవడం కష్టమేనేమో!

శోభ ఆ గదిలో ఇంకా వుండాలనిపించడం లేదు శ్యామానికి

ఆ గదిలోనుంచి వెళ్లాలనిపించడంలేదు శోభకి వర్ధనమ్మగారి పని మనిషి సుబ్బులు వచ్చి అమ్మగారు పిలుస్తున్నారండి ' అని శ్యామంతో చెప్పింది శ్యామం లేచి నిలబడ్డాడు శోభ కూడా లేచింది రెండు చేతులు జోడించి నమస్కరించి, మాట పలుకు లేకుండానే చరచర వెళ్లిపోయింది శ్యామం మనసు అదోలా అయింది చివుక్కుమన్నదెందుకో

* * * * * *

శోభ తన గదిలో బెడ్‌మీద మేను వాల్చింది దిండులో తలదూర్చింది దిండు అంచులకు అరచేతులు బిగుసుకున్నాయి అరమోడ్పుతో ఆలోచనలు మనసును ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి ఆమె లేత పెదవులు ఆ మెత్తని దిండుపై దోగాడాయి ఆ మెత్తని చోటునే నిమిలిత నేత్రాలు హత్తుకున్నాయి అవి అర్పించిన అనురాగాశ్రుబిందువులను ఆ నేత్రాలే అద్దుకున్నాయి శోభ మనసు మనసులో లేదు మరెక్కడో వుంది ఆమె హృదయం శ్యామ్ బంగారు రూపంతో నిండిపోయింది అధరాల ప్రకంపనలోనుంచి వెలికి వచ్చిన శబ్దతరంగాలు

'తీయని బాధలో ఏమిటీ హాయి శ్యామ్ నీవు నావాడివేకదూ నా కోసమే కదూ నిన్ను ప్రేమిస్తున్నాను ఆరాధిస్తున్నాను ఒడిలోకి తీసుకోవా హృదయానికి హత్తుకోవా అలా పలవరిస్తూనే ఆ కుసుమ కోమలి నిద్రాదేవి ఒడిలోకి జారిపోయింది

కొంతసేపు గడిచింది

అమ్మగారూ అన్న పిలుపు వినబడింది మెలుకువ వచ్చింది లేచి కూర్చుంది ఎదురుగా మాణిక్యం ఆమె ఆ ఇంటి దాది 20 ఏళ్లనుంచి ఆ ఇంటినే కనిపెట్టుకుని వుంది

ఎప్పుడొచ్చారమ్మగారూ, నేను సూడనే లేదు '

ఇప్పుడే వచ్చాలే ఒంట్లో బాగోక నడుం వాల్చాను నాన్నగా రొచ్చారా? శోభ అడిగింది

'వొచ్చారండి మీకోసం దాక్టరుగారికి కబురెట్టమంటారా?

'నీ మొహంలే ఎవరూ అక్కరలేదుగాని వెళ్లి కాస్త కాఫీ వుంటే



# అంతరాలు – ఆంతర్యాలు

తీసుకురా సరేనమ్మ అంటూ వెళ్ళిపోయింది మాణిక్యం

శోబ తనలో తాను నవ్వుకుంది చివాల్నలేచి టేబిల్‌మీద వున్న బాల్‌పాయింట్ పెన్ తీసుకుంది అరచేతిమీద వ్రాసుకుంది అందంగా శోబాశ్యామ్ అని ఓ నిమిషం ఆగి ఆ చేతినే గట్టిగా ముద్దుపెట్టుకుంది మళ్ళీ మైమరచింది పరుపుమీద బోర్లా పడుకుని మెత్తని దిండును హృదయానికి హత్తుకుంది

కొద్ది నిముషాలు గడిచాయి మాణిక్యం కాఫీ తీసుకుని గదిలోకి ప్రవేశించింది ఆమె వెంట గ్రేస్ మేరి కూడా వచ్చింది

'హాయ్ శోబ ఒంటరిగా వున్నావా నీ మొహం ఇవ్వాళ అదోలా కనబడుతోందేమిటి గుండెకు ఏదైనా షాక్ తగిలిందా ? వరుసగా ఆపకుండా ప్రశ్నల వర్షం కురిపించింది

శోబ లేచి కూర్చుని టవల్‌తో ముఖాన్ని తుడుచుకుంది రేగిన ముంగురులను సరిచేసుకుంది

నీవన్నీ ప్రశ్నలేకాదు మరి వట్టి అనుమానాలే నాకేం నిక్షేపంలా వున్నాను డిఫెండ్ చేసుకుంది శోబ

అమ్మాయిగారి ఆర్డరుపై మాణిక్యం మరో కాఫీ తెచ్చి మేరికి అందించింది

'అవునే మరచాను ఇంతకీ ఆ శ్యామ సుందరుని గూర్చి చెప్పనేలేదే '

చెప్పడానికేముందని

అయింది అమ్మాయిగారు, లైన్‌లో పడిందన్నమాట చెప్పటం ఇష్టంలేకపోతే నేను అడగనులే దాచుకో ఈ రోజు కాకపోయినా, ఏదో ఒకనాడు బయటకు రాకుండా వుంటుందా అని అనుకోకుండా శోబ అరచేతి మీద ఏవో అక్షరాలు కనబడేసరికి చివాల్న లేచి శోబ అరచేతిని తెరచి చూచింది తన చేతిని వెనక్కు లాక్కోబోయింది శోభ ఈ లోగానే మేరి 'శోబా శ్యామ్' అన్న అక్షరాలు పైకి చదివి అయితే నా అనుమానం నిజమేనన్నమాట ' అంది

'నీవే చూచావుగా ఇక నేను చెప్పడం దేనికి శోబ నిర్భయంగా వుంది

శోబా! మగాళ్ల నైజం నీకంకా తెలియదు అందమైన అమ్మాయిలను ఆకర్షించేందుకు ప్రేమ నటిస్తారు ఇంతవరకూ ఏ అమ్మాయిని కన్నెత్తి కూడా చూడలేదని, ఎంతగానో నమ్మించడానికి ప్రయత్నిస్తారు అని ఇంకా ఉపన్యాసంసాగించబోయేసరికి, శోబ అడ్డు తగిలి –

'దొంగకు, లోకంలోని వాళ్లంతా దొంగలుగానే కనిపిస్తారనుకుంటాను 'అని వ్యాఖ్యానిస్తూ మేరి కళ్ళలోకి సూటిగా చూచింది

శోబా! ప్రేమనేది ఎక్కడా లేదే వున్నదల్లా సెక్సే ఆ సెక్సు వాంచ తీరగానే ప్రేమ అనేది మాయమైపోతుంది అనుబవంలేని నీవు అమాయకంగా ప్రవర్తించకు

ఔహో అయితే నీవు అనుబవంతో చెబుతున్నావన్నమాట !

మేరి మొహం జేవురించింది అహం దెబ్బతిన్నది శోబా నామాటలు నీకిప్పుడు అర్ధం కాకపోవచ్చు దెబ్బతింటేగాని తెలియదు అంగికరించడం తిరస్కరించడం తన హక్కు అనుకుంటాడు మగాడు అదే లోకంలో చెల్లుబాటవుతోంది మగాడికున్న హక్కు స్త్రీకి మాత్రం ఎందుకు వుండకూడదు పురుషులతో సమానంగా అన్ని విధాల స్వేచ్ఛ వుండాలన్నదే నా సిద్ధాంతం నాకు మగాళ్ళంతా ఒకేలా కనిపిస్తారు నీవు చెప్పే శ్యామంగారు మినహాయింపేమీకాదు అయినా బ్రహ్మాండమైన బంగాళాలో వుంటూ కాలు క్రింద పెట్టకుండా కార్లలో ప్రయాణం చేస్తూ దర్జాగా మహారాణిలా వుంటున్న నీవు మరో మహారాజును చూచి వరించి పెళ్లాడక ఎవరో ఓ అనామకుడిని చూచి అంటున్న మాటలను మధ్యలో ఆపడానికి ప్రయత్నిస్తూ శోబ పెద్దగా అరచినట్లు చెప్పింది –

మేరి, ఆపు నీ వుపన్యాసం నన్నేమైనా అను సహిస్తాను కాని నీ వెన్నడూ మొహం కూడా చూడని శ్యామంగారి గురించి అవాకులు చవాకులు పేలితే బావుండదు ఆయిన నీలాంటి ఊసర వెల్లికాదు కామాందుడు కాదు డబ్బుకోసం ఆశించే వ్యక్తికాదు ఒకేఒక్క చూపుతో ప్రేమకు నిర్వచనం చెప్పగల శక్తి ఆయనలో వుంది కామంతో నిండిన కళ్లకు మాత్రం ఆయన ఈ జన్మలో అర్ధంకారు ఎవరేమనుకున్నా నేను ఏమైపోయినా ఆయన కోసమే నా సర్వస్వాన్ని అర్పించదలచాను అంటూ శోభ కళ్ళు ఇంతింతలు చేసుకుని ఉద్వేగంతో చెప్పినప్పటికీ ఆ కళ్లనుండి కన్నీళ్ళు జలజల రాలకుండా వుండలేదు

మేరి నిట్టూర్చింది

'అయితే ఇక నువు మాతో స్నేహం విరమించినట్లేనా ?

ఆహా శోభ కోపంగా అంది

'అయితే, నీ ఖర్మ నీవే అనుబవించు వస్తా అంటూ చివాల్న లేచింది మేరి

'మళ్ళీ రావడందేనికి దయచేయ్ మరో నాలుగురోజులు నీతో స్నేహం చేస్తే అడ్డమైన అలవాట్లు అబ్బేవి






# భారతి

## చిన్న నవలల పోటీ !

భారతీయ సంస్కృతిలో ఒక భాగమైన తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉంటున్న భారతి సాహిత్య మాసపత్రికలో చిన్న నవలల పోటి పెడుతున్నామని తెలుపటానికి సంతోషిస్తున్నాము పోటీలో పాల్గొనే రచయిత్రులూ రచయితలూ క్రింది నిబంధనలని తప్పనిసరిగా పాటించవలసి ఉంటుంది

★ నవల యితివృత్తం తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి

★ నవల నిడివి అరవై అరటావులకి మించి ఉండరాదు కాగితానికి ఒక వైపునే యింక్‌పెన్‌తో కాని బాల్‌పెన్‌తో కాని రాయాలి నవల వ్రాత ప్రతిపైన చిన్న నవలల పోటీకి అని స్పష్టంగా రాయాలి

★ అనువాదాలు అనుసరణలు కాపీ నవలలు పంపరాదు గతంలో ప్రచురించబడిన ఆకాశవాణిలో ప్రసారం అయిన నవలలని పంపరాదు ఇతర పత్రికల పరిశీలనలో ఉన్నవాటిని అసలే పంపరాదు

★ రచయిత్రులూ రచయితలూ వ్రాత ప్రతులతో పాటు రచన తమ స్వంతమేనని పేర్కొంటూ హామీ పత్రం విడిగా జతపరచాలి హామీ పత్రంలేని రచనలు పరిశీలించబడవు రచయిత(త్రు)లు కలంపేరు వాడినా తమ అసలుపేరు పూర్తి చిరునామా స్పష్టంగా రాయాలి

★ పోటీలో గెలుపొందిన రచయిత(త్రు)లు తమ ఫోటో జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది

★ రచనలపై వచ్చే ఎటువంటి పేచీలకైనా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది

## బహుమతుల వివరాలు

సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన నవలలకి బహుమతులు లభిస్తాయి బహుమతుల నిర్ణయంలో సంపాదకునిదే తుది తీర్పు ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు

మొదటి బహుమతి రు 2500

రెండవ బహుమతి రు 2000

మూడవ బహుమతి రు 1500

పోటికి అందిన నవలలలో సాధారణ ప్రచురణకి యోగ్యమైనవి ఉంటే వాటిని ప్రచురణకి స్వీకరించి విలు వెంబడి ప్రచురించటం జరుగుతుంది ఈ విషయాన్ని ఆయా రచయిత(త్రు) లకి ఉత్తరాల ద్వారా తెలియ జేస్తాము ప్రచురణకి స్వీకరించబడని నవలలని తిప్పి పంపాలని కోరుకునేవారు తగిన తపాలా బిళ్లలు అంటించిన పూర్తి చిరునామా గల కవరును విడిగా జతపరచవలసి ఉంటుంది

## నవలలు చేరవలసిన ఆఖరుతేది : నవంబర్ 30

పోటికి పంపే చిన్న నవలలని సంపాదకుడు భారతి సాహిత్య మాసపత్రిక ఆంధ్రపత్రిక కార్యాలయం గాంధినగరం విజయవాడ-520003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పైభాగంలో భారతి-చిన్న నవలల పోటికి అని మరచిపోకుండా రాయాలి

★ రచయిత్రులూ, రచయితలూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము

–సంపాదకుడు

# అంతరాలు – అంతర్యాలు

'ఆ శ్యామమే నీకు మంచి లెసన్ చెబుతాడు లే అంటూ గదిలోంచి వెడుతూ అంది

షటప్ అండ్ గెటవుట్ అంది శోబ ఆవేశంతో

అప్పుడు సమయం సాయంత్రం అయిదున్నర గంటలు ఆ వేళ శ్యామం ఆఫీసు ముందు ఓ కారు ఆగింది డ్రయివింగ్ సీట్లో కూర్చున్న శోబ డోరు తెరచి బయట అడుగు పెట్టింది చర చర నడచి లో పలికి వెళ్ళింది

మీ కోసమే ఎదురు చూస్తున్నాను ఫోను చేసి రెండు నిముషాలు కాలేదు అప్పుడే వచ్చేశారే సరే కూర్చోండి విషయాలు మాట్లాడుకుందాము శ్యామం అన్నాడు

ఇక్కడ వద్దులెండి సీరియస్ విషయాలు మాట్లాడాలని వచ్చాను బ్యారేజి వైపు వెడదాం రండి కారు తెచ్చాను శోబ తొందర పెడుతున్నట్లు చెప్పింది

సీరియస్ విషయాలా అవి కారంగా వుంటాయా లేక చేదు చేదుగా వుంటాయా ? శ్యామం నవ్వుతూ అడిగాడు శోబ మనసును ఇంకా పసి గట్టలేదు ఆ సీరియస్ విషయాలేమిటో అతనికి అర్థం కాలేదు

ఎంత సీరియస్ అయినా తీపిగానే వుంటాయి లెండి రండి అని చిరు నవ్వు చూపింది'

ఇద్దరూ బయిటకు నడిచారు శ్యామం శోబ ప్రక్కన కూర్చున్నాడు కారు కదిలి దూసుకుపోయింది ప్రమాణంలో మాటలు లేవు బ్యారేజి చేరుకుంది కారు కృష్ణవేణి మాత విగ్రహం వున్న విశాలమైన ప్రదేశంలో కారు పార్క్ చేసి పుష్కర ఘాట్ వైపు నడక ప్రారంబించారు కృష్ణవేణమ్మ అలలు ఢీకొంటుంటే ఆపుతూ అడ్డుగా నిలబడిన పిట్టగోడ మీద ఇద్దరూ కూర్చున్నారు

ఓసారి తల పైకెత్తి చూచాడు శ్యామం ఆకాశం నిర్మలంగా వుంది వీస్తున్న గాలులు అవి మోసుకొస్తున్న అలలు లయబద్ధమైన శబ్దాలు చేస్తుంటే అవే సంగీత స్వరాలుగా వినబడుతున్నాయి

అబ్బ ఇక్కడి వాతావరణం ఎంత బావుందో చాలా కాలమైంది ఇక్కడకి వచ్చి ఇప్పుడీ అమ్మాయిగారు పట్టు పడితే వచ్చానన్నమాట ఇది శ్యామం స్వగతమైనా పైకే అన్నాడు సడన్‌గా అంది శోబ

శ్యామం గారు సౌందర్యం అంటే ఏమిటి? సడన్‌గానే షాక్ తిన్నాడు శ్యామం ఇది అతడు ఊహించని ప్రశ్న

తడబడినా తమాయించుకున్నాడు నవ్వు చూపుతూ-

ఇదేనా సీరియస్ విషయమన్నారు ?

నాకు సీరియస్ విషయమే

అయితే చెప్పక తప్పదంటారు మీకు నా మాటలు నచ్చకపోవచ్చునేమో '

'చెప్పడం మీ వంతు వినడం నా వంతు సరేనా !

అయితే వినండి సహజ సౌందర్యాన్నే నేను సౌందర్యమంటాను సౌందర్యమనేది సహజ సిద్ధమైనదేగాని కృతకమైందికాదు ప్లాస్టిక్ పూవుకు అసలు పూవుకు తేడా లేదూ అలాగే '

మన విషయంలో ?

మన అంటే మనిద్దరి విషయంలోనా లేక '

పోనీ మనిద్దరి విషయంలోనే అనుకోండి

నా సంగతేమో నేను చెప్పలేనుగాని నీవు మాత్రం అసలైన పూవువే ' అంటూ శోభ కళ్ళల్లోకి చూచాడు సూటిగా శోబవదనం పూవులా వికసించింది

మీరు కూడా నాలాంటివారేకదూ మీ మనసు మీకు తెలియదు నాకు తెలుసు అది పూవుకన్నా మెత్తనిది మీకు తెలీకుండానే మీ అరచేతులు చూచాను అవి ముద్దమందారాలే ఇక మునివేళ్ళయితే మల్లిమొగ్గలే పన్నీటి జల్లులు వర్షించినట్లున్నాయి శోబ మాటలు ఈ మాటలు వినగానే శ్యామం గుండె ఝల్లుమంది ఎగిరిగంతేసినట్లయింది గట్టు దిగి నేలమీద నిలబడి –

'అమ్మబాబోయ్ ఈ శోభ నన్ను అమ్మాయిని చేసేసింది గోవిందా అన్నాడు కొద్దిగా హెచ్చు స్వరంతో

శోభ నవ్వాగలేదు పగలబడిపోయినట్లు నవ్వింది అలా నవ్వుతూనే శ్యామం బుజాలు పట్టుకుని ఊపుతూ తాను కూడా గట్టుదిగి నేలమీద నిలబడింది శ్యామం కూడా నవ్వు ఆపుకోలేకపోయాడు

శ్యామ్ నీ నవ్వుకూడా ఎంత అందంగా వుందో '

నీ కంటేనా

ఇంతలో షికారు కొచ్చిన జంటలు ఆ వైపు వస్తుంటే శ్యామం చూచి శోభా ఇక నవ్వులాపుదాము కూర్చుని మాట్లాడుకుందాం అన్నాడు

శోబ కూడా నవ్వడం ఆపింది

ఇంకా చీకటి పడలేదన్న సంగతి అప్పటికిగానీ వాళ్ళిద్దరికీ తెలియలేదు అంతవరకు హుషారుగా వున్న శ్యామం వదనం గంభీరంగా మారిపోయింది

శోబారాణిగారు అని మెల్లగా పిలిచాడు

శోబ వదనం వెంటనే వాడిపోయింది

శ్యామ్! ఇంతలోనే మార్పా శోభా అన్న పిలుపు నన్ను పరవశింపజేసింది ఆ పిలుపునే పదివేలసార్లు వినాలనిపిస్తోంది ప్లీజ్ ' కొద్ది క్షణాలు నిశ్శబ్దం

'మనం తొందరపడ్డామేమో శ్యామం అన్నాడు మెల్లగా

లేదు శ్యామ్ ఆలస్యం చేస్తున్నాం

దేనికి?

మనసు విప్పి మాట్లాడుకోడానికి

అయితే ఇదేనా నీవన్న సీరియస్ విషయం

అవును నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను శ్యామ్ ఆరాధిస్తున్నాను






నీకోసం ఎలాంటి త్యాగం చేయడానికైనా సిద్ధమే  శోబ మాటల్లో అనురాగం వెల్లివిరిసింది

చూడు శోబా దీన్నే నేను తొందరపాటు అంటున్నాను సరదాగా కబుర్లు చెప్పుకోడం వేరు ప్రేమించుకొనడం వేరు శోబ వదనం వివర్ణమైంది కళ్లల్లోనుంచి ఆశ్చర్యం తొంగిచూచింది

అయితే నేనే తొందర పడ్డానా

లేదు శోబా నీవు అమాయకురాలివి నీ ప్రేమ కూడా అమాయకమైనదేనని నాకు తెలుసు కాని

కాని నీవు నన్ను ప్రేమించటం లేదంటావు అవునా ?

కాదు కానేకాదు మన మనసులు ఒకటే అయినా జీవితాలు ఒకటి కాకపోవచ్చు మనసులతో పాటు జీవితాలు కూడా పెనవేసుకు పోయినప్పుడే అది నిజమైన ప్రేమ అంటాను

అంటే జలజల రాలుతున్న కన్నీటి బిందువులను తుడుచుకుంటూ దీనంగా అడిగింది శోబ అంతర్యాలు ఒకటైనా అంతరాలు వేరుగా వుంటే ఏమవుతుంది? ఇది ప్రశ్నే కావచ్చు కాని అతని అంతరాంతరాల్లో ఏదో ఒకమూల శోబరూపు రూపు దిద్దుకునే వుంది

అంతరాలా ఈ ఆలోచన నాలో ఎన్నడూ రాలేదు శ్యామ్ అంతరాలతో నాకు పనిలేదు నీఒడిలోవాలి, ఎదపై సోలి హాయిగా నిద్రించడమే నా జీవిత లక్ష్యం శ్యామ్ నాగుండెకు కోత పెట్టడం నీకిష్టమా చివరి మాటలను గాద్గధిక స్వరంతో పలికింది

శ్యామ్ మనసు ఆ క్షణంలో మళ్లీ చలించింది చిత్త స్థైర్యం లోపించింది ముందుకు నడిచాడు ప్రక్కనే శోభ కూడా అడుగువేస్తోంది అప్పటికి చీకటి పడిపోయింది శ్యామం కళ్లు చమర్చాయి పెదవులు బిగబట్టాడు తన బాధను పైకి కనిపించ నివ్వకుండా ప్రయత్నిస్తున్నాడు శోభ అతడి ముందుకు వెళ్లి ఆగింది ఎదురుగా నిలబడింది శ్యామం కూడా ఆగాడు ఇద్దరి నడుమ దూరం అరడుగు కూడా లేదు శ్యామం భుజాలమీద మళ్లీ చేతులు వేసింది అతడు ముఖాన్ని ప్రక్కకు తిప్పుకున్నాడు

శ్యామ్ నావైపు చూడవా నాలోకి చూడవా ?' ప్రాదేయ పడింది శోబ

శ్యామ్ చెంపల మీద చేయి ఆనించి తనవైపు తిప్పుకుంది సజలనేత్రాలు మెరుస్తూ ఆ మసక వెలుతురులో ప్రత్యక్షమైనాయి

శ్యామ్‌ను అలా ఎప్పుడూ చూడలేదు ఆనందం ఆవేదన మిళితమైనాయి ఆమె మనసులో

'శ్యామ్ చూశావా నీ మనసు అబద్ధం చెప్పలేదు నాలో కలసి కరగిపోమంటోంది నిన్ను కదూ అబ్బా అంటూనే అతని ఎదపై వాలిపోయింధి

ఆ క్షణంలో శ్యామం గుండెలు గుబ గుబ లాడుతోంటే శోభ హృదయం ఆనందాతిరేకంతో పరవళ్లు తొక్కింది అయినా అతడి చేయి అప్రయత్నంగా ఆమె తల నిమిరింది వ్రేళ్లు ముంగురులను దువ్వుతూ లాలించాయి అతని కుడి చేయి ఆమె చెంపను మృదువుగా తాకింది దోగాడింది ఆరాట పడుతున్న ఆమె పెదవులు, ఆ వేపు తిరిగి ఆ చేతిని ముద్దిడుకున్నాయి శ్యామం కూడా ఆ క్షణంలో ఏమి చేయలేక పోయాడు నిగ్రహం కోల్పోయాడు అతని పెదవులు మెల్లగా లాలనగా పలికాయి-

శోబా! ఐ లైక్‌యు ఐ లైక్ యు

ఆ మాటలు విను వీధుల నుంచి విన వచ్చిన గంధర్వ గానంలా ఆమె చెవులకు సోకగా 'శ్యామ్ నువు నా వాడివేగా అంటూ అతని ఎదనంతా ముద్దులతో నింపి తడిపేసింది

ఇంతలో వారి ఏకాంతాన్ని చెదరకొడుతూ ఓ కారు అటు వైపే వచ్చింది దాని హెడ్ లైట్ల కాంతులు పడేసరికి శ్యామం శోభ విడిపోయారు మెల్లగా నడుస్తూ తమ కారు దగ్గరకు వెళ్లారు ఇద్దరూ ఎక్కి కూర్చొగానే కారు ఇంటి ముఖం పట్టింది

(ఇంకా ఉంది)

# పొలోమ్మని జోలి

## పోలీసు స్టేషనులో పెళ్ళి!

చిత్తూరుకు చెందిన ఎర్ణకుడి అనే గ్రామానికి చెందిన 21 ఏళ్ళ జాన్ అనే అతను అదే వూరుకు చెందిన 17 ఏళ్ళ క్రిస్టి అనే అమ్మాయిని ప్రేమించి ఆమె చేత కూడా అదే పని చేయించి, పూర్తి ప్రేమతో సంతృప్తి చెందక రహస్యంగా చిత్తూరు వెళ్ళి వో లాడ్జిలో తమ ప్రేమకు ప్రాక్టికల్స్ చూసుకుంటూండగా పోలీసులు ఆ హోటలు మీద దాడి చేసి వీరిద్దర్ని కూడా పట్టేశారట సబ్ఇనస్పెక్టరు వీరి కథ విచారించి రెండు కుటుంబాల వారినీ స్టేషనుకు పిలిచి వొప్పించి స్టేషనులోనే పెళ్ళి చేసేశారట ఆ పెళ్ళి కాదు నిజం పెళ్ళి అవునవును పోలీసులు కూడా అప్పుడప్పుడు మాంఛి పనులు చేస్తుంటారు

## ప్రాణాలు తీసిన తగాదా!

ఆరణికి చెందిన మెట్టుక్కుల్ అనే గ్రామానికి చెందిన 30 ఏళ్ళ రాజామణికి అతని అక్క మొగుడు 40 ఏళ్ళ షణ్ముగానికి చాలా కాలంగా మనస్పర్థలుంటూ వచ్చాయట ఇవి రాన్రానూ పెరిగి ఒకరోజు వాగ్యుద్ధం ప్రళయంగా మారి షణ్ముగం తుపాకితో తన బావమరది రాజామణిని కాల్చి చంపేశాడట

## కుంటుపడిన అమెరికా ఆర్థిక స్థితి!

పారిశ్రామికంగా, విజ్ఞానపరంగా కూడా పరుగులు తీసిన, యింకా తీస్తున్న అమెరికా ఆర్థిక స్థితి అహో అని అందరూ అనుకుంటారు కానీ యీ దేశం మనదేశం బాబులా అప్పు చేసిందట యింకా చేస్తున్నదట కూడాను మిగతా ప్రపంచ దేశాలలాగా కుండా అమెరికా తన పౌరుల వద్ద నుంచి తన దేశ సంస్థల వద్ద నుంచి అప్పు చేస్తోందట 1981 లెక్కల ప్రకారం యీ దేశం చేసిన అప్పు 96 వేల కోట్ల డాలర్లట!

## కల్తీ వెన్న, నెయ్యితో బసవదేవునికి అభిషేకం!

కర్నాటకకు చెందిన షిమోగాలో కల్తీ వెన్న నెయ్యి వ్యాపారులను ఆ శాఖకు చెందిన ప్రభుత్వ అధికారులు తక్కున పట్టుకున్నారట అయితే వారు రివాజుగా చేయాల్సిన పద్ధతిలో వీరి మీద చర్య తీసుకోకుండా వారందర్ని బసవదేవుని ఆలయానికి తీసుకు వెళ్ళి మరెన్నడూ యిలా కల్తీ వ్యాపారాలు చేయం అని ప్రమాణం చేసి ఆ కల్తీ వెన్న నేయిలతో ఆ దేమున్ని అభిషేకం చేయమన్నారట వ్యాపారులంతా అట్లే చేశారట

## ద్రాక్షారసంతో అల్సరుకి వైద్యం!

జీర్ణకోశంలో పుండు పుట్టి అల్సరు వ్యాధిగా మారి మనిషిని బాధ పెట్టే రోగానికి మందు ద్రాక్షారసమట రోజుకు మూడుసార్లు ద్రాక్షరసం త్రాగితే యీ జబ్బు మటుమాయమయి పోతుందట

## ప్రయోగశాలలో బంగారు తయారీ!

బంగారం భూమిలోంచి సంపాదించడమే గాక ప్రయోగశాలలో తయారు చేయవచ్చునట కూడా ఎటొచ్చి ప్రయోగశాలలో ఒక ఔన్సు బంగారం చేయడానికి ఒక టన్ను బంగారం ఖరీదు ఖర్చు అవుతుందట– వోరిబాబో!

## గుర్తు తెలియని వ్యక్తుల చేతుల్లో యువకుని మరణం!

కర్నూలు జిల్లా గోనెగుండ్లకు చెందిన గాజులదిన్నెలో 32 ఏళ్ళ పురుషోత్తమరెడ్డి అనే అతన్ని వో ఆరుగురు గుర్తు తెలీని వ్యక్తులు నడిరోడ్డు మీద కత్తులతో కసకస పొడిచి చంపి, పారిపోయారట

## ప్రియుడికి తల్లి అయిన ప్రియురాలు!

బ్రిటనులో పీటర్ అనే ఒకతనితో ప్రేమ కలాపాలు కామ కలాపాలూ పెట్టుకుని అందుకు ఫలితంగా వో బిడ్డని కూడా కన్న శాలిని అనే వో వయ్యారి, తీరా ఆ పీటరు పెళ్ళాడుతానని తన తండ్రి వద్ద కామెను తీసుకు వెళితే ఆ నంగనాచి పీటరు తండ్రినే వల్లో వేసుకుని ఆయన్నే పెళ్ళాడిందట

## క్షురకర్మలో ప్రపంచ రికార్డు!

ఆస్ట్రేలియాకు చెందిన బ్రిజ్‌బేన్ నగరంలో ఓ క్షవరశాల నడుపుతూన్న అన్‌హాయ్ అనే యువతి 82 గంటల సేపు నిర్విరామంగా క్షురకర్మ చేసి ప్రపంచ రికార్డు స్థాపించిందట

## అభినవ దుర్యోధనుడు!

మిలనుకు చెందిన బ్రియాన్‌జోలో అనే వో ఇటాలియన్ జలస్తంభనం చేసి ఓ కొలనులోని నీటిలో మునిగి అరవై గంటలు హాయిగా గడిపి చక్కా వచ్చాడట ఇంతకుముందు ఫ్రెంచి దేశీయుడొకాయన 47 గంటలు ఇదే పని చేసి స్థాపించిన రికార్డును జోలో బద్దలుగొట్టి కొత్త రికార్డు స్థాపించాడట □















* 6వ జాతీయ పొదుపు సర్టిఫికెట్లలో మీరు పొదుపు చేసే సొమ్ము 6 సం॥లలో రెట్టింపు కాగలదు
* ఆదాయపు పన్ను మినహాయింపుకూడా వస్తుంది

మిగతా వివరాలకై -
మీ దగ్గర్లో నున్న ఏజెంటును కాని పోస్టాఫీసులో కాని సంప్రదించండి లేదా, మీ జిల్లా కలెక్టరు కార్యాలయములోని స్మాల్ సేవింగ్స్ తహసీల్దారుని గాని భారత ప్రభుత్వ జిల్లా సేవింగ్స్ అధికారిని గాని ప్రాంతీయ డెప్యూటీ డైరక్టరు (స్మాల్ సేవింగ్స్) గారిని గాని సంప్రదించండి



కమీషనర్
స్మాల్ సేవింగ్స్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.
H No 3 6 237/2
హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 29


జాతీయ పొదుపు సంస్థ

పొదుపు నేర్చుకో ముందర - ఖర్చుకెందుకు తొందర

KPA/CS585W2

సీరియల్

# త్రివేణీ సంగమం

ఊరాటి వెంకటరావు

(గత సంచిక తరువాయి)

3

అరుంధతి రూములో కడుగు బిట్టిందో లేదో, కాయా, పండా? అడిగింది వనజ

ఆమె సమాధానంకోసం ఆతృతగా చూసారు గిరిజ మాల

పండో శఫీమని అంది అరుంధతి

ఐతే మ్యారేజీ సెటిల్ అయిందన్నమాట

లేదు

ఏం?" అంతా విస్మయం వేసారు

ఏమైతేనేం తప్పిపోయిందిగా విసుక్కుంది అరుంధతి

పెళ్ళి కొడుకు నచ్చలేదా?

కట్నం అడిగారా?

"మరెందుకు తప్పిపోయినట్లు?

ప్రశ్నల వర్షం కురిపించారంతా

నన్ను వుక్కిరి బిక్కిరి చేయకండి జరిగింది బ్రీఫ్‌గా చెప్తాను వినండి కుర్చీలో చతికిల బడింది అరుంధతి

ఆమె చెప్పబోయేది వినటానికి సంసిద్ధులై ముగ్గురూ ప్రక్కనే చేరారు ఆతురతతో చెవులు రిక్కించి

"పెళ్ళి కొడుకుపేరు రమేష్ చూడటానికి బాగానే వున్నాడు గ్రాడ్యుఏటట అతనిమాటలేంగాని, అతని తలిదండ్రుల పద్ధతి నాకేం నచ్చలేదు వట్టి పాతకాలపు మనుషుల్లా కనిపిస్తున్నారు వంటొచ్చా? వార్పొచ్చా? చదూకుందా? సంగీతం వచ్చా? ఇవి ఆ ముసలాడి ప్రశ్నలు

ఎవరే ఆ ముసలాడు?

అదేనే ఆ బ్రైడ్ గ్రూం ఫాదర్

ఓ యువర్ వుడ్ బి ఫాదరిన్లా" పకపక నవ్వారంతా

ఛ అసలా సంబంధం చేసుకుంటేగా నేను గనక పెళ్ళి చూపుల తతంగం పూర్తి అయ్యేవరకు ఓపిగ్గా కూర్చున్నాను మీరైతేనా మధ్యలోనే వుడాయించేద్దురేమో! డబ్బుంటే ఆ ముసలాడికి మరీ ఆశలావుంది యాక్టి వేలిస్తామన్నా అతగాడికే సంబంధం నచ్చలేదట అయినా కట్నంమాట ఎత్తితే అమ్మాయి పెళ్ళిచేసుకోదని ప్లెయిన్‌గా ఫాదర్ చెప్పారనుకో ఎనీవే దారి లేకుండా వాళ్ళు చేసుకోరు ఇస్తే నేను ఒప్పుకునేదిలేదు. అందువల్ల ఈ మేచ్ తప్పిపోయిందనే చెప్పాలి మరి

పోన్లే నీకెలా ఇష్టమో అలాగే జరిగింది అన్నారందరూ

"అసలు నీకి సంగతి తెలుసా? మన వనజ యాక్ట్ చేస్తున్న డ్రామాకి రేపే హైదరాబాదు వెళుతున్నాం

వెరీగుడ్

నువ్వివాళ వస్తావో రావోనని బెంగపడ్డాను అన్నది వనజ

నువ్వు నాటకంలో వేయడం ఆ నాటకం నేను మిస్ అవటమా? ఇంపాజిబుల్

"అది సరే, నాటకం నెలాఖరులో అనుకున్నాం గదా అది ప్రిపోన్ అయినట్లు నాన్నగారు టెలిగ్రాం ఇచ్చారు

ఐతే మరీ మంచిది మన వనజ యాక్టింగ్ చూసే సౌభాగ్యం తొందరగా లభించిందన్నమాట అంది అరుంధతి

ఆ మరునాడే స్నేహితురాండ్రు పెట్టె బేడా పట్టుకుని హైదరాబాదు ప్రయాణమయ్యారు

ట్రైన్‌లో వనజ కట్ చేసిన జోకులకు నవ్వలేక చచ్చారు మిగతా వాళ్ళు ఏది ఏమైనా స్టూడెంట్స్ లైఫ్‌లో వున్న ఆనందం మళ్ళీ రమ్మంటేరాదు ప్రతి వ్యక్తి ఎప్పుడో ఒకప్పుడు విద్యార్థి జీవితాన్ని మననం చేసుకోక తప్పదు తరంమారినా, యుగం మారినా ఇది మాత్రం నగ్న సత్యం

ట్రైను నాంపల్లిలో ఆగడంతోనే, వనజ ఫాదర్ రిసీవ్ చేసుకున్నారు పెట్టెలు బేగ్‌లు ప్లాట్‌ఫారం మీద దింపుకున్నారు

వీరు మా క్లాస్‌మేట్స్ అరుంధతి గిరిజ మాల అంటూ పేరు పేరున ఇంటర్‌డ్యూస్ చేసింది వనజ తన తండ్రి రామారావుకు

వెరీ గ్లాడ్ టు సి యు

అందరూ టాక్సీలో ఇల్లు చేరుకున్నారు

ఇది మా అంటీ ఇల్లు అంకుల్ ఈ వూళ్ళో వున్న ఫేమస్ హోటల్ తాజ్ ప్రొప్రైటరు నాటకానికి ఎప్పుడు వచ్చినా ఇక్కడే మా బస అన్నది వనజ పెదిమలపై చిరునవ్వు చిందిస్తూ

మీరేమి మొహమాట పడవద్దు ఫీల్ ఇట్ యువర్ హోమ్ అన్నారు రామారావుగారు

థాంక్స్

అందరి ముఖాల్లో నవ్వులు విరిసాయి

కాలకృత్యాలు ముగించుకోవడంతోనే కాఫీ టిఫిన్లు సిద్ధం చేసింది వనజ

టిఫిన్ కానిచ్చాకా అంది అరుంధతి – ఇక మేం వూరిమీద రైడ్ చేస్తాం

ఔను మరి ఈ వూరి రోడ్ల పొడవులు వెడల్పులు సర్వే చేయాలి కదా' అంది మాల

అందరూ ఆ మాటలకి ఫక్కున నవ్వారు

'ఎలానూ ఇంత దూరం రానే వచ్చాం హైదరాబాదంతా ఓమారు తిరిగేసి, నాటకం టైముకి డైరెక్టుగా థియేటరు కొచ్చేస్తాం అంది గిరిజ హుషారుగా కళ్ళు తిప్పుతూ

సరే మీ ఇష్టం నాకూ మీతో ఫాలో అవాలనే వుంది రిహార్సల్

జరిగినకథ–1 అరుంధతి బి ఏ ఫైనల్ ఇయర్ విద్యార్థిని ఆమె రూంమేట్స్ వనజ గిరిజ మాల అరుంధతి ఆమె కాలేజీ స్టూడెంట్స్ వరకట్నం తీసుకునే యువకులను పెళ్ళి చేసుకోమని ప్రమాణాలు చేస్తారు తండ్రి మాధవరావు పెళ్ళిచూపులు ఏర్పాట్లు జరిగాయి బయలుదేరి రమ్మని ఉత్తరం రాయగా వెళుతుంది అరుంధతి ఆమె తమ కాలేజీలో చేసిన ప్రమాణ విషయం తండ్రితో చెపుతుంది పెళ్ళివారు వచ్చివెళ్ళారు

వుండటంవల్ల ఉండక తప్పదు సరిగ్గాథ్రిము కొచ్చేస్తారుగా

ఉండండి కాస్సేపు అంటూ లోపలకెళ్ళి మూడు కాంప్లిమెటరీలు షట్కుకు వచ్చింది వనజ

అరుంధతీ బృందం హుస్సేన్ సాగర్ చూసి హాయి ఫీలయ్యారు సాలార్‌జంగ్ చూసి మ్యూజియం మనోజ్ఞమని ప్రసంసించారు చారిత్రాత్మిక ప్రదేశమైన గోల్‌కొండ దర్శించి తన్మయత్వం చెందారు జూలాజికల్ పార్కు లోని జంతువులను సందర్శించి విశ్రాంతి చెందారు హోటల్ బృందావన్ లో మిల్సుచేసి రాత్రి సరిగ్గా తొమ్మిది గంటలకు రవీంద్ర బారతి చేరుకున్నారు

రంగు రంగుల విద్యుద్దీపాలతో థియేటరు దగ ధగ మెరిసిపోతోంది అప్పటికే హాల్లోకి ఆడియన్సు వచ్చేయటంతో అంతా గోలగావుంది సీట్లు చూసుకుని కూర్చున్నారు అరుందతీ బృందం

ఐదు నిమిషాలలో ఈ సమాజం మారే దెప్పుడు? నాటకం ప్రదర్శింపబడుతోంది దయచేసి ప్రేక్షకులంతా నిశ్శబ్ధంగా వుండాలని మనవి మైక్‌లోంచి ఎనౌన్స్‌మెంటు వినిపించడంతో జనంలో గోల కొంత సద్దు మణిగింది

ఆ నాటకంలో నిరుపేదగా జన్మించి అమాయకతకు నిరాడంబరతకు ప్రతీకగా నిలిచి సమాజం యొక్క కబంధ హస్తాలలో నలిగిపోయి పతితగా మారిపోయిన ఒక కరుణామయి పాత్రను పోషిస్తున్న వనజను చూస్తూ వుంటే అరుంధతికి ఆనందంతో పాటు ఆశ్చర్యం కూడా వేసింది ఆమె అద్భుత నటనకి మనసులో నే అంజలి ఘటించింది ఆమె తండ్రి డ్రామా యాక్టరని వినడం తప్పా అతని నటన ఎప్పుడూ చూడలేదు ఆ మహానటుని నటనా గరిమను కళ్ళారా కాంచాకా అబినందించకుండా వుండలేకపోయింది వనజ తన పాత్రలో జీవిస్తున్నప్పుడు ఆమె ముఖంపై సప్తవర్ణములలో స్పాట్‌లైటు పడుతూ వుంటే ప్రేక్షకులు పరిసరాలు మరచి తన్మయత్వం చెందుతున్నారు

నాటకం అయిపోయింది ప్లే ట్రాజిడీ అవటంవల్ల ఆడియన్సు హేండ్ కర్చిఫ్‌తో చెమర్చిన కళ్ళను వత్తుకుంటూ బయటకు దారితీసారు

నాటకం అవడంతో నే అరుంధతీ బృందం గ్రిన్‌రూములో కెళ్లారు అప్పటికే పాతికమంది దాకా పెద్ద మనుషులు వనజకు రామారావుకు హార్టీ కంగ్రాట్యులేషన్సు అందించి శలవు తీసుకుంటున్నారు

సభ్యత సంస్కారాలు వున్నటువంటి కుటుంబంలో పుట్టి సహజంగా దేవుడిచ్చిన గిఫ్ట్ నుపయోగించుకుని ప్రదర్శన లిచ్చి పేరు ప్రఖ్యాతులు



గడించుకుంటున్న వనజను చూస్తూవుంటే అరుందతి నయనాల్లో ఆనంద భాష్పాలు పేరుకున్నాయి ఆమె స్వేచ్ఛాజీవి తన ఆశయాలు సాధించుకునేందుకు అవకాశాలున్నాయి అందుకు అడ్డుచెప్పేవాళ్ళు లేకపోగా, తన తండ్రే ఆమె ఆశయాలకు రూపాన్నిచ్చి మరింత అందగా నిలబడుతున్నాడు నిజంగా ఆమె ఎంత అదృష్టవంతురాలు? చెమర్చిన కళ్ళను చెంగుతో వత్తుకుంటూ ఆమె కబినందనలు తెలిపింది

ఏమిటే ఆ కన్నీళ్ళు చెంపలు తుడుస్తూ అడిగింది వనజ

అబ్బే ఏంలేదు నీ రోలు ట్రాజిక్కు కదా' అంటూ అక్కడనుండి బయటకు నడిచింది అరుంధతి

అందరూ టాక్సీలో ఇల్లు చేరుకున్నారు ఆ రాత్రి అక్కడే విశ్రాంతి తీసుకుని మరునాడు తిరుగు ముఖం పట్టారు

కాలచక్రం గిరగిరా తిరుగుతోంది పరీక్షలు దగ్గర పడటంతో ఎవరికివారు చదువులలో నిమగ్నమయ్యారు అరుంధతికి పెళ్ళి చూపులలాంటి వొత్తిడిలు మరి చేయలేదు మాధవరావు ఆమె చదువులో పూర్తిగాలీనమైపోయింది

పరీక్షలు సంతృప్తికరంగా వ్రాస బరువుగా శ్వాశ తీసుకుంది అరుంధతి స్టూడెంట్సంతా సినిమాలు చూడటాలు వీడ్కోళ్ళు ఆటోగ్రాఫులు ఫొటోలు వీటి హడావిడిలో నాలుగు రోజులు గడిపి ఎవరి ఇళ్ళకు వాళ్ళు బయలుదేరుతున్నారు వియోగవ్యథ అందరి ముఖాల్లో కొట్టొచ్చినట్లు కానవస్తోంది

ఉత్తరాలు రాయడం మరచిపోకండి బాధగా అంది అరుంధతి

మా మాటకేంగాని మేచ్ సెటిలయితే శుభలేఖ అడ్వాన్సుగా పంపాలి సుమా అన్నది వనజ

పెళ్ళికొడుకు లేకున్నా ఫరవాలేదు మీరు లేకుండా మాత్రం నా వివాహం జరగదు సరేనా?

ఆమె మాటలకందరూ ఫక్కున నవ్వుకున్నారు

## 4

పరీక్ష లెలా వ్రాసా వమ్మా అడిగాడు మాధవరావు కూతురు గుమ్మంలో కడుగుపెట్టగానే

అతనిలో ఇదివరకటి వుత్సాహం కానరావటంలేదు ఏదో మనసులో పెట్టుకుని మథనపడుతున్నాడని గ్రహించింది అరుంధతి

జవాబుగా బాగానే వ్రాసాను నాన్నా అంది కాని అతనలా ఎందుకున్నాడో అడగాలనుకుంది మరెందుకో పెదిమలవరకు వచ్చిన మాటల్ని పైకి రానీయలేదు

కొయ్యకు వ్రేలాడుతున్న గొడుగు తీసుకుని వీధిలోకి వెళ్ళిపోయాడు మాధవరావు

ప్రయాణ బడలిక తీర్చుకుని చీర మార్చుకుని వంటగదిలో కెళ్ళింది అరుంధతి ఎయటకు వెళ్ళిన తండ్రి ఇంకా తిరిగి రాలేదు

ఉమవంట చేస్తోంది

వంకాయలు తరుగుదామని కత్తిపీట తెచ్చుకు కూర్చుంది అరుంధతి

అవి నేను తరుగుతానులే చదివి చదివి అలసిపోయావు కాస్త ఈ రోజు రెస్టు తీసుకుంటే ఏం పోయింది వారించింది ఉమ

ఫరవాలేదే అంత పని నువ్వొక్కర్తివే చేసుకుంటూ వుంటే చూస్తూ ఎలా కూర్చొను వంకాయలు తరిగి గిన్నెలో వేయసాగింది

మరి మాట్లాడకుండా అన్నం వార్చడంలో లీనమైంది ఉమ

నాన్నగారెందుకలా వున్నారు వంట్లో గాని బాగులేదా? నిశ్శబ్దాన్ని చీలుస్తూ అడిగింది అరుందతి

వంట్లో బాగానే వుంది కాని మనసే బాగోలేదు వార్చిన గిన్నె మళ్ళీ స్టౌమీద పెట్టింది

మనసెందుకు బాగులేదు?

ఎలా బావుంటుంది? నువ్వా రోజు పెళ్ళిచూపులకి వచ్చి వెళ్ళేకా సుమారు మరో పది సంబంధాలైనా చూసి వుంటారు కట్నమిస్తే చేసుకోనన్నావ్ ఆ విషయమే నాన్నగారు వాళ్ళకు చెబితే నవ్వుకున్నారు హేళన చేసారు

కోరినంత డబ్బిస్తామన్నా ఆడపిల్లకు పెళ్ళవటం గగనమైపోతున్న ఈ రోజుల్లో కట్నం లేకుండా పెళ్ళిపోటానికి నీ కూతురు ఆకాశం నుండి గాని వూడిపడిందా? అంటూ గేలి చేసాడో ఆసామి దాంతో అతనికి నలుగురిలో తల తీసేసినట్టైంది ఇంటికొచ్చాకా అతనెంత బాధపడ్డారో నీకేం తెలుసు? అంటూ అన్నం గిన్నె దించి స్టౌ మీద మూకుడు పెట్టింది

ఉమ మాటలతో అరుందతికి ఈ సమాజం మీద మనసులేని ఈ మనుషుల పైనా అపరిమితమైన ఆగ్రహం కలిగింది తరిగిన ముక్కలు యాంత్రికంగా అందించింది

మూకుట్లో నూనె వేసి ముక్కలు గుమ్మరించింది ఉమ

ఆ మాత్రానికే నాన్నగారెందుకంత బాధపడిపోవడం

ఎక్కడికెళ్ళినా అదే సమాధానం రావడంతో అసలు నీకీ జన్మలో పెళ్ళయ్యే యోగం వుందో లేదోనని బెంగ పట్టుకుంది

మరి మారు మాట్లాడకుండా మౌనంగా గదిలో కెళ్ళి మంచంమీద పడుకుని దీర్ఘంగా ఆలోచించసాగింది ఆమె మనసులో పట్టు కదిలిస్తే రేగిన తేనెటీగల్లా ఆలోచనలు ముసురుకుంటున్నాయి తండ్రి బాధను అర్థం చేసుకునేందుకు ప్రయత్నించింది కూతురెంత వున్నత స్థాయి కెదిగినా ఒక ఇంటి ఇల్లాలైతే గాని ఆ తండ్రి మనసు స్థిమితపడదు చేసిన ప్రమాణం ప్రక్కకు నెట్టి ఏదో ఒక సంబంధం స్థిరపరచమని చెప్పి అతని మనోవ్యథను మాన్పడమా? లేకుంటే తన






పిల్లల మాసపత్రిక

# బాలరంజని

రంగు రంగుల ముఖచిత్రం!

★ కథలు! ★ సీరియల్‌లు!

★ బొమ్మల కథ!

★ విజ్ఞానాన్ని పెంచే వ్యాసాలు!

ఇంకా-చిన్న పిల్లలనీ (పెద్దవారిని-
-కూడా!) అలరించే బొమ్మలు, శీర్షి
కలు, వింతలు, విశేషాలు!

ప్రతి పేజీ లోనూ రంగు
రంగుల బొమ్మలు!

నేడే మీ కాపీ రిజర్వు చేసుకోండి!

వెల రు. 2-00

ఆంధ్రపత్రిక ప్రచురణ

ఆదర్శాలతో అతనినింకా చిత్రహింస చేయటమా? ఏమిటి తన కర్తవ్యం? ఎం చేయాలి? తన పెళ్ళైతే గాని చెల్లెళ్ళ వివాహ ప్రసక్తిరాదు తన మూలంగా వాళ్ళకూ పెళ్ళిళ్ళవడం కష్టం అప్పుడు వాళ్ళు తనను పైకి ఏమి అనలేకపోయినా మనసులోనైనా నిందించుకోవచ్చు పెంచి పెద్ద చేసానేగాని ఏ ఎల్లకు రెండక్షింతలు వేయలేకపోయానన్న బాధ నాన్నను బ్రతికి వున్నంత కాలం పీడించవచ్చు ఇందరినిలా అనుక్షణం చిత్రహింసకు గురిచేసే కంటే తన ఆదర్శాలను వదలుకోటమే మంచిదేమో! ఐతే ఏది వెంటనే నిర్ణయించుకోలేకపోయింది

కాలేజిలో యూనియన్ సెక్రటరిగా తల మునిగే కార్యక్రమాలలో ఎప్పుడూ లీనమవడం వల్ల సమయం తేలిగ్గా గడచిపోయేది ఇప్పుడు తనకేమి తోచటంలేదు ఉబుసుపోక పత్రికలు నవలలు తిరగవేయసాగింది ఐతే దేనిపైనా సరిగ్గా మనసు లగ్నం కాపటంలేదు తనకోసం తండ్రి పడుతున్న మనోవ్యద ఇంతా అంతా కాదు అలా అని తన అబీష్టానికి వ్యతిరేకంగా వొత్తిడి చేసే మనస్తత్వం కాదతనిది తన మనసు ఎప్పటికైనా మారుతుందేమోనని ఎదురు చూస్తున్నాడు తన పెళ్ళి అతనికి అపరిష్కృతమైన సమస్య ఐపోయింది చాలాకాలం వరకు ఆ తండ్రికూతుళ్ళ మద్య మరి పెళ్లి ప్రసక్తి రాలేదు

ఒక రోజు సాయంత్రం ఎంతో ఆహ్లాదకరంగా వుంది అస్తమించబోతున్న సూర్యుడు ఆకాశాన్ని రాగపర్ణంత నింపుతున్నాడు మచ్చుకైనా మబ్బులు కనిపించని నింగి ఎంతో నిర్మలంగా వుంది కోనేట్లో నీరు వెండిలా తళ తళా మెరుస్తున్నది దాని గట్లంట ఆనుకుని వున్న కొబ్బరి చెట్లు ఎల్లగాలికి విలాసంగా నర్తిస్తున్నాయి బాగా సాయింత్రమవటం వల్ల అక్కడట్లే జనసంచారం లేదు ఓ వైపున మాత్రం ఎల్లలు కేరింతలు కొడుతూ ఆడుకొంటున్నారు

గాలి కెగురుతున్న ముంగురులను సవరించుకుంటూ మెత్తగా ముఖమల్లా వున్న గడ్డినేలపై చతికిలబడింది అరుందతి

ఆ మనోజ్ఞమైన వాతావరణంలో ఎంత సేపైనా వుండిపోవాలనిపించింది కాని ఎంత సేపని వుండిపోగలదు? సమయం ఏడు గంటలు దాటుతోంది వేసంగి అవటంచేత ఇంకా గుడ్డి వెలుగు మిగిలి వుంది ఇహ ఇంటికి వెళ్ళటం మంచిదని లేచింది అప్పటికే అలికిడి పూర్తిగా సద్దుమణిగింది ఆడుకొంటున్న ఎల్లలు ఎప్పుడు వెళ్ళిపోయారో తను గమనించనే లేదు

చుట్టూ నిశ్శబ్దంగా నిర్మానుష్యంగా వుంది

కొద్ది దూరంలో ఏదో మానవాకారం కంటబడింది బయంతో అరుందతి గుండెలు దడదడ కొట్టుకున్నాయి నరనరంలో వణుకు పుట్టింది

ఆ ఆకారం తన వైపే రావటంతో ఆ అబల ఆరాటం అదికం కాసాగింది కేకవేసినా పలికే వ్యక్తి పరిసరాలలో కానరావటంలేదు ఆ ఆకారం మరింత దగ్గరకొచ్చింది దాంతో ఆమె హృదయ స్పందన మరింత జోరును పుంజుకుంది రక్త ప్రసరణ నిలిచిపోయేటట్లుంది

ఐనా దైర్యాన్ని కూడదీసుకుని మరింత దగ్గరకొచ్చిన ఆ వ్యక్తి ముఖంలోకి పరిశీలనగా చూసింది

ఇదివరకెప్పుడో ఆ వ్యక్తిని చూసినట్లనిపించింది ఆమె ప్రాణాలు కుదుటపడ్డాయి కాని ఎక్కడ చూసిందో వెంటనే స్ఫురణకు రావటం లేదు

అరుందతీ

ఆ గొంతు ఎక్కడో విన్నట్లే అనిపించింది తనను పేరుపెట్టి ఎలవడంతో మరింత ఆశ్చర్యపోయింది

నన్నింత తొందర్లోనే మరచిపోతారనుకోలేదు

ఆశ్చర్యంగా చూసింది అరుందతి

ఆ రోజు పెళ్ళి చూపులకి

అతని మాట పూర్తి కాకుండనే ఆ వ్యక్తి రమేషని గ్రహించింది

మీరా

ఔను

ఇక్కడ మీరు వంటరిగా

శాంతి కోసం అన్వేషిస్తున్నాను ఆమె గొంతుకలో వైరాగ్యం నైరాశ్యం మిళితమై వున్నాయి

ఈ నిర్జన ప్రదేశంలో శాంతి లబిస్తుందనుకొంటున్నారా?

పది మందిలో లబించని శాంతి ఇక్కడ దొరుకుతుందేమోనని వెతుకుతున్నాను

నిర్లిప్తంగా నవ్వాడతడు

ఇంతకి మీరివూరు

మీ కోసం వచ్చాను

నా కోసమా

ఔను మీ కోసమే మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తున్నాను

ఆశ్చర్యంగా చూస్తూ స్థాణువులా వుండిపోయింది అరుందతి

ఆ రోజు తొలి చూపులోనే మీ రూపం నాలో చిత్రించుకుపోయింది నా ఎదలో కోటి దీపాలు వెలిగినట్లైంది ముఖ్యంగా మి వ్యక్తిత్వం ఆదర్శాలు నన్ను బాగా ఆకర్షించాయి జీవితంలో నాకు పెళ్ళంటూ జరిగితే అది మీతోనే

ఆమె మాట్లాడలేదు

మిమ్మల్ని ఏకాంతంగా కలవాలని నా మనసులో మాట మీ ముందుంచాలని ఎన్నో మార్లు ప్రయత్నించాను ఐతే మీ దర్శన బాగ్యమే కరువైపోయింది ఒక రోజు దైర్యం చేసి సరాసరి మీ కాలేజీకి వచ్చాను మీరు హైదరాబాదు వెళ్ళారని తెలిసి నిరాశతో తిరిగి వచ్చాను మిమ్మల్ని ఇప్పుడిలా చూడటం నా అదృష్టంగా బావిస్తున్నాను

అతని మాటలు వింటూ మౌనంగా వూరుకుందామె

ఏవీ మాట్లాడరేం?

ఏం మాట్లాడమంటారు?

నేనంటే మీ కిష్టం లేదా?

అందని వాటి కోసం అర్రులు చాచటం అవివేకం

నిజం చెప్పాలంటే అందని దానివి నువ్వు ఆశలు పెంచుకున్న వాణ్ని నేను

మీ నాన్నకు కట్నం మీదుండే మోజు మా సంబందం మీద లేదు

అందుకే స్వతంత్రంగా జీవించాలని నిర్ణయించుకున్నాను ఉద్యోగం



కొసం ప్రయత్నిస్తున్నాను నాకేదైనా జాబ్ అయితే మా తలిదండ్రుల నెదిరించైనా మిమ్మల్ని చేపట్టాలనుకొంటున్నాను ఐతే అందుకు కొంత వ్యవది అవసరం

నాపై మీకు గల సదబిప్రాయానికి కృతజ్ఞురాలను కాని అది జరగని పని అనవసరంగా కాలయాపన చేయక మీ వాళ్ళ కిష్టమైన సంబందం చేసుకుని సుఖపడండి నా కొసం కష్టాలు కన్నీళ్ళు కొనితెచ్చుకొకండి మీరు మగవారు మీ అదర్శాలు నెరవేర్చుకునేందుకు ఈ సంఘంలో ముమ్మరంగా అవకాశాలున్నాయి కాని ఈ దేశంలో పుట్టిన ఆడదానికా అదృష్టం లేదు

సంఘాన్ని సమగ్రంగా పరిశీలించి సమాజంలోని లోపాలను ఎత్తి చూపుతున్న అరుంధతిని చూస్తూ వుంటే ఆమె పట్ల రమేష్‌కు మరింత అసక్తి అనురక్తి ఏర్పడుతున్నాయి అందానికి అందం వివేకానికి వివేకం అన్ని మూర్తిబవించిన అరుందతి లాంటి అమ్మాయి తన జీవిత బాగస్వామైతే అంతకంటె అదృష్టం మరొకటుంటుందా? అనుకున్నాడు

మీరెందుకంత నిస్పృహ చెందుతున్నారో నాకర్థం కావడం లేదు?

ఏది ఏమైనా నా కొసం నిరిక్షించటం అనుచితం

నాకలా అనిపించటం లేదు

అందులో మీకు మిగిలేది బాద తప్పా మరొకటుండదు

మీరు పొరబడుతున్నారు మీ గురించి ఎన్ని యుగాలైనా ఎంతో ఇంగా నిరిక్షిస్తాను

ఆమె మరి మాట్లాడలేదు

ఆమె మౌనాన్ని అంగికారంగా తీసుకున్నాడు రమేష్

పదండి ప్రొద్దుపోయింది బాగా చీకటి పడిపోయింది మిమ్మల్ని ఇంటి వరకు దిగబెడతాను

యాంత్రికంగా అతడిని అనుసరించింది అరుందతి

మాదవరావు ఉమ గట్టిగా మాట్లాడుకుంటున్నారు

లొనికి వెళ్ళబొయిన అరుందతి గుమ్మం వద్దే ఆగిపోయింది

నేనూ ఎన్నొ మార్లు చెప్పాను ఐతే దాని దొరణి మారేటట్లు లేదు

చిన్నప్పటి నుండి పెంచి పెద్ద చేసింది అది పెళ్ళి పెటాకులు లేకుండా తిరుగుతూ వుంటే చూడటానికా మి అమ్మ దాని మిదే పంచ ప్రాణాలు పెట్టుకుని కన్ను మూసింది పోతూ పోతూ ఏమందో తెలుసా? అరు అమాయకురాలు తెల్లని వన్నీ పాలు నల్లని వన్ని నీళ్ళూ అనుకునే మనస్తత్వం

నాన్నా తండ్రిని ఓదార్చాలని ప్రయత్నించింది ఉమ

దానికిప్పుడు నేనేమి చేయలేని స్థితిలో వున్నాను అది నా మాట వినదు బగవాన్ నేనేం చేయాలి?

తండ్రి మనొ వ్యదను చెవులారా విన్న అరుందతి కళ్ళంట వుప్పెనగా నీళ్ళు చిలికాయి కళ్ళు వత్తుకుంటూ లొపల కడుగుబెట్టింది

అరుందతి రాకతో ఆ తండ్రి కూతుళ్ళ సంబాషణ ఆగిపోయింది

పొంగు కొస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుకుంటూ నాన్నా అంది అరుందతి

మాట్లాడలేదు మాదవరావు

అలా వున్నావేం నాన్నా మళ్ళి తనే అడిగింది

ఏం? ఎలా వున్నాను? బాగానే వున్నానే ఐనా నాకేం తక్కువ తల్లి నేనంటె ప్రాణం పెట్టే రత్నాల్లాంటి ముగ్గురు కూతుళ్ళుండగా

అతడి మాటలలొ గల వ్యంగ్యాన్ని అర్థం చేసుకుంది అరుందతి

నా గురించి నువ్వనుబవిస్తున్న వ్యద నాకర్థమైంది మన వ్యవస్థలొ కట్నం లేకుండా ఆడపిల్లకు పెళ్ళి కాదు వాళ్ళకి కావలసింది పిల్ల గుణం కాని కుటుంబ సాంప్రదాయం కాని కాదు కావలసింది డబ్బే కొరినంత దనం గుమ్మరిస్తే చాలు పిల్ల కుంటిదైనా గుడ్డిదైనా పర్వాలేదు వరుడికి కావలసింది అనుకూలవతైన అమ్మాయి కాదు పెళ్ళి పేరుతొ సంపాదన బార్యను వంటింటి కుందేలును చె ఆమె తెచ్చే డబ్బుతొ విలాసాలు సాగించడం వారి లక్ష్యం ఇంట్లొ పని పాట్లకు మనిషిని పెట్టుకుంటే డబ్బిచ్చుకొవాలి ఆ పని కూడా వ్యాపార రీతిలొనే వుంటుంది అందుకొసం బార్య అన్న పేరుతొ డబ్బు తెచ్చే ఒక మనిషి కావాలి

ఆమె ఆవేశం తారస్థాయినందుకుంది మాదవరావుకు మతి పోయినట్లయింది

కట్నమివ్వకపోతే నిన్నెవరు చేసుకుంటారు' పెళ్ళి చేయకుండా ఎన్నాళ్ళని మాదవరావు నోట నుండి మరి మాటలు పెగలలేదు

నేనొక ఆదర్శం కొసం జీవిస్తున్నాను కట్నమిచ్చి పెళ్ళి చేసుకొనని కొన్ని వేల మంది సమక్షంలొ ప్రమాణం చేసాను ఏ పరిస్థితిలొనూ ఆ ప్రమాణం తప్పలేను

మరి నీ చెల్లెళ్ళ విషయం ఆలొచించవేం' కోపంగా అన్నాడు మాదవరావు

నా మూలంగా చెల్లెళ్ళ బవిష్యత్తు పాడవకూడదు ఆ పాపం నా కొద్దు ఇక నా గురించి ప్రయత్నం విరమించి చెల్లెళ్ళకు పెళ్ళి చేయండి వాళ్ళ దారికి నే నాటంకం కాకూడదు అదే నా అబ్యర్థన రుద్దకంఠంతొ పలికింది

పెద్దపిల్ల పెళ్ళి చేయకుండా తతిమావాళ్ళకి సంబందాలు చూస్తే మన సంప్రదాయం మీదే సందేహం రావచ్చు అప్పుడు వాళ్ళ పెళ్ళిళ్ళవటం కష్టమే నీ విషయం తలించుకుంటే

నా సంగతి మీకు చెప్పాను ఇక నా తొబుట్టువుల పెళ్ళిళ్ళకు నేను ఆటంకమనుకుంటే వాళ్ళ వివాహాలయ్యేంతవరకు దూరంగా వెళ్ళిపొతాను మీకిష్టరే కూతుళ్ళకు కొం

మాధవరావు కళ్ళంట గిర్రున నీళ్ళు తిరిగాయి వారి సంబాషణ అక్కడితొ ఆగిపోయింది

(సశేషం)

# పదధ్వని

మసుందర్

మానస పదమున చెలిమి పదద్వని
అనారతముగా అలికిడి విని విని
పురాస్మృతుల నవ మృదుస్వరావళి
హృదయొల్లాసపు బయళుల కరువలి

చెవి లొపలి తొలి శ్రవణ పరికరము
ద్వార ఘంటికల కలకల మురలగ
సుహాస కాంతులు సుమ బాసములై
ఆమని చెరవిడి కొరిక తరుమగ

సరబస సాంద్రొత్సాహ జలదిగా
ఎదముని వాకిట స్నేహ వీచిగా
ఉరికెను నాదొత్సాహ తరంగిణి
అహర్నిశొత్సవ నవ్య పదద్వని

ఓ హరి సాహరి తొ షదిదితులు
చీల్చిసాగు నైరాశ్య తమస్సులు
అన్వేషిస్తూ సురుచిర శాంతిని
ఆహ్వానిస్తూ చిరతర కాంతిని

# జన్యు చికిత్స చేతిలోనే జాతి భవిష్యత్తు!

జన్యు చికిత్సని గురించి రోజు రోజుకి ఎక్కువగా చర్చించడం జరుగుతోంది జెనెటిక్ ఇంజనీరింగ్ వల్ల ఆర్థిక ప్రతిపత్తి భవిష్యత్తులో పటిష్ఠం కాగలదన్న ఆశాభావం కూడా బలంగా పుంజు కొంటోంది ఈ విధానం బయోటెక్నాలజీలో ఒక భాగమే అయినా మానవ జీవనస్రవంతిపై ఎక్కువ ప్రభావాన్ని చ ఎది ఇదేనని చెప్పవలసి ఉంది సంప్రదాయానికి భిన్నంగా సూక్ష్మ జీవరాశులని కృతకంగా వేలాదిగా సృష్టించి వాటిద్వారా మానవ జీవితపు విలువలని మార్చివేయడంలో జెనెటిక్ ఇంజనీరింగ్‌కి సాటి మరొకటి ఉన్నట్లు అని ఎంచదు

## సూక్ష్మజీవుల సృష్టిలో జన్యుచికిత్స పాత్ర

బాక్టీరియమ్‌లు ఈస్ట్‌లు పంగస్‌లు (కొన్ని రకాల బూజులు) జంతు వృక్ష కణసంచయాలు- ఇలాంటి వాటిని ఇతోధికంగా ప్రయోగశాల పరిస్థితు లలో అబివృద్ధి పరచటానికి జెనెటిక్ ఇంజనీరింగ ప్రక్రియ ఎంతైనా తోడు పడుతుంది మద్యం తయారుకావటానికి ఈస్ట్‌లు అవసరం ఈస్ట్‌కణాల చక్కెరని సారాయిగా మారుస్తాయి ఇలాగే జున్ను రొట్టె తయారు కావాలంటే కూడా ఈస్ట్ కణాలు కొన్ని రకాల ఫంగస్‌లు అవసరము' సూక్ష్మ జీవ జాలాల జీవక్రియ ఆధారంగా జెనెటిక్ ఇంజనీరింగ్‌ని ఉపయోగించుకొని అంటీ బయాటిక్స్‌ని పెద్ద ఎత్తున తయారుచేస్తున్న పద్ధతి నేడు పదిమంది దృష్టినీ ఆకర్షిస్తూ ఉందని వేరుగా చెప్పవలసిన అవసరంలేదు

కొన్ని రకాల బ్యాక్టీరియమ్‌లు మురికి గుంటల



ఇన్సులిన్ తయారీ విదానం ఎడమవైపున జంతుకణం నుంచి సంగ్ర హిస్తున్న జన్యుపదార్థాన్ని కుడివైపున ప్లాస్మిడ్‌ల నుంచి బ్యాక్టీరియమ్‌లని చేరిన జన్యు పదార్థాన్ని చూడవచ్చు ఇన్సులిన్‌ని స్రవించే కణాల సంఖ్య ఎక్కువ కావడం గమనించవచ్చు

లోని మొక్కలలో పెరిగి మురికిని పీల్చుకొని నీటిని శుద్ధి చేయటంలో తోడుపడుతాయి ఇలాంటి బ్యాక్టీరియమ్‌లని జన్యుచికిత్స ద్వారా కావలసిన మోతాదులో రూపొందించుకోవచ్చు అలాగే యురేనియమ్ మూలక ఖనిజాలని పీల్చుకొనే గుణమున్న కొన్ని రకాల శైవలాలలో కూడ బ్యాక్టీరియమ్‌ల పాత్ర ఉందని కొందరు అంటారు

సూక్ష్మజీవులని విరివిగా సృష్టించడమనే అంశం కొన్ని దశాబ్దాల పరిశోధనానంతరం జన్యు చికిత్స వల్లే సాద్యపడింది నేడు విశ్వ వ్యాప్తంగా ఈ అంశంపట్ల తక్కువ శ్రద్ధని కనబరుస్తున్నారు

## జన్యువులని మార్చడమంటే?

1953లో వాట్సన్ క్రిక్‌ల నమూనాని అనుసరించి జన్యు పదార్థంగా బావించబడుతున్న కీలక కేంద్రకామ్ల మైనడీ ఆక్సీ రైబో న్యూక్లియిక్ ఆమ్లాణువు నిర్మాణువు నిర్మాణం స్పష్టంగా తెలుగులోకి వచ్చింది ఈ అణువు రసాయనిక నిర్మాణం వెల్లడి కావడంతో జన్యు సంకేతమేదో తెలుసుకోవడం సులభమై పోయింది జన్యువుని సూచించడానికి మూడుజతల నత్రజని క్షారాలు తోడుపడతాయని తెలిసింది ఈ క్షారాల అమరికలో గనుక మార్పులు చేస్తే జన్యువులో వ్యక్తిగతంగా మార్పులు చేసినట్లు అవుతుంది అలాకాక ఆమ్లాణువులోని జన్యువులని సూచించే నత్రజని క్షారాల త్రికాలని (ట్రిప్లెట్స్‌ని) మారిస్తే జన్యువులనే మార్చినట్లు అవుతుంది ఇలా మార్చే జన్యువులని మరొక కణంలోకి (వృక్షకణం కాని జంతుకణం కాని) అమర్చడమనే ప్రక్రియ సులబంగా కనిఎంచవచ్చు కాని దీనిని నిర్వహించటానికి సున్నితమైన సాంకేతిక నైపుణ్యం సమగ్రమైన శాస్త్రీయ సమాచారం తెలిసి ఉండాలి లేకపోతే ఊహించని దుష్పరిమాణాలు సంభవించే అవకాశం కూడా ఉంటుంది

## వివిద రంగాలలో జెనెటిక్ ఇంజనీ రింగ్

జన్యు చికిత్సని సాధించటంలో విజయాన్ని పొందడంతో దాని ప్రబావం అనేక రంగాలపై కాన వస్తోంది అనడంలో సందేహంలేదు వ్యవసాయ రంగంలో విప్లవాత్మకమైన మార్పులు రావటానికి జెనెటిక్ ఇంజనీరింగ్ ప్రధానమైన కారణమని ఎక్కువమంది చెబుతారు ఆవు మాంసంలో ఉండే ప్రోటీన్‌లకి మూలమైన జన్యువుని టొమాటో మొక్కకి చేరవేసి టొమాటోలలో ఆ ప్రోటీన్లని రప్పించడమనే ప్రక్రియ సంచలనం కాక మరేమిటి? పాల ఉత్పత్తి పెంచటానికి మాసం వృద్ధిని ద్విగుణీ

పది సంవత్సరాల లోపే ప్రాదమిక పరిశోదనా స్థాయిలో అవగాహన చేసుకొన్న జన్యు చికిత్సా పరమైన పరిజ్ఞానాన్ని పారిశ్రామిక జెనెటిక్ టెక్నాలజిలో ఉపయోగించటం జరుగు తుంది 1982లో జెనెటిక్ ఇంజనీరింగ్ ద్వారా తయారైన పదార్థాలవల్ల ప్రపంచ వ్యాప్తంగా 120 మిలియన్‌ల డాలర్‌ల వ్యాపారం జరిగింది 1985 నాటికి ఈ విలువ 4 బిలియన్‌ల డాలర్‌లు కాగలవని అంచనా!

కృతం చేయటానికి ఉన్న పెరుగుదల మరింత ఎక్కువ కావటానికి రోగ నిరోదక శక్తి పుంజుకోవటానికి అయిర్దాయం పెరగటానికి వీలుగా జరిగే జెనెటిక్ ఇంజనీరింగ్ ప్రక్రియలవల్ల పశు సంవర్ధక శాస్త్ర స్వరూపమే మారిపోయింది వైద్యరంగంలో జన్యు చికిత్స సృష్టిస్తున్న అద్భుతం చెప్పటానికి లేదు మందులు హార్మోన్‌లు వ్యాక్సిన్‌లు- ఒకటని ఏమిటి- ఎన్నో రకాలుగా మనిషి ఆరోగ్యానికి దోహదపడే పదార్థాల తయారీలో జన్యు చికిత్స వహించే పాత్ర అమోఘమైనది త్వరితగతిన తయారు కావడమే కాదు అత్యంత ప్రతిబావంతంగా అలోచనకి తగినట్లు రూపం దిద్దుకోవడం ఎంతైనా



2 మెలికలు తిరిగిన నిచ్చెనలా ఉన్న డీ ఆక్సీరైబో న్యూక్లియిక్ అమ్లాణువు!

అశ్చర్యాన్ని కలిగిస్తుంది ఇందన సంక్షోబం నుంచి బయట పడటానికి వీలుగా ఇందనాలని అందించడంలో బాగా ఉపయొగపడే మొక్కలని ఏపుగా పెరిగేటట్లు శీఘ్రంగా ఎదిగేటట్లు చేసేలా జెనెటిక్ ఇంజనీరింగ్‌ని బాగా వాడుకొంటున్నారు

## దృక్పధాన్ని మారుస్తున్న అద్భుత పదార్థాలు

జెనెటిక్ ఇంజనీరింగ్ రంగంలోకి రావడంతో గతంలో మానవ చరిత్ర ఎప్పుడూ చూచి ఉండని అద్భుత పదార్థాలు తెరమీదికి వస్తున్నాయి ఈ శతాబ్దపు అద్భుత పదార్థంగా బావించబడుతున్న ఇంటర్‌ఫెరాన్ జన్యుచికిత్సలో బాగంగా వెలువడినట్టిదే! అపర సంజీవినిగా దీనికున్న విశిష్టత ఎంతో గొప్పదని అందరూ అంగీకరిస్తున్నారు కూడా! మదుమేహానికి మందేలేదని బావిస్తున్న తరుణంలో ఇన్సులిన్‌ని మానవదేహంలో స్రవింపజేయడం చాల సులబమని జన్యు చికిత్స స్పష్టం చేసింది ఇన్సులిన్‌కి మూలమైన జన్యువుని

**జీవ రహస్య కీలకమైన డీ ఆక్సీరైబో న్యూక్లియిక్ ఆమ్లాణువు మెలికలు తిరిగిన దారపు పోచలాగా కణ కేంద్రకంలో ఉంటుంది వారసత్వంగా సంక్రమించే బౌతిక లక్షణాలకి తెలివితేటలకి కళాత్మక అబిరుచులకి కారణమైన జన్యువులలో ఈ పదార్థమే ఉంటుంది**

ప్లాస్మిడ్‌కి అందించి తద్వారా బ్యాక్టీరియమ్‌లని చేరవేసి అదిక మోతాదులో ఇన్సులిన్‌ని తయారు చేయడం చాల తేలికని తేలిపోయింధి

## జన్యు చికిత్సని దుర్వినియోగ పరిస్తే?

మానవ బలహీనత బలంగా బయట పడినప్పుడు జన్యుచికిత్సని దుర్వినియోగపరిచే అవకాశముందని లోకశ్రేయస్సుని కొరేవారు అనుకోవడంలో అబద్ధమేమీలేదు మానవ ప్రయోజనకరమైన అద్భుతాలని అందరూ హర్షిస్తారు కాని ప్రమాదకరమైన విపరీతాలని ఎవరూ ఆహ్వానించరు జన్యుచికిత్సకి రెండు వైపులా పదను ఉంది దాన్ని ఉపయోగించుకునే విజ్ఞతని బట్టి పలితాలు ఆదారపడి ఉంటాయి కాని అనవసరంగా ఆందోళన చెందితే ప్రగతి కుంటుపడుతుంది కలలో కూడ ఊహించని విదంగా బ్యాక్టీరియమ్‌ల చేత డయాక్సిన్ అనే విషపదార్థాన్ని తొలగింప చేయడం గనులలో మానవులు సంగ్రహించటానికి అసాధ్యమైన కొన్ని లోహాలని కూడ సూక్ష్మజీవుల ద్వారా రాబట్టుకోవడం విచిత్రమే కదా!

వయసెడి మిన్నకుండే [illegible] మాత్రం [illegible] గలరు?

## జెనెటిక్ ఇంజనీరింగ్ కొనసాగవలసిందే!

మానవ జీవన సరళిని ప్రగతి పదంవైపుకి మరలించుకొని పోయే లాగున జెనెటిక్ ఇంజనీరింగ్‌ని మరింతగా ప్రోత్సహించవలసి ఉంది అమెరికా సంయుక్త రాష్ట్రాలు సోవియట్ యూనియన్ బ్రిటన్ జర్మనీ జపాన్‌లలో నేడు జెనెటిక్ అంజనీరింగ్ విస్తృతంగా వ్యాప్తిలో ఉంది ఒక్క ఫెడరల్ రిపబ్లిక్ ఆప్ జర్మనీలోనే జెనెటిక్ ఇంజనీరింగ్ గురించి 40 విశ్వ విద్యాలయాలలో చెబుతున్నారు 16 కంపెనీలకి పైగా జెనెటిక్ టెక్నాలజీకి సంబంధించిన పరిశోదనలని చేపట్టాయి మన బారత్ ఈ రంగంలో బాగా వెనుకబడి ఉందని చెప్పవలసి వస్తుంది ఈ అంశాలలో లోతైన పరిజ్ఞానాన్ని ఇంకా సాదించవలసి ఉంది అందుకు ఎంతో కృషి అవసరం!

–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు



గోద్రేజ్ కంపెనీ వారి కొత్త 'క్రౌనింగ్ గ్లోరి' సబ్బును విడుదల చేస్తున్న శ్రీమతి జమున. స్వీకరిస్తున్న వారు శ్రీమతి వసంతా కులకర్ణి.

## అవీ–ఇవీ–అన్నీ

### 'క్రౌనింగ్ గ్లోరి' విడుదల

గోద్రేజ్' కంపెనీ వారి కొత్త 'క్రౌనింగ్ గ్లోరి' సబ్బును సెప్టెంబర్ 16వ తేది సినీనటి శ్రీమతి జమునారావు హైదరాబాద్‌లో విడుదల చేసారు. శ్రీమతి జమున విడుదల చేసిన మొదటి సబ్బుని శ్రీమతి వసంతా కులకర్ణి స్వీకరించారు.

ఎన్నో సబ్బులకు అడ్వర్టయిజ్‌మెంటు ఇచ్చినా కలగని అనుభూతి ఈ సబ్బును విడుదల చేయడంలో కలుగుతోందని, దీనికి కారణం 'జయ గోద్రేజ్' దంపతులు గోద్రేజ్ కంపెనీపై వచ్చే లాబాలతో నాలుగైదు వేల మంది అనాథ బాలలను పోషించడమనీ, కాబట్టి 'గోద్రేజ్' వారి ఉత్పత్తులను వాడటం వల్ల చర్మ సంరక్షణే గాక సేవా కార్యక్రమానికి కూడా ఉపయోగపడ్తాయి కాబట్టి వారి ఉత్పత్తులనే వాడాలని శ్రీమతి జమున కోరారు.

తొలుత గోద్రేజ్ కంపెనీ దక్షిణ ప్రాంతపు సేల్స్ మేనేజరు శ్రీ ఎ. కె. ఎస్. రావు సబ్బు ప్రాశస్త్యాన్ని వివరించారు. కార్యక్రమానికి పాత్రికేయులు శ్రీ జి. రామారావు అధ్యక్షత వహించారు. శ్రీ ఆర్. వెంకోబారావు వందన సమర్పణ గావించారు. సబ్బు విడుదల కార్యక్రమం అనంతరం శ్రీ చాట్ల శ్రీరాములు 'ప్రేమ పాఠాలు' నాటిక, శ్రీ ఆర్. ఎల్. రాజు మ్యూజిక్‌ను ప్రదర్శించారు.

### శ్రీ వివేకానంద యువజనోత్సవ సమితి ప్రారంభోత్సవం

అంతర్జాతీయ యువజన సంవత్సరాన్ని పురస్కరించుకొని – చికాగో విశ్వమత మహాసభలో స్వామి వివేకానందుని సందేశ 92 వ వార్షికోత్సవ సందర్భంగా సెప్టెంబర్ 11 వ తేది సాయంత్రం విజయవాడలోని సిద్ధార్థ కళాశాల ఆడిటోరియంలో శ్రీ వివేకానంద యువజనోత్సవ సమితి ఆవిర్భవించింది. శ్రీ మండప జానకిరామయ్య గౌరవాధ్యక్షులుగా కృష్ణాజిల్లా అంతటా ఏర్పడినది సమితి.

ఈ సందర్భంగా ఏర్పాటయిన సభకు సిద్ధార్థ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఎన్. కాశీవిశ్వేశ్వరరావు అధ్యక్షత వహించారు అడిషినల్ డైరెక్టర్ అఫ్ మెడికల్ అండ్ హెల్త్ సర్వీసెస్ డా టి శ్రీనివాసన్ యువత నా ఆశాజ్యోతి అనే వివేకానందుని దివ్య సందేశాల సంకలనాన్ని ఆవిష్కరించారు

కుమారి చెంపా రామచంద్రన్ శ్రీయుతులు పి గోపిరెడ్డి, డా ప్రసాదరాయకులపతి ప్రసంగించారు కార్యదర్శి శ్రీ నితిన్‌పారిక్ వందన సమర్పణతో కార్యక్రమం విజయవంతంగా ముగిసింది

### కాంకార్డ్ గాస్ స్టౌల విడుదల

ఐ ఎస్ ఐ గుర్తింపుగల కాంకార్డ్ గ్యాస్ స్టౌలను ఆంధ్రప్రదేశ్‌లో పారి కంపెనీవారు మార్కెటులో విడుదల చేసారు కాంకార్డ్ నూతన్ కాంకార్డ్ నవీన్ అనే రెండు రకాల స్టౌలు లభ్యమవుతాయి

ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్‌వారి సాంకేతిక పరిజ్ఞానంతో తయారయ్యే నూతన్ కాంకార్డ్ స్టౌలు దాదాపు 20/ ఇందనాన్ని ఆదా చేస్తాయి బర్నర్‌లు శుభ్రపర్చుకోడానికి వీలుగా దేనికది విడదీసే సౌకర్యం వుంది తుప్పు పట్టదు పెద్ద పాత్రలపై వంట చేయడానికి తగినంత స్థలం వుంటుంది

కాంకార్డ్ నవీన్ స్టౌలు కూడ ఐ. ఎస్. ఐ. గుర్తింపు పొందినవి. ప్రత్యేక ఏర్పాట్ల ద్వారా 10 శాతం ఇంధనం పొదుపునిస్తుంది. ఇత్తడి బర్నర్‌ల అమరికవల్ల, త్రుప్పు పట్టదు. త్వరగా వేడి ఎక్కుతుంది. ప్రత్యేక అమరిక వల్ల బర్నర్స్ మాత్రమే వుష్ణాన్ని గ్రహిస్తాయి. స్టవ్ మొత్తం వేడెక్కదు.

సింగిల్, డబుల్ బర్నర్ స్టౌలుకూడ లభిస్తాయి. □

# హైదరాబాద్ నోట్‌బుక్

## చైనా బౌద్ధ శిల్పంపై ఆంధ్రుల ప్రభావం:-

చైనాలోని బౌద్ధ వాస్తు శిల్ప లలిత కళలపై దక్షిణ బారత ప్రబావం, ముఖ్యంగా ఆంధ్రుల ప్రబావం చాల వరకు ఉందని బారత ప్రభుత్వం పురాతత్త్వ శాఖాధికారి డాక్టర్ బి కార్తికేయ శర్మ అగస్టు 30 సాయంకాలం రామకృష్ణ మఠంలోని వివేకానంద హాలులో చైనాలో బౌద్ధ స్మారకాలు అనే విషయమై ప్రసంగిస్తూ అన్నారు ఈ సమావేశాన్ని ది ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఏషియన్ స్టడీస్ (హైదరాబాదు), రాయప్రోలు సుబ్రహ్మణ్యం రీసెర్చ్ సెంటర్ (గుంటూరు) సంయుక్త ఆధ్వర్యాన ఈ ప్రసంగం ఏర్పాటు చేశారు డాక్టర్ శర్మ సుప్రసిద్ధ పురాతత్త్వ శాస్త్రజ్ఞుడు, లోథాల్, కాళీబంగన్ మున్నగు చోట్ల త్రవ్వకాలు జరిపి పెక్కు నూతనాంశాలు కనుగొన్నారు ఈయన ఇటీవల చైనా బారత ప్రభుత్వం సాంస్కృతిక వినిమయ కార్యక్రమం క్రింద చైనాలో బౌద్ధ స్మారకాలనన్నిటిని పరిశీలించి వచ్చారు చైనాలో అజంతా, ఎల్లోరా గుహలకన్నా పెద్ద గుహలు వేలకొలది ఉన్నాయని, ముఖ్యంగా మద్యచైనాలో బుద్ధుని విగ్రహాలున్న గుహలు వేల కొలది ఉన్నాయని ఆయన తెలిపారు 33 మీటర్ల పొడవున్న నిలుచున్న బుద్ధుని విగ్రహం, 50 మీటర్ల పొడవున్న శయాన బుద్ధ విగ్రహం ఉన్నాయని అవి క్రీస్తు శకం 630 ప్రాంతం వని వీటన్నిటిపై ఆంధ్ర శిల్ప ముద్ర స్పష్టంగా వుందని ఆయన అన్నారు స్వామి రంగనాదానంద ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు ఇన్‌స్టిట్యూట్ ఆప్ ఏషియన్ స్టడీస్ అద్యక్షులు శ్రీ ఎం ఆర్ పాయి (రిటైర్డ్ ఐ ఏ ఎస్) స్వాగతం చెప్పారు డాక్టర్ శర్మ చైనాలోని వివిధ బౌద్ధ వాస్తు శిల్పాల స్లైడ్లు చూపారు ఈ సందర్భంలో బుద్ధిస్ట మాన్యుమెంట్స్ ఇన్ చైనా అండ్ సౌత్ ఈస్ట ఏషియా అనే గ్రంథం డాక్టర్ శర్మ రచించినది ఆవిష్కరణ కావలసినది కాని కేంద్ర ప్రబుత్వం అనుమతి నిరాకరించడం వల్ల ఆవిష్కరణ జరుగలేదు

## విజ్ఞాన దీపిక కృష్ణ జయంతి :-

నగరంలోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ విజ్ఞాన దీపిక సెప్టెంబర్ 7వ తేదీన త్యాగరాజ గాన సభాబవనంలో కృష్ణ జయంతి ఉత్సవాన్ని వైభవోపేతంగా జరిపింది సుప్రసిద్ధ నర్తకి కుమారి జొన్నల గడ్డ అనూరాధ కూచిపూడి సంప్రదాయంలో కృష్ణలీలలకు సంబంధించిన శ్లోక గేయాలను నేత్ర పర్వంగా అభినయించి ప్రేక్షకులను తన్మయులను చేసింది నారాయణ భట్టతిరి నారాయణీయంలోని అగ్రేపశ్యామి, నీలాబ్జం కుంచితాగ్రం శ్లోకాల అబినయం, సదాశివ బ్రహ్మేంద్రుల మానససంచరరే అభినయం రాధికాకృష్ణ- అష్టపది అబినయం అత్యపూర్వంగా ఉన్నాయి ఈ సందర్భంలో విజ్ఞాన దీపిక శ్రీ తిరుమల రామచంద్రను సన్మానించింది సన్మాన సభకు ఆచార్య డాక్టర్ దివాకర్ల వెంకటావదాని అద్యక్షత వహించారు ముఖ్య అతిదిగా శ్రీ కె ఎస్ శర్మ (ఐ ఏ ఎస్) విచ్చేశారు తెలుగు విజ్ఞాన పీఠం ప్రత్యేకాధికారి డాక్టర్ తూమాటి దొణప్ప ప్రత్యేక-సంచికను ఆవిష్కరించారు పోలీస్ కమిషనర్ శ్రీ ఆర్ ప్రబాకరరావు కాశ్మీర్ శాలువలతోను, నూటపదార్లతోను సన్మానించారు శ్రీ తిరుమల దేశబక్తాచార్యులు శ్రీమతి సర్వలక్ష్మి, వంశీ సంస్థ అద్యక్షులు శ్రీ రామరాజు, ప్రఖ్యాత ఇంద్రజాలికుడు శ్రీ బి వి పట్టాబిరాం శ్రీ తిరుమల రామచంద్రను శాలువలతోను, నూతన వస్త్రాలతోను సత్కరించారు ప్రారంబంలో విజ్ఞాన దీపిక అద్యక్షులు శ్రీ కె వై ఎల్ నరసింహారావు స్వాగతం చెప్పి శ్రీ తిరుమల రామచంద్రను పరిచయం చేశారు డాక్టర్ దొణప్ప తమ ప్రసంగంలో తిరుమల రామచంద్ర వంటి వారి విద్వత్తను విజ్ఞాన పీఠం వినియోగించుకుంటుం-దని హామీ యిచ్చారు తిరుమల రామచంద్ర సన్మానానికి కృతజ్ఞత తెలిపారు విజ్ఞాన దీపిక కార్యదర్శి శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు దన్యవాదాలతో కృష్ణ జయంతి వుత్సవాలు సమాప్తమయ్యాయి

## కర్నాటక చిత్రకళా ప్రదర్శనం :-

తెలుగు విజ్ఞానపీఠం ఆధ్వర్యాన కర్నాటక లలితకళా అకాడెమీ వర్ణచిత్రాల, డ్రాయింగుల, గ్రాఫిక్కుల ప్రదర్శనం కళాశ్రేణికలో అగస్టు 27 నుంచి 31 వరకు జరిగింది సాంస్కృతిక శాఖామంత్రి శ్రీమతి ప్రతిభాభారతి ప్రారంబోత్సవం జరిపారు లఘుపరిశ్రమల శాఖామాత్యులు శ్రీ ఎస్ రామ-చంద్రారెడ్డి ప్రసంగిస్తూ కళాభివృద్ధికి తెలుగుదేశం ప్రభుత్వం చాల కృషి చేయగలదని హామీ ఇచ్చారు విజ్ఞానపీఠం ప్రత్యేకాధికారి డాక్టర్ తూమాటి దొణప్ప అందరినీ ఆహ్వానిస్తూ, అకాడెమీలు రద్దు కాలేదని విజ్ఞానపీఠంలో విలీనమయాయని ముందుకన్నా ముమ్మరంగా ఆయా అకాడెమీల కార్యకలాపాలు జరుగుతున్నాయని వివరించారు వీటిని పరిశీలించక కొన్ని పత్రికలు ఏమీ జరగడం లేదని, సిబ్బంది కూడ పనీపాటా లేక ఈగలు తోలుకుంటూ ఉన్నదని ఆక్షేపించడం సబబుకాదని, వారు ఎప్పుడుబడితే అప్పుడు వచ్చి తనిఖీ చేసుకోవచ్చునని అన్నారు కర్నాటక లలితకళా అకాడెమీ అధ్యక్షుడు శ్రీ సోమశేఖర్ ఎం సాలీ ఈ చిత్రకళా ప్రదర్శనలు రాష్ట్రప్రభుత్వాల ఆదాన-ప్రదాన పథకాల కింద జరుగుతున్నాయని వివరించారు విజ్ఞానపీఠం రీసెర్చ్ ఆఫీసర్ శ్రీ సి రామచంద్రరావు వందన సమర్పణ చేశారు ఈ ప్రదర్శనంలో 41 కళాఖండాలున్నాయి సమసా-మయిక సమస్యల మీద ఉన్న చిత్రాలు ప్రేక్షకులను ఆకర్షించాయి బస్సుల రద్దీని తెలిపే చిత్రం సహజాతి సహజంగా వుంది

## శ్రీ ఎం. వి. నారాయణరావుకు కిన్నెర అవార్డు :-

కళాహృదయులు, సాహిత్యవేత్తలు -పోషకులు, పోలీసు డైరెక్టర్ జనరల్ (రిటైర్డ్) శ్రీ ఎం వి నారాయణరావును కిన్నెర ఆర్ట్ ధియేటర్ వారు కిన్నెర అవార్డుతో సత్కరించారు ఈ సత్కారసభ ఆగస్టు 30న రవీంద్ర బారతిలో వైబవోపేతంగా జరిగింది గవర్నర్ డాక్టర్ శంకరదయాళ్‌శర్మ

హైదరాబాద్‌లో ప్రముఖ సాంస్కృతిక సంస్థ విజ్ఞాన దీపిక సెప్టెంబర్ 7వ తేదీన త్యాగరాజ గాన సభలో శ్రీ తిరుమల రామ చంద్రను సన్మానించినప్పటి చిత్రం పోలీస్ కమిషనర్ శ్రీ ఆర్ ప్రభాకరరావు శ్రీ రామ చంద్రను సన్మానిస్తున్నారు మధ్యన ఉన్నవారు విజ్ఞాన దీపిక అధ్యక్షులు శ్రీ కె వై ఎల్ నరసింహారావు. కుడి చివర విజ్ఞాన దీపిక కార్యదర్శి శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు ఆనాడు కూచిపూడి నృత్యం చేసిన సుప్రసిద్ధ నర్తకి కుమారి జొన్నలగడ్డ అనూరాధ.



ఆంధ్రపత్రిక పాఠకులకు చక్కటి అవకాశం!



## కళ్యాణవేదిక
### ఉచిత సమాచారం



వధూవరుల సమాచారము ఉచితంగా
ప్రతి బుధవారం ప్రకటిస్తాము.
సమాచారం పంపేవారు
ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.

★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.

★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు ఉచితంగానే వాటికి సంబంధించినవారికి నెల రోజులలోపు పంపడం జరుగుతుంది.

★ ఈ శీర్షికను కుల మత వర్గ బేధాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.

★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కాపున స్వంత అడ్రసు గల కవర్లు లేదా స్టాంపులు జతపర్చకూడదు.

★ ప్రకటనను ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు దానిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.

★ ఇతర విధమైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

★ సమాచారము పంపేవారు క్రింది కూపను పూర్తిచేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.

★ కళ్యాణవేదిక శీర్షిక ద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన వచ్చినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

### కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను

పేరు... ... ... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ...పిన్‌కోడ్... ... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటుసంతకం.......................

## హైదరాబాద్ నోట్‌బుక్

ముఖ్యఅతిథిగా విచ్చేసి ది క్వింటిసెన్స్ ఆఫ్ ది రామాయణ' అనే గ్రంథాన్ని ఆవిష్కరించారు కేంద్ర కార్మిక శాఖామాత్యులు శ్రీ టి అంజయ్య సభను ప్రారంభించగా, శ్రీ ఆవుల సాంబశివరావు అధ్యక్షత వహించారు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు కిన్నెర అవార్డు బహూకరించారు ప్రత్యేక సంచికను సార్వత్రిక విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ డాక్టర్ సి నారాయణరెడ్డి ఆవిష్కరించారు శ్రీయుతులు ఎం మహేందరరెడ్డి, పి ఎ రంగయ్యనాయుడు ఆర్ ప్రభాకరరావు, పి ఎల్ సంజీవరెడ్డి, పి జగన్‌మోహన్, డాక్టర్ నటరాజరామకృష్ణ శ్రీ నారాయణరావును అభినందించారు కార్యదర్శి శ్రీ మాద్దాళి రఘురాం దన్యవాదాలు చెప్పారు

### దోమలు! దోమలు!!

మొదట భాగీరధి నగరంగా, తర్వాత భాగ్యనగరంగా పిదప హైదరాబాద్‌గా వున్న రాష్ట్ర రాజదాని నేడు మశక మహానగరంగా రూపుదిద్దుకుంది మూసీనది ఒకప్పుడు పవిత్రంగా వుంది. నేడు హైదరాబాద్ మురుగునీరంతా కలిసి వైతరణీ నదితో పోటీ పడుతున్నది వైతరణిలో ప్రేతాత్మలు వుండడం వల్ల దానికి ప్రేత అనే పేరు మూసీలో ప్రేతాత్మలతో స్పర్ధించే దోమలు నివసిస్తున్నాయి అవి నగరవాసుల పాలిట మహామారిగా తయారయ్యాయి ఈ బాధపడలేక సెప్టెంబర్ 11వ తేదిన మలక్‌పేట మురికివాడల వారు భారత కమ్యూనిస్టుపార్టి నాయకత్వాన మునిసిపల్ కార్పొరేషన్ ఆఫీసు వరకు ఊరేగింపుగా వెళ్ళి ప్రత్యేకాధికారి శ్రీ అర్జునరావును కలుసుకొని మశక బాధ తొలగించండి మహాప్రభో అని –వినతి పత్రం సమర్పించారు మూసీ నదీతీరంలో పచ్చిగడ్డి పెంచడం నిషేధించాలని, పొగ వదిలే యంత్రాన్ని ప్రత్యేకంగా కేటాయించాలని, రోడ్డు, మురుగు కాలువలు బాగుపరచాలని వారు కోరారు ప్రతినిది వర్గానికి శ్రీ అజీజ్‌పాషా నాయకత్వం వహించారు ఈ దోమల బెడద మూసారాంబాగ్, దిల్‌సుఖ్‌నగర్ అటుతర్వాత వున్న అన్ని కొత్త కాలనీలలోను, విద్యానగర్ మున్నగు మూసీ తీర ప్రాంతాలలోను వుంది

### ఉపశ్రుతి :–

తాతా, తాతా గేదె నల్లగా వుంటుందే పాలు తెల్లగా ఎందుకు వుంటాయి?––అనడిగాడు మనమడు ఐదేళ్ళ ఉదయనుడు బాబూ, నీకిది అర్థం కాదులే నల్లధనాన్ని తెల్లగా చేసుకోవచ్చునడానికి ఇదొక ఉదాహరణం –అన్నారు పక్కన వున్న ఒక ప్రజానాయకుడు

–తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3, Editor S Radhakrishna,
Phones P B X 61247, 61248 & 75667

# అమృతాంజన్ పోటీ




ప్రముఖ నిర్మాణాలను గుర్తించే పోటీ

**రూ. 2,75,000 ల విలువగల బహుమతులు గెలుచుకోవచ్చు**

భలే తేలిక! మీకిక్కడ ప్రపంచంలో ప్రసిద్ధికెక్కిన 5 ప్రముఖ నిర్మాణాలకు చెందిన చిత్రాలిచ్చాం వాటి పేర్లు గూడా 1నుంచి 5 నంబర్లదాకా ఇచ్చాం మీరు చెయ్యవలసిందల్లా క్రింద ఇవ్వబడిన బాక్సులలో ఏ నిర్మాణానికి ఏ నంబరు సరిపోతుందో గుర్తించి ఆ నంబరు ఆ బాక్సులో వెయ్యడం

తరువాత క్రింది బాక్సులో ఇవ్వబడిన వాక్యాన్ని 10 అదనపు మాటలకు మించక ఉపయోగించి పూర్తి చేయండి

12 గ్రాముల అమృతాంజన్ సీసాకు చెందిన ఖాళీ అట్టపెట్టె ఒకటి జతచేసి మీ ఎన్‌ట్రీలను పంపండి ఈ ప్రకటనను ఒక ఎన్‌ట్రీఫారంగా మీరు ఉపయోగించవచ్చు

త్వరపడండి! ఎన్‌ట్రీలు పంపడానికి చివరితేదీ అక్టోబర్ 15

అమృతాంజన్ బాధా నివారిణి - తలనొప్పులు వళ్లునొప్పులు కండరాల నొప్పులు వాపులు వగైరాలనుండి త్వరిత నివారణకు



**10** మొదటి బహుమతులు
కలర్ టివిలు



**100** 2వ బహుమతులు
14" నలుపు & తెలుపు టివిలు



**200** 3వ బహుమతులు
ఎలెక్ట్రానిక్ వాచీలు







1 స్టాచూ ఆఫ్ లిబర్టీ
2 తాజ్‌మహల్
3 గోమతేశ్వర ప్రతిమ
4 సెయింట్ పీటర్స్ స్క్వేర్
5 లీనింగ్ టవర్ ఆఫ్ పీసా

నేను అమృతాంజన్ పెయిన్ బామ్ ఉపయోగిస్తాను
ఎందుకంటే ____________________
____________________
____________________
పేరు ____________________
విలాసం ____________________
____________________
____________________

పోటీ నియమ నిబంధనలు

1 ఈ పోటీలో అమృతాంజన్ లిమిటెడ్ వారి ఉద్యోగులు వారి ఎడ్వర్‌టైజింగ్ ఏజెన్సీల వారి బంధువులు తప్ప తక్కిన భారతీయ పౌరులెవరైనా పాల్గొనవచ్చు
2 మీరు ఎన్ని ఎన్‌ట్రీఫారాలైనా పంపవచ్చు అయితే ప్రతి ఎన్‌ట్రీతోబాటు 12 గ్రాముల అమృతాంజన్ సీసాకు చెందిన అట్టపెట్టె ఒకటి తప్పని సరిగా జతచేసి పంపాలి
3 ఎన్‌ట్రీలు పెన్సిల్‌తో వ్రాసివున్నా చెరిపి వ్రాసిన గుర్తులున్నా వంకరటింకర వ్రాతలయినా అస్పష్టంగావున్నా స్టాంపులు అంటించకపోయినా తక్కువ స్టాంపులంటించినా ఆ ఎన్‌ట్రీలు ఆమోదించబడవు
4 మీరు జతచేసే అట్టపెట్టెలు నలిగి పోయివున్నా విరిగి చెదిరి పోయివున్నా ఆ ఎన్‌ట్రీలు ఆమోదించబడవు
5 మీరు అమృతాంజన్ సీసాకొన్న రిటెయిలర్ పేరు అడ్రసు లేని ఎన్‌ట్రీఫారాలు స్వీకారయోగ్యం కావు
6 రవాణాలో మీ ఎన్‌ట్రీ ఫారాలు మాకందకపోయినా ఆలస్యం జరిగినా అందుకు అమృతాంజన్‌వారు బాధ్యులు కారు
7 ఎన్‌ట్రీఫారాలు ఇంగ్లీషులోగాని ఏ ఇతర భారతీయ భాషలోగానీ వ్రాయవచ్చు
8 ఎన్‌ట్రీలమీద తీర్పు చెప్పడానికి నియమింపబడిన న్యాయనిర్ణేతల తీర్పే అంతిమ నిర్ణయంగా శిరోధార్యంగా భావించబడుతుంది
9 పోటీ విషయంగా ఉత్తర ప్రత్యుత్తరాలు నడపబడవు
10 మాకు చేరిన ఎన్‌ట్రీలమీద స్లోగన్‌లమీద స్వామ్యం అమృతాంజన్ లిమిటెడ్ వారిదే
11 బహుమతుల చెల్లింపు అందుకు సంబంధించిన నిబంధనల ననుసరించి చేయబడుతుంది
12 పూర్తి చేయబడిన ఎన్‌ట్రీలు 12 గ్రాముల అమృతాంజన్ సీసాకు చెందిన ఖాళీ అట్టపెట్టెతో సహా కవర్లలో వేసి "అమృతాంజన్ కంటెస్ట్" అని వ్రాసి అమృతాంజన్ లిమిటెడ్ 42-45 లజ్ చర్చ్ రోడ్ మైలాపూర్ మద్రాస్-4 అనే చిరునామాకు 1985 అక్టోబర్ 15 నగానీ అంతకు ముందుగాగాని మాకు చేరేటట్లు పంపాలి
13 విజేతలకు పోస్టుద్వారా తెలియపరచడమేగాక మొదటి బహుమతి విజేతల పేర్లు ప్రముఖ దినపత్రికల్లో ప్రకటించబడగలవు

90 సంవత్సరాలుగా సుప్రసిద్ధమైన

**అమృతాంజన్**

ఏ ఇతర బాధనూ కలుగచేయదు. శ్రమనివారిణి నమ్మకమైనది

డీలర్ యొక్క పేరు ____________________
____________________
విలాసము ____________________
____________________

OBM 9257/TG

Regd No H/VJ 41 ANDHRA SACHITRA VARA PATRIKA
11-17 OCTOBER 85

# ఇప్పుడు మీకోసం తెచ్చాం
# కొత్తరుచులను మేళవించిన క్రీమ్‌బిస్కెట్లు

ఇలాచీ క్రీమ్ బిస్కెట్లు
ఆరెంజ్ క్రీమ్ బిస్కెట్లు
పైనెపిల్ క్రీమ్ బిస్కెట్లు
చాకలెట్ క్రీమ్ బిస్కెట్లు




అసోకా®

బిస్కెట్లు




రుచి చూడండి ఆనందించండి అసోకా బిస్కెట్లతో కలిసి మెలిసి ఉండండి

TARA/AB/34/85